# అరుణతార


సంపుటి: 38 సంచిక: 5 మార్చి 2015

పేజీలు: 56 వెల: రు. 15

సాహిత్య, సాంస్కృతిక మాసపత్రిక 312


## సామాజిక ఉద్యమాలు - ప్రజాస్వామిక విప్లవం

## విరసం సాహిత్య పాఠశాల



7, 8 ఫిబ్రవరి 2015, బొబ్బిలి



# బొబ్బిలి సాహిత్య పాఠశాలలో ప్రసంగాల దృశ్యమాలిక














# -: స్వీకారం :-

జాజిపూల పరిమళం
షహీదా కథలు
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 150/-
పేజీలు : 392

ఒక మాట
ఒక సంభాషణ
షహీదా కవిత్వం
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 75/-
పేజీలు : 144

సామాన్యుల సాహసం
మైనా నిత్య సుజాత
కథలు
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 60/-
పేజీలు : 117

కథల పంట
3
ప్రచురణ :
విప్లవ రచయితల
సంఘం
వెల : రు. 120/-
పేజీలు : 232

పద్మకుమారి
పాల్గుణ
నవలిక
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు.
పేజీలు :

నల్లమల
పి. చంద్
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 225/-
పేజీలు : 419

ముడిమనిషి
అరుణతార కథలు
(1974-79)
సంకలనం - 1
ప్రచురణ :
చరిత
వెల : రు. 30/-
పేజీలు : 96

చేపలు
అరుణతార కథలు
(1979-1982)
సంకలనం - 2
ప్రచురణ :
చరిత
వెల : రు. 30/-
పేజీలు : 96

సాదత్ హసన్ మంటో
తీత్వాల్ కుక్క
మరికొన్ని కథలు
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 60/-
పేజీలు : 110

దండకారణ్యం
ఒక ఆకుపచ్చని కల
కెనరీ
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 40/-
పేజీలు : 40

ఏప్రిల్ పండు
రివేరా కవిత్వం
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 30/-
పేజీలు : 54

బాసిత్ కవిత్వం
తెహల్కా అద్దంలో
సర్కారు బింబం..
మరికొంత కవిత్వం
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 100/-
పేజీలు : 192

బాసిత్ నాటకం
ఆఖరి బిడ్డ
(మా సగం.. మా
హక్కు)
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 10/-
పేజీలు : 24

ఈలం
నెత్తుటిబంద యుద్ధకవిత్వం
వేముల ఎల్లయ్య
దానక్క ఉదయ్‌భాను
ప్రచురణ :
గుంపు సాహితి సంస్థ
వెల : రు. 50/-
పేజీలు : 110

లాల్ బనో
గులామీ ఛోడో
బోలో వందేమాతరం
ఎన్ కె
ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం
వెల : రు. 25/-
పేజీలు : 48

5


# అరుణతార

సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

312

సంపుటి : 38 ◆ సంచిక : 5 ◆ మార్చి, 2015





సంపాదకుడు
**చలసాని ప్రసాద్**
వర్కింగ్ ఎడిటర్
**డి.వి. రామక్రిష్ణారావు**
ఎం.ఐ.జి. - 14, ఎ.పి.ఐ.ఐ.సి. కాలనీ,
కార్బైడ్ కంపెనీ ఎదురుగా,
మౌలాలి, హైదరాబాద్ - 500 040.
* కేవలం పోస్ట్, బుక్‌పోస్ట్ ల ద్వారా
రచనలు పై చిరునామాకూ,
ఇ-మెయిల్ ద్వారా
**arunatara1977@gmail.com** కూ
పంపవచ్చు
సంపాదకవర్గం :
**ఉజ్వల్, బాసిత్, కూర్మనాథ్**

**చందాలు పంపాల్సిన చిరునామ**
మేనేజర్
**వలేటి అరవింద్ కుమార్**
భీమ్‌సేన్‌రావు, 1-9-52/ఎఫ్/2,
ఈ-సేవ దగ్గర, మదర్ హైస్కూల్ ఎదురుగా,
రామ్‌నగర్, హైదరాబాద్ - 500020.
**సెల్ : 8142200711**
**(ఫోన్ చేయాల్సిన సమయం**
**ఉ.10 గంటల నుండి మ. 1 గంట వరకు)**

**విరసం కార్యదర్శి చిరునామా**
**పి. వరలక్ష్మి**
5-1820, గీతాశ్రమం వీధి,
ప్రొద్దుటూరు, కడప జిల్లా - 516 360.
**డి.టి.పి. అండ్ లే అవుట్**
**ఆర్. భాగ్యలక్ష్మి**
1, 8 కవర్ డిజైన్
**పి. వరలక్ష్మి, క్రాంతి**
2-7 కవర్ డిజైన్
**ఆర్. భాగ్యలక్ష్మి**
కవర్ ఫొటోలు
**కె. బాల్‌రెడ్డి, కెక్యూబ్‌వర్మ,**
**క్రాంతి, పి. మేఘరాజు**

Like Page://arunatara viplava rachayitala sangham

Virasam website : *www.virasam.in*

**ఈ సంచిక వెల : రు. 15/-**


## సంపాదక లేఖ...

ఫిబ్రవరి 5, 6 తేదీల్లో బొబ్బిలిలో జరిగిన సాహిత్య పాఠశాల ప్రజాస్వామిక విప్లవోద్యమ క్రమంలో సామాజిక ఉద్యమాలను అధ్యయనం చేసింది. విప్లవం కోసం విరసం ఎంచుకున్న అధ్యయన, బోధనా లక్ష్యం ఈ పాఠశాలలో మరింత ఇనుమడించింది. ప్రజాస్వామిక విప్లవ దశను వివరించే క్రమంలో సామాజిక ఉద్యమాల గురించి ఆది నుంచి విరసం ఈ అధ్యయనం చేస్తూనే వచ్చింది. కనీసం భక్తి ఉద్యమ కాలం నుంచి సామాజిక, భాషా, సాహిత్య, సాంస్కృతిక రంగాల్లో వేర్వేరు రూపాల్లో, భిన్న కంఠ స్వరాల్లో వినిపించిన సాంఘిక విముక్తి కాంక్షను ఈ సాహిత్య పాఠశాల మరింత సూత్రబద్ధం చేసింది. అట్టడుగు కులాల నుంచి భూస్వామ్య భావజాలంపైన, బ్రాహ్మణీయ సాహిత్య సాంస్కృతిక ఆధిపత్యం పైన సాగిన ధిక్కారాల పలుకుబడిని వలస, వలసానంతర కాలాల్లోని ప్రజాస్వామిక విప్లవ క్రమంలో విశ్లేషించింది.

నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాల ఆరంభ దశ తర్వాత దేశీయంగా, అంతర్జాతీయంగా మారిన వ్యవస్థాగత పరిణామాల్లో, కొత్త మేథో ప్రపంచంలో భాగంగా నూతన ప్రజాస్వామిక విప్లవ లక్ష్యంతో సాగుతున్న అధ్యయన క్రమాల్లో ఈ పాఠశాల కూడా ఒక విశిష్ట ప్రయత్నం. ఉత్పత్తి సంబంధాల మార్పు కోసం జరుగుతున్న రాజకీయార్థిక విప్లవం సాంఘిక సంబంధాల్లోని పీడన, వెలి, వివక్షల పరిష్కారానికి అవసరమైన ఆవరణను ఎలా అందించగలదో ఉత్తర తెలంగాణ నుంచి దండకారణ్యం దాకా సాగుతున్న వర్గపోరాట అనుభవాలను ఈ పాఠశాల లోతుగా అధ్యయనం చేసింది.

ప్రాచీన కాలం నుంచి ఈ నేల మీద సాగుతున్న బ్రాహ్మణేతర, భౌతికవాద ఆలోచనా ధారలకు వలస కాలంలోని సామాజిక, సాంస్కృతిక, సాహిత్య రంగాల్లో తిరుగులేని ప్రతినిధిగా మహాత్మా ఫూలే స్థానాన్ని విస్పష్టం చేసింది. సామాజిక సిద్ధాంతకారుడిగా, దళిత ఉద్యమకారుడిగా అంబేద్కర్ విభిన్న రంగాల్లో సాగించిన విశేష కృషిని మరోసారి విమర్శనాత్మకంగా అంచనా వేసింది. తెలుగు సాహిత్యంపై ఫూలే, అంబేద్కర్‌ల ప్రభావాన్ని విశ్లేషించింది.

సాంఘిక విముక్తి ఆకాంక్షల ముందు బూర్జువా మార్గం, విప్లవ మార్గం రెండూ ఉన్నాయని, విప్లవ మార్గంలోనే అర్థవంతమైన సాంఘిక విముక్తి సాధ్యమని స్పష్టం చేసింది. దళిత ప్రజాస్వామిక విప్లవ శక్తుల నాయకత్వంలో శక్తివంతమైన సాంఘిక ఉద్యమాలు వెల్లువలా జరిగినప్పుడే సాంఘిక విముక్తి సాధ్యమని, హిందూ బ్రాహ్మణీయవాదం పెచ్చరిల్లిపోతున్న తరుణంలో కులం... మతం లక్ష్యంగా ఈ పోరాటాల అవసరం పెరిగిందనే అవగాహనను మరోసారి బలంగా చెప్పింది. ఈ విషయంలో కమ్యూనిస్టు విప్లవోద్యమ ఆచరణ బలపడాల్సి ఉందని, సిద్ధాంత, రాజకీయ స్పష్టతను మరింతగా పెంచుకోవాల్సి ఉందని, ముఖ్యంగా హిందుత్వకు వ్యతిరేకంగా కేవలం భావజాల, సాంస్కృతిక పోరాటం మాత్రమే చాలదని, మిలిటెంట్ శక్తిగా కూడా ఎదగాల్సి వస్తుందని పాఠశాల అభిప్రాయపడింది.

తమిళ రచయిత పెరుమాళ్ మురుగన్ రచనా స్వేచ్ఛపై సంఘపరివార్ దాడి కేవలం ఒక ప్రమాద సంకేతం. అట్టడుగు కులాల అభివ్యక్తి, వికాసం, అస్తిత్వ ఆకాంక్ష, మైనారిటీ మతస్తుల జీవించే స్వేచ్ఛ సంక్షోభంలోపడి పోతున్న తరుణంలో ఈ సాహిత్య పాఠశాల జరిగింది. సామాజిక ఉద్యమాలను మార్క్సిస్టు సంవిధానంలో ఎలా అర్థం చేసుకోవాలనే గంభీరమైన ప్రశ్నపై విప్లవ శిబిరంలో జరుగుతున్న చర్చకు ఈ పాఠశాల అందించిన విశ్లేషణలు తప్పక దోహదపడతాయనే నమ్మకం ఉంది. మార్క్సిస్టు సామాజిక సిద్ధాంత పద్ధతిని ఎలా అర్థం చేసుకుంటున్నాం? దానికి దృఢంగా కట్టుబడి వర్గ దోపిడీ వలె కులం, మతం వంటివాటిని విశ్లేషించడంలో శాస్త్రీయతను పరిపుష్టం చేయడమెలా? అనేవే కీలక ప్రశ్నలు. మార్క్సిస్టు లెనినిస్టు సాహిత్య సంస్థగా విరసం ఈ ప్రశ్నలను తన అధ్యయనానికి తెరచాపల వలె భావిస్తోంది. విస్తారంగా సాగవలసిన అధ్యయనాన్ని ఇవి నిరంతరం అప్రమత్తం చేస్తుంటాయి. బొబ్బిలి పాఠశాల ఈ విషయంలోకూడా విరసం అవగాహనను ఇనుమడింపజేసిందని చెప్పవచ్చు.



## సంచిక - 312






అరుణతార చదవండి!
చదివించండి!
చందాదారులు కండి!

చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి.
డి.డి.లను **వలేటి అరవింద్ కుమార్, హైదరాబాద్** పేర తీయండి.
విడి సంచిక వెల - రు. 15; సంవత్సర చందా - రు. 180;
రెండు సంవత్సరాల చందా - రు. 350; మూడు సంవత్సరాల చందా - రు. 500;
ఐదు సంవత్సరాల చందా - రు. 800; దశాబ్ది చందా - రు. 1600/-

**మీ రచనలను అరుణతారకు ఈ-మెయిల్ కూడా చేయవచ్చు!**
పేజ్‌మేకర్ ఓపెన్ ఫైల్, పి.డి.ఎఫ్. పద్ధతులలో (అను 6.0లో అయితే మేలు),
మైక్రోసాఫ్ట్ వర్డ్, ఎం.ఎస్. భాషాలో కూడా అరుణతారకు మెయిల్ చేయగలరు
**ఈ-మెయిల్ : arunatara1977@gmail.com**
**Like Page://arunatara viplava rachayitala sangham**
**Website : www. virasam. in**

# 'ఆమ్ ఆద్మీ' ప్రాతినిధ్యమేనా?

- పి.వరలక్ష్మి

ఢిల్లీ ఎన్నికల్లో బి.జె.పి. ఓటమిని సెక్యులర్ ప్రజాస్వామిక శక్తులు సెలబ్రేట్ చేసుకున్నాయి. సంఘపరివార్ దూకుడుకు కళ్లెం పడుతుందనే నమ్మకం లేకపోయినా అదో అల్ప సంతోషం. పార్లమెంటులో బి.జె.పి. అధికారాన్ని కైవసం చేసుకుందో లేదో దేశ రాజధాని నగరంలో వరుసగా చర్చిలపై దాడులు జరిగాయి. ముస్లింవాడలపై హిందుత్వ శక్తుల బరితెగింపు, ముఖ్యంగా త్రిలోక్‌పురిలో జరిగిన ముజఫర్‌నగర్ వంటి ప్రయోగం భీతావహ వాతావరణాన్ని సృష్టించింది. సంఘపరివార్ కుయుక్తి అన్ని సార్లూ ఎన్నికలను గెలవకపోవచ్చు. మోడీ లౌడ్‌స్పీకర్ల గొంతులోనూ పచ్చి వెలక్కాయ పడింది. ఈ గెలుపోటముల మీద ఇప్పటికే ఎన్నో విశ్లేషణలు జరిగాయి కాని ఈ కొత్తపార్టీ ఏదో కాస్త కొత్తగా కనపడుతోందనే చర్చ అన్ని రకాల బృందాల్లో వినపడుతోంది.

ఎన్నికల రంగస్థలం మీద ఎన్నో కొత్త పార్టీలు పుట్టాయి. వాటి పుట్టుక వెనక సమాజంలో కొత్త రాజకీయార్థిక సమీకరణలు జరిగాయి. వాటికి ప్రాతినిధ్యం వహిస్తున్న వర్గం ఏదైనా ప్రతిసారీ అవి ప్రజల సమస్యలను ఏదో ఒక కోణంలో చర్చకు పెడుతున్నాయి. అవి ఏ మేరకు ప్రగతిశీల పాత్ర పోషిస్తాయి అనేకన్నా అవి ఆయా సందర్భాలలో ముందుకు వచ్చిన ప్రజల ఆకాంక్షలను పార్లమెంటరీ రాజకీయ చట్రంలోపల బలమైన సమీకరణలుగా మలచుకోగలిగాయనేదే ముఖ్యం. ద్రవిడ ఉద్యమం సహా అనేక ప్రాంతీయ ఉద్యమాల నుండి వాటి ప్రాతినిధ్య పార్టీలు తలెత్తడం చూశాం, చూస్తున్నాం. సుదీర్ఘ కాలం పాతుకుపోయిన సంప్రదాయ పాలక పార్టీ మీద ప్రజలకు ఏవగింపు కలిగిన దశలో, వ్యవస్థనే ప్రశ్నించే పోరాటాలు వెల్లువెత్తిన దశలో 'సంపూర్ణ క్రాంతి' అంటూ జయప్రకాశ్ నారాయణ వచ్చాడు. అన్ని రకాల నినాదాలు ఎన్నికల నోట్లో పడి పార్లమెంటులో జీర్ణమయిపోయాయి. ఈ క్రమంలో జరిగిందేమిటంటే కాంగ్రెస్ వ్యతిరేకత మీద ఆర్.ఎస్.ఎస్. శక్తులు బలం పుంజుకున్నాయి. కేవలం ఎన్నికల నినాదాలే కాదు, విచ్ఛిన్నకర భావజాలాన్ని నిర్మాణాత్మకంగా జనంలోకి ఎక్కించే ప్రయత్నాలు అవి కింది స్థాయి నుండి చేస్తూ వచ్చాయి. మరో వైపు పార్లమెంటరీ పంథాలో సోషలిజం సాధిస్తామన్న వామపక్షాలు సోషలిజం అన్న పదం కూడా మర్చిపోయి చాలా కాలం అయింది. ఇప్పుడీ కొత్త పార్టీ వ్యవస్థను ప్రక్షాళన చేస్తానంటూ చీపురు పట్టుకొని వచ్చింది.

'మరో కొత్త పార్టీ, అంతే కదా అని తీసేయకండి. ఇది ఆషామాషీగా పుట్టింది కాదు. ఇది రాంలీలా మైదాన్, జంతర్ మంతర్ ఉద్యమాల నుండి పుట్టింద'ని ఆమ్ ఆద్మీ పార్టీ (ఎ.ఎ.పి.ఆర్) తన గురించి తాను చెప్పుకుంటుంది. నాలుగేళ్ల క్రితం సూపర్ హిట్టయిన అన్నా హజారే షో అందరికీ గుర్తుండే ఉంటుంది. అన్నా ఈజ్ ఇండియా, ఇండియా ఈజ్ అన్నా అంది మీడియా. అవినీతి వ్యతిరేక ఉద్యమం పేరుతో జరిగిన సభల్లో, ర్యాలీల్లో స్కూలు పిల్లల నుండి కుంభకోణాల్లో కూరుకుపోయిన పార్టీలదాకా ఇండియా జెండా ఊపుతూ ఉత్సాహంగా పాల్గొన్నాయి. స్వయంగా ఢిల్లీ మునిపల్ కమిషన్ అధికారులు రాంలీలా మైదానాన్ని చదును చేసి భారీ సభకు ఏర్పాటు చేశారు. ఎగువ మధ్య తరగతి కార్పొరేట్ ఉద్యోగులు, ఎన్.జి.ఓ.లు ప్రధానంగా కనపడిన అన్నా అవినీతి వ్యతిరేక ఉద్యమం అన్ని సమస్యలకు కారణం అవినీతి అని మాట్లాడింది. జనలోక్‌పాల్ బిల్లును సర్వరోగ నివారిణిగా చెప్పింది. మౌలిక సమస్యల్ని లేవనెత్తకుండా, కేవలం అవినీతి చుట్టూ వాదనలు చేసి జనాన్ని, ముఖ్యంగా మధ్యతరగతి వర్గాన్ని ఒప్పించగలిగింది.

అవినీతి అనేది సమస్యే. అయితే అది రోగమా, రోగలక్షణమా అన్నదే ప్రశ్న. అసమానతల వ్యవస్థలో అంతరాలు పెరిగేకొద్దీ అవినీతి పెరుగుతూ వస్తుంది. సంపద కేంద్రీకరణ, మార్కెట్ విస్తరణ, విలాసాల సంస్కృతి అన్నిటికీ కారణం పెట్టుబడి విపరీతంగా పోగుపడటమే. అవినీతి గురించి మాట్లాడటానికన్నా ముందు నీతి గురించి మాట్లాడాలి. ఏ నీతి సమాజంలో వర్ధిల్లుతోంది అన్నదే మౌలిక ప్రశ్న. ఉదాహరణకు ప్రభుత్వాలు చట్టబద్ధంగా దోపిడి చేస్తే అది అవినీతి కాదు. కారు చవకగా అంబానీలకు పెట్రోలియం నిక్షేపాలను కట్టబెడుతున్నారని ప్రశ్నించవచ్చు. అయితే చట్టబద్ధంగా రేటు నిర్ణయించి టెండర్లు పిలిచి కార్పొరేట్ కంపెనీలకు వాటిని అమ్మితే అది అవినీతి కాదు. అప్పుడు ప్రశ్నించనక్కర్లేదు. కాని జనసామాన్యంలో అవినీతి అంటే ప్రభుత్వ సేవలకు లంచాలు తీసుకోవడం అనే సాధారణ అర్థంలో పైనుండి కింది దాకా అవినీతి అని అర్థమవుతూ ఉంటుంది. ఇక ఎన్నికల అవినీతి సరేసరి. అయితే ప్రభుత్వ సేవలు కార్పొరేట్లకు, సేవారంగమంతా కార్పొరేట్ కంపెనీలకు అనే నీతి మీద ఆర్థిక వ్యవస్థ నడుస్తూ ఉంది. అంతా ప్రైవేటీకరణ చేస్తే ఇక అవినీతి మాట ఉండదు, ఉత్తమ సేవలు అందుతాయి అని కూడా మాట్లాడుతుంటారు. ఇదంతా మధ్యతరగతి గొడవ. హక్కుగా అందవలసినవన్నీ మార్కెట్ సరుకులవుతాయి, డబ్బులివ్వకుండా మంచినీళ్లు కూడా తాగలేము అన్న వాస్తవం కాళ్ల కింద భూమిని కోల్పోతున్న వాళ్లకు బోధపడుతూనే ఉంది. అవినీతి వ్యతిరేక ఉద్యమాన్ని స్పాన్సర్ చేసిన వాళ్లలో పెద్ద పెద్ద కంపెనీలు, ఎన్.ఆర్.ఐ.లు ఉన్నారు. ఆ ఆందోళనల నుండి పుట్టుకొచ్చిన ఆమ్ ఆద్మీ పార్టీ వెనక కూడా బలమైన పెట్టుబడిదారీ వర్గం ఉంది. స్వయంగా అరవింద్ కేజ్రీవాల్, మనీష్ సిసోడియాలు నడిపే ఎన్.జి.ఒ.కు ఫోర్డ్ ఫౌండేషన్ పెద్ద మొత్తంలో విరాళాలిచ్చింది. పైన చెప్పిన మధ్యతరగతి మైండ్‌సెట్‌ను ఆమ్ ఆద్మీ పార్టీ తనవైపు తిప్పుకోగలిగింది. గత కొంత కాలంగా ప్రజాస్వామిక విలువలకు దూరమవుతూ వస్తున్న మధ్యతరగతి అటు ఆర్.ఎస్.ఎస్. వైపో, ఇటు ఆప్ వంటి పార్టీ వైపో మళ్లడం గమనించవచ్చు. ఇక జన్‌లోక్‌పాల్ ఏం చెబుతుంది? ప్రధాన మంత్రి సహా అత్యున్నత స్థాయి అధికారి కూడా దానికి జవాబుదారీగా ఉండాలంటుంది. మరి అది ఎవరికి జవాబుదారీగా ఉంటుంది? ప్రజల ప్రమేయం లేకుండా ఏర్పడే జన్‌లోక్‌పాల్ అనే స్వతంత్ర రాజ్యాంగేతర కమిటీలో ఎవరుండాలి? అన్నాహజారే టీంలోని ఎన్.జి.ఒ.ల వంటి వారా? ప్రజాస్వామికవాదులు ఈ ప్రశ్నలను అనాడే సంధించారు. వీటికి సమాధానం లేదు.

ఆమ్ ఆద్మీ పార్టీ క్రోనీ కాపిటలిజం గురించి మాట్లాడుతుంది. అంబానీ, ఆదానీలకు కారు చవకగా వనరులను కట్టబెట్టిన గుజరాత్ అభివృద్ధి నమూనాను అది సూటిగా ప్రశ్నించింది. ఢిల్లీలో 49 రోజుల అధికారంలోనే నేరుగా అంబానీతో ఢీకొంది. అందేవల్లనేమో అంతకు ముందు ఆప్‌కు ఎంతో ప్రచారం కల్పించిన మీడియా హఠాత్తుగా యూటర్న్ తీసుకుంది. (ఇటీవలి ఢిల్లీ ఎన్నికల విజయం తర్వాత మళ్లీ దాన్ని భుజాలకెత్తుకుంది) ఆప్ అవగాహన ప్రకారం రాజకీయాశ్రిత పెట్టుబడి

# డాక్టర్ కేశవరెడ్డికి నివాళి

- పాణి

డాక్టర్ కేశవరెడ్డి తెలుగు నవలా చరిత్రలో విభిన్నమైన కంఠస్వరం. ఆయన ఇతివృత్తాల వలె ఆయనకే సాధ్యమైన వర్ణన మొట్ట మొదట పాఠకులను ఆకట్టుకుంటుంది. రాయలసీమ మాండలికంలోనే అక్కడక్కడా కొంచెం గ్రాంథిక స్పర్శ ఉంటుంది. ఒక సన్నివేశాన్ని రూపుగట్టించడంలో ఆయన చూపే నైపుణ్యం అరుదైనది. లోతైన మానవ సంవేదనలో ఒక రకమైన తాత్వికతను పలికించడం కేశవరెడ్డి విలక్షణత్వం. ఇదంతా మానవ భౌతిక జీవితాన్ని, సామాజిక వాస్తవికతను విస్మరించిన కళా విశేషం కాదు. వాస్తవితకను మరింతగా ఇనుమడింపజేసే కళా సృష్టి. మార్క్సిస్టు పరిభాషలోని సామాజిక సంబంధాల సంఘర్షణను మానవ సంబంధాల సృజనరూపంలోకి మార్చడమే సాహిత్యం చేసే ఒకానొక ముఖ్యమైన పని. కేశవరెడ్డి కొన్ని నవలల్లో ఆ పని బాగా చేశారు. దీనికి 'మూగవాని పిల్లనగ్రోవి'తో సరి సమానమైన రచన ఆయనే చేయలేకపోయారు.

స్థల కాల చిత్రణలో ఆయన సాంకేతికంగా అక్కడక్కడా లోపం చేశారనే విమర్శ ఉన్నప్పటికీ స్థల కాలబద్ధమైన జీవితాన్నే ఆయన దర్శించారు. ఎందుకంటే జీవితం తప్పనిసరిగా అట్లా గాక మరోలా ఉండటం దాని వాస్తవితకు విరుద్ధం. స్థల కాలబద్ధంగా ఉండటమంటే చలనంలో ఉండటమే. అత్యున్నత సృజన సాహిత్యం జీవితాన్ని నిశ్చల దృశ్యంగా, ఘనీభవించిన కాసారంగా చూడజాలదు. కావట్టి ఘర్షణాయుతంగా చిత్రించాల్సిందే. అయితే కేశవరెడ్డి నవలల్లోని స్థల కాలాలూ చర్చనీయాంశమే. ఆయన రచనా కాలం నాటికి అవి గతం. లేదా అప్పుడప్పుడే తెర వెనక్కి వెళుతున్న దృశ్యాలు. రాముడుండాడు రాజ్యముండాది.. నవలలో కొన్ని సమకాలీన పరిణామాలు కనిపించినా దాన్నాయన అంతక ముందటి జీవన స్థితి నుంచి పరిశీలించారనిపిస్తుంది. అందువల్ల సంఘర్షణ కూడా ఆ కాలపు జీవితానికే పరిమితమైంది. నిజానికి రాముడుండాడు రాజ్యముండాది ఇతివృత్తానికి వర్తమానంలోకీ విస్తరించే లక్షణం ఉంది.

ఆయన నవలల వల్ల పాఠకులు ఎంత సెన్సిటైజ్ అవుతారంటే.. మూగవాని పిల్లనగోవిలో ఆ గ్రామస్తుల (జానపదుల) విశ్వాసాల సంగతి అటుంచితే.. అందులోని మానవ విషాదం మనల్ని ఎంతకాలమైనా వెంటాడుతూనే ఉంటుంది. ముసలివాడు అడవిని జయించడంలోని సాహసం సామాన్యమైనదా? ప్రాచీన జీవన విశేషంలోని సాహసం, విచక్షణ అత్యంత ప్రతీకాత్మకంగా చిత్రించారు.

అందువల్లే కేశవరెడ్డి నవలా ఇతివృత్తాలు అందరినీ ఆకట్టుకుంటాయి. చివర్లో రాసిన మునెమ్మ నవల ఇతివృత్తమే వివాదాస్పదమైంది కావచ్చు. ఆ నవల గురించి స్వయంగా ఆయనే ఏం చెప్పుకున్నా.. అది ఆయన ప్రాతినిధ్య నవల కాజాలదు. కాబట్టి దాని చర్చలోకి వెళ్లకుండానే(దానిపై ఎవరి అభిప్రాయాలు వాళ్లు ఉంచుకుంటూనే) మొత్తంగా కేశవరెడ్డి నవలలను అంచనా వేయడం సాహిత్యరంగానికి చాలా అవసరం. అయితే ఆయన ఇతివృత్తాల వల్ల, ఎంచుకున్న పాత్రల వల్ల, వాతావరణ చిత్రణ వల్ల, కంఠస్వరం వల్ల కేశవరెడ్డిని ఆధునికానంతర రచయిత అని ఆనందించే వాళ్లు చాలా మందే ఉన్నారు.

ఆయన నవలల ఆధారంగా ఆధునికానంతర చర్చ అనే గారడీ చేయగల అవకాశం ఉందా? అనే ప్రశ్న అటుంచుదాం. ఆయన ఆధునికుడు. ఈ మాట ఎవరు చెప్పగలరు? మార్క్సిస్టులు మాత్రమే చెప్పగలరు. అయితే వాళ్లకు ఆధునికతపట్ల విస్పష్టమైన అవగాహన లేకుంటే ఈ పని చేయడం కష్టం. కాకపోతే ఆయన వాచ్యంగా చెప్పుకున్న విషయాల ఆధారంగా, ఆయన జీవితంలోని సన్నిహిత విషయాల ఆధారంగా చెప్పగలరు. ఇదీ ఒక మంచి పద్ధతే. కానీ ఆయన ప్రాతినిధ్య రచనల్లో వ్యక్తమైన దృక్పథం ఆధారంగా ఈ పని చేస్తే.. ఆయన ఆధునిక జీవితాన్ని, అందులోని ఘర్షణను ఎలా అర్థం చేసుకున్నారనే వైపు నుంచి విశ్లేషించవచ్చు.

వాస్తవానికి ఆయన కొన్ని ఆధునిక పూర్వ జీవన విశేషాలను తన నవలల్లో ఆధునిక దృక్పథంతో చూశారు. ఈ పని ఆయన ప్రతిభావంతంగా

---

స్వేచ్ఛాయుత పెట్టుబడి అభివృద్ధికి ఆటంకం. దాని మాటల్లో, మానిఫెస్టోలో ఒక ఆదర్శ పెట్టుబడిదారీ నమూనా కనపడుతుంది. అందువల్ల అది చిన్న పెట్టుబడిదారుల ప్రయోజనాల గురించి మాట్లాడుతుందనీ, జాతీయ బూర్జువా వర్గానికి ప్రతినిధి అనీ అనేవాళ్లున్నారు. వాళ్ల మద్దతు దానికి ఉండొచ్చు. అంతమాత్రాన అది నిజం కాదు. ఆప్ రాజకీయాశ్రిత పెట్టుబడిని విమర్శిస్తుంది గాని సామ్రాజ్యవాద మార్కెట్ ఆధిపత్యం గురించి అస్సలు మాట్లాడదు. గత కొంత కాలంగా రాజకీయ పార్టీల దన్నుతో భారతదేశ మార్కెట్‌ను, వనరులను పెద్దఎత్తున అక్రమించిన అంబానీల మీద ఎంతో మంది గుత్తపెట్టుబడిదారులకు విపరీతమైన అసహనం ఉంది. సహజంగానే కొత్త రాజకీయ సమీకరణలు జరిగే అవకాశం ఉంటుంది.

ఏదేమైనా ఆప్ పెట్టుబడిదారీ పునాది మీదే శుద్ధ ఆదర్శవాదం ప్రచారం చేస్తుంది. వ్యవస్థ రాజకీయార్థిక స్వభావం అర్థం చేసుకోగలిగితే ఆదర్శానికి, వాస్తవానికి ఎంత ఎడం ఉంటుందో అర్థమవుతుంది. అధికారంలోకి వచ్చాక అది ప్రజల కనీస అవసరాలను పట్టించుకుని ఉండొచ్చు. కొత్తగా పుట్టిన పార్టీల్లో అది విశేషం కాదు. ఢిల్లీలో మహిళల రక్షణ కోసం వేలాది సిసి కెమరాలు పెట్టి అందరి మీదా నిఘా పెడతాననడం వంటి విపరీత ధోరణులు సామ్రాజ్యవాద అభివృద్ధి నమూనాయే. జన్‌లోక్‌పాల్ ప్రతిపాదనకు తోడు ప్రజాస్వామిక జవాబుదారీతనం లేని నియంతృత్వ లక్షణాలు ఆర్.ఎస్.ఎస్. కుదురు నుండి వచ్చిన అనేక మంది కార్యకర్తలున్న ఆమ్ ఆద్మీ పార్టీలో ఉన్నాయి. ప్రశాంత్ భూషణ్ వంటి వారికి ప్రజల హక్కుల గురించి మాట్లాడే స్వేచ్ఛ లేకపోయింది. గతంలో ఆయన కశ్మీర్ నుండి మిలిటరీని వెనక్కి తీసుకుని ఆ ప్రాంతంలో ప్రజాస్వామిక వాతావరణం నెలకొల్పాలని మాట్లాడితే ఆ పార్టీ భరించలేకపోయింది. తాజా పరిణామాలు ఆ పార్టీ మిగతా బూర్జువా పార్టీలకన్నా భిన్నమైనదేమీ కాదని రుజువుచేస్తున్నాయి. వ్యక్తి కేంద్రంగా ఉన్న ఏ ఉద్యమంగాని, పార్టీగాని సమాజంలో మార్పు తీసుకురాకపోగా నియంతృత్వానికి దారి తీస్తుంది. కాబట్టి పేరులో ఉన్నట్లు అది సామాన్యుల పార్టీ కాదు. అది మరో పార్టీ. అంతే కాదు, అది మధ్యతరగతి భ్రమలు పెంచే పార్టీ. ఏదైతేనేం, బి.జె.పి.ని ఓడించింది కదా అని అనుకోవచ్చు. అయితే మతోన్మాద రాజకీయాలకు కేవలం మరో పార్టీ ప్రత్యామ్నాయం కాజాలదు.



# కోనమ్మ

- సిరికి స్వామినాయుడు

మిట్టమధ్యాహ్నం !
సెలయేరు నడచొచ్చినట్టు
ఆ చింతతోపుల ఆవలగూడేలనుండి
వచ్చేరు వాళ్లు పెళ్లిచూపులకి......!
అడుగుల్లో కదలాడే నీడల నల్లపిల్లుల్ని అదిలించి
వాళ్ల కాళ్లు కడిగింది డోకి !
నిలువెల్లా కళ్లతో.....
నిండుగా ఆహ్వానం పలికింది నులక మంచం !
అడవినాక ఆకుపచ్చని చీర చేసి దిగబెట్టేరు వాళ్లు !
కోరమీసం దువ్వేడు సిన్నోడు !
కొండమల్లెమొగ్గలా సిగ్గుపడింది కోనమ్మ !
చిలకాగోరింకలా చూడముచ్చటగా ఉంది జంట !
అందరూ ఆ శుభవేళ
తలా గుక్కెడు బిడ్డిసారా తాగేరు !

వచ్చే వసంతానికి పిలుపునిచ్చింది కోయిలమ్మ !
మరెందుకాలస్యమనుకుందో యేమో.....
ముహూర్తం పెట్టేసింది దీసరోడి చెట్టు !
మొల్లమంజిచ్చి, పెళ్లికూతుర్ని చేసేరు వాళ్లు !
'మా కోనలో పూసిన మొగ్గ ! పూవవ్వాల !
పిందెవ్వాల ! పండవ్వాల !
రేపటి పచ్చని లోకానికి పురుడోయాలం 'టూ
కిన్నెరపాటతో అప్పగింతలు పెట్టేరు వారంతా !

ఎండకా కొండమల్లె వాడిపోకుండా
లేతాకులగొడుగు పట్టేరు వాళ్లు !
కాళ్ల పారాణీ చెరిగిపోకుండా గంపలో వాగు దాటించేరు !
దారి పొడుగునా తుడుంగొట్టేరు ! సన్నాయి ఊదేరు !
థింసాలాడేరు ! కొండ జాకరకు మొక్కు చెల్లించేరు !
యీ వేడుకను చూసేందుకు ఉబలాటపడుతూ.....
సూరీడు, కోనమ్మ నుదుట కుంకుమబొట్టైపోయాడు !

ఆకుపచ్చని పెళ్లిపందిరయ్యింది అడవి !
ముత్యాలమండపమయ్యింది మంటికొండ !
కొండదేవరకు దండమెట్టి
కుద్దలితో కాలవ తవ్వేరు కొందరు !
గుగ్గిలం ధూపమేసేరు ఇంకొందరు !
కాటి వరకు సాగాల్సిన బంధాన్నేదో కాళ్లకు చుడుతున్నట్టు
కోడిపిల్లని కానికు తీసేరు మరికొందరు !
బోర్లించిన కుంచం మీద కుద్ద తొక్కించేరు !
సామలబియ్యం తలంబ్రాలు పోసేరు !
పెళ్లి మంత్రాలు పఠించేయి పక్షులు !
ఆకుల్నీ పూవుల్నీ అక్షతలు చేసీ
ఆశీర్వదించింది అడవి !

కొండాకోనా వాగూవంకా చెట్టూచేమా.....
చుట్టూచేరి చుట్టాలై దీవించేయి !
పొద్దుపొద్దున్నే పలకరకాడయ్యాక అట్పజుర్రు తాగాక
వాగులో వసంతాలాడేరు పెళ్లివారంతా !
జీలుగుమత్తులో తూ లుతూ .....
చిందేస్తోంది గూడేం ఆ చల్లనిపేళ !

ఉన్నట్టుండి ఉప్పెనేదో నడిచొచ్చిన చప్పుడు !
శిశ్నాల్లాంటి తుపాకులూ.....
తుపాకుల్లాంటి శిశ్నాలెక్కుపెడుతూ .....
గూడేంమీద విరుచుకు పడింది తోడేళ్లమంద !
ఆ దారుణాల్ని చూడలేక,
ఇంట్లో తపేలాలు ముంతలూ
వీధుల్లో తలబాదుకున్నాయి !
కుక్కిమంచాలు కుసులు జారి కూలబడిపోయాయి !
ఆ నిస్సహాయతావరణంలో......
నేల రాలిపోయిన నెత్తుటి పక్షులు కొన్ని !
చెట్టుకొక పిట్టై చెదిరి పోయినవి ఇంకొన్ని !
మంటల్లో మరుభూమైపోయింది గూడ !
పచ్చని అరటితోటలా ఫెళ్లున కూలిపోయింది పెళ్లిపందిరి !

కంకణమైనా విప్పలేదు
నెత్తుటిపూవై రాలిపోయాడు సిన్నోడు !
బ్రహ్మముడైనా విప్పలేదు
చీలిక పేలికలైన చీరకొంగై పోయింది కోనమ్మ !
దాహం తీరిపోయాక
తీరిగ్గా శవాలగుట్టల మీంచి నడచిపోయింది మంద !
ఈ సామూహిక మానవ హననానికి
సాక్షీభూతంగా నిలుస్తూ......దశాబ్దాల దాడుల్లో .....

---

చేసిన సందర్భాలూ ఉన్నాయి. ఇబ్బందిపడిపోయారనడానికీ ఆధారాలు ఉన్నాయి. సహజంగానే మనుషులకు పాత కాలపు విషయాలపట్ల అనురక్తి ఉంటుంది. వాటిని తాము జీవిస్తున్న కాలం అందించిన దృక్పథం నుంచి చూడటంలో ఇబ్బందిపడుతుంటారు. కేశవరెడ్డి మీద గౌరవంతోనే ఈ కోణంలో ఆయన సాహిత్యాన్ని పరిశీలించడం ఆసక్తికరం. ఆయన ఆధునికానంతవాది కాకపోగా ఆధునిక పూర్వ జీవితంపట్ల మమకారం గల రచయిత. సాహిత్యంగా ఆయన నవలల్లో ఉన్న బలం ఇదే అనిపిస్తుంది. సృజనకారుడిగా ఆయనను నడిపించిన శక్తి ఇదే. అక్కడి నుంచి వర్తమాన జీవిత వాస్తవికతను చూడ్డానికి ఆయన ప్రయత్నించి సఫలమైన రచనలు ఉన్నాయి. చర్చనీయాంశమూ, సమస్యాత్మకమూ అయిన రచనలూ ఉన్నాయి. రెండు మూడు నవలలను అటుంచితే మిగతా వాటిలోని ఇతివృత్తంలోనే ఆధునిక పూర్వ ఛాయలు లేవా.. అనే ప్రశ్న వేసుకుంటే ఎలా ఉంటుంది? జీవితంలో సాధ్యమయ్యే సాహసాలను, వెతుకులాటలను, అనివార్యమయ్యే దు:ఖాలను, విషాదాలను ఆయన ఏ దృష్టితో పసిగట్టారు? అనేదే అతి ముఖ్యమైన ప్రశ్న. తెలిసిగాని, తెలియకగాని ఈ పని చేసేందుకు ఆయనకు ఆలంబనగా ఏది నిలిచింది? దాని అర్థమేమిటి? అనే పరిశీలన ఆయన పాఠకులుగా, అభిమానులుగా, విమర్శకులుగా మనం చేయాల్సిన పని.

అప్పుడు మాత్రమే ఆయనలోని సృజనకారుడిని గుర్తించగలం. అంతేకాదు ఆయన రచనల్లో ఉండే తాత్విక స్పర్శ మూలాలను కూడా గుర్తించాల్సి ఉంది. ఆ పని ఎక్కువ అవసరం ఉన్న నవలలు కనీసం నాలుగైదు రాశారు. జీవితాన్ని అత్యంత సృజనాత్మకంగా చిత్రించే రచయితల్లో ఒక్కోసారి చిన్న చిన్న పార్శ్వాల్లో హేతుబద్ధత లోపిస్తుందా? అనే అనుమానం నాకుంది. కేశవరెడ్డి నవలల్లోనే ఇది కనిపిస్తుంది. బహుశా హేతుదృష్టితో సృజనాత్మక సాహిత్యాన్ని పరిశీలిస్తారా? అనే ప్రశ్న ఎవరైనా వేస్తారేమో. ఆ పని సామాజిక శాస్త్ర రంగాల్లో చేసుకోవాలి గాని అని కూడా అనవచ్చు. ఇలాంటి చర్చకు నిలబడగల రచనలు కేశవరెడ్డిగారివి.



ఇంకెంతమంది బిడ్డల్ని పోగొట్టుకోవాలో తెలియక,
అడవి, తురాయిపూల కన్నీరు కారుస్తోంది !

ఆనాటి అకృత్యాన్ని కడుపున మోస్తోందా.... అన్నట్టు
కోనమ్మ నీళ్లోసుకుంది !
అడవి మీద కమ్ముకున్న చీకట్లను తరిమి కొట్టేందుకు
తూ రుపుదిక్కై పురిటినొప్పులు పడుతోందిపుడు !!

## ఊరిడిచి పోతున్నా

- కాశీవరపు వెంకటసుబ్బయ్య

యాడికిరా మాదన్నా!
తట్టాబుట్టా ఎత్తుకొని
ఆలుబిడ్డలతో వలసపోతున్నావ్
ఎక్కడైనా రూపాయకు పదారణాలే!

అమ్మా, అయ్యా, నే పట్నం పోతున్నా
అక్కా, చెల్లీ, పల్లె విడిచి వెళుతున్నా
అన్నా, తమ్ముడా, నే బయల్దేరి పోతున్నా
నా పంచప్రాణాల్నిక్కడే వదిలి, ఊరిడిచి పోతున్నా
పెళ్లాం బిడ్డలతో వదలలేక వదలి
పరాయిచోటికి ప్రాణాలుగ్గబట్టి వుండూరొదలి పోతున్నా

హితుడా, స్నేహితుడా
కన్నతల్లొంటి చల్లని పల్లె విడిచి వూరేల్లిపోతున్నా
ఇక్కడే ఉండి అవమానాలు భరించలేక
అణగదొక్కే విధం సహించలేక వూరెల్లి పోతున్నా

మాయింటి ముంగిట మా మంచంపై మేం కూర్చుంటే
హూంకరించి ఉగ్రులైతారు
పండక్కో, పబ్బానికో తెల్ల చొక్కా వేసుకుంటే
కండ్లెర్రజేసి చూస్తారు
పిల్లల్ని బళ్ళకు రానీయరు
అదనుదొరుకుతే చాలు కులం పేరు కూసి హేళన చేస్తారు
మెమెదక్కుండా వర్గం పేరుతో తొక్కిపడతారు

పెళ్లో దేవరో వూళ్ళో జరిగితేనో
మేళాలు వాయించేటప్పుడూ, తప్పెట కొట్టేటప్పుడూ
అమ్మోరికి యాటను నరికేటప్పుడూ
చల్లోలా భూజాన వేసుకొని ఉరిమి ఉరిమి చూస్తుంటారు
వాటందప్పుతే వీపులు పగలగొడతారు

పెళ్లికో పేరెంటానికో
మా ఆడోళ్ళు ఎప్పుడ్లో దాపుడుకోక కట్టుకుపోతే
పొడిచే చూపులు చూస్తారు
తప్పు చేయడమే ఒప్పుగా రొమ్ము విరుచక తిరుగుతారు
మేం చిన్న తప్పు చేస్తే చింతమానుగ్గట్టి
చింతబర్ర విరిగేదాక చితకబాత్తారు
ఇదేం న్యాయమంటే
మీకు దిక్కెవర్రా ప్రాణాలు తీసినా అంటారు
దౌర్జన్యం దౌర్భాగ్యం దుర్మార్గం
ముప్పేట పెనవేసుకున్న ఈ వూరిలో
నేసుండలేనన్నా

ఓట్లొస్తే మళ్లీ వీళ్ళే
కులమంటే పనివిభజనరా
మనమంతా ఒక్కటేరా, మనుషులంతా ఒక్కటేరా
అంటూ భుజంపై చెయ్యేసి మాయమాటలు చెపుతారు
ఈ రెండు నాల్కల పాముకు తాళలేక
ఆత్మగౌరవం చంపుకోలేక
నే పల్లె విడిచి పట్నం పయనమవుతున్నా

అయ్యలారా అమ్మలారా
గుండెపగిలి పురుడుపోసుకున్న గడ్డ వదలిపోతున్న
నే పట్నమెళ్ళిపోతున్నా
హెచ్చుతగ్గులు ఎంచనిచోటికి
కులాల పట్టింపు లేనిచోటికి
ఒకరి కష్ట సుఖాలలో మరొకరు పాలు పంచుకునే చోటికి
మానవత్వం పరిమళించే చోటికి
సంపద సమభోజ్యమయ్యే చోటికి
నేనెళ్ళిపోతున్నా నన్నలారా, నెనెళ్ళిపోతున్నా తమ్ముల్లారా

## చెప్తే నమ్మరుగానీ...

- మేడక యుగంధరరావు

మగ్గంతో వూగులాడే
నాన్న మెడపై చేతులేసి
తడి కండెతో
చీరపై అ,ఆ లు దిద్దిడం గుర్తు

దాయకర్రను గుర్రపు బొమ్మగా
అల్లుకింద తెగిన దారాల్ని
మొండి మొలకు చుట్టి
వూరేగడం గుర్తు

పసిరిక పదాల నిగారింపు
కళ్ళముందే మాయమవుతుండడం
ఇంకా బాగా గుర్తు

చెప్తే నమ్మరు గానీ
నాడిపూసలో
దారాన్ని సుతారంగా ఎగపీల్చడం
నూనెతో సొరుగును
నున్నగా దువ్వడం
ముసుగుతన్నిన మంచు రాత్రిని
మగ్గం విరుపులలో బంధించడం
నాన్న కలవాటే

చెప్తే నమ్మరుగానీ
కిరుకిరులాడే రాట్నం
కిరసనాయిల బుడ్డీ వెలుతురు
మగ్గాన్ని గుంజీళ్ళు తీయించేది అమ్మయితే

కదురుకు బాల్యాన్ని గుచ్చి
కండులుగా మారేది పిల్లలం

చెప్తే నమ్మరుగానీ
నెలలో వచ్చే
ఒకే ఒక పౌర్ణమి కోసం
ఎంతగా ఎదురు చూశామో
మజూర్ని మింగేసే అమాసతో
అంతగా నిరాశ పడ్డాం!
అన్ని శాపనార్థాలు పెట్టాం!!

చెప్తే నమ్మరుగానీ
ఒకటా, రెండా
మగ్గం దూలానికి
బందెల దొడ్డి వేపచెట్టుకు
గుత్తులు గుత్తులుగా దుఃఖ మరణాలు

చెప్తే నమ్మరుగానీ
అరచేతిలో బొమ్మరిల్లు కట్టారు
వేలిపై సిరాచుక్క పొడిచారు

ఉన్నపళంగా
గోతుల్లోకి నీళ్ళు పొర్లించి
పడుగును సగానికి కోసేస్తే
మేమెక్కడికని పోవాలి?
తాత, నాయన నేర్పిన
అతుకును కాదని
ఏ దూరతీరాలు పారిపోవాలి?
ఇప్పటికిప్పుడు పరకాయ ప్రవేశం చేసి
ఏ కొత్త గొట్టం లో
మము మేం కుక్కుకోవాలి?

చెప్తే నమ్మరుగానీ
మగ్గం గోతులు పూడ్చబడుతున్నాయ్
శవాల మీది మట్టిదిబ్బలుగా...

చెప్తే నమ్మరుగానీ
నాన్నలు వలసెళ్తున్నారు
కూలిన మగ్గాల్ని
నుదుటిపై అచ్చేయించుకుని...

## అమరుడా, నిరాశ లేదు

### ఇంగ్లీషు మూలం: రాకేశ్‌రంజన్

మేం ఆడుతూ పాడుతూ
విత్తనాల్ని విత్తినపుడు
మేం భూమి నుండి ప్రాణాన్నిపొంది
మా చెమటతో నెత్తురుతో
మళ్లీ భూమికి ప్రాణమిచ్చినపుడు

నువ్వు భూమి నుంచీ మా నుంచీ
ఆ ప్రాణాన్ని తీసేసే ప్రయత్నం చేసావు

నువ్వు కూడ ఆ రోజు ఒక విత్తనాన్ని విత్తావు
అది బంగారమై పండింది
కాని దాని నిండా మా నెత్తుటి మరకలే
కనిపించాయి మాకు

నువ్వు నీ మహా ప్రాసాదంలో
ఒక యువతితో నాట్యం చేయిస్తున్నప్పుడు
మేం పెదవులు దాటకుండా
మా పాటలతో గుసగుసలాడుకున్నాం

అజీర్ణంగా ఉన్నవాళ్లకు నువు విందు చేసినపుడు
మా పిల్లల కాళ్లు
మీ బరువును మోస్తూ వణకుతూ కూడ
వసంతం నాట్యం చేసే పాదాలకు
లయ కలపడాన్ని
మేం ఊహించుకుంటున్నాం

పంటలు కోతకొచ్చినవి
దోపిడీ దొంగా !
నువు బంగారాన్ని తూచుతున్నావు
మేం మా తేలిన నరాలనుంచి
నెత్తురు పోగుచేసి
ఎగసిపడే సముద్రకెరటానికి అర్పించినం

శిలామయ సముద్రతీరాన్ని తాకి
కెరటాలు విరిగిపడినపుడు
అవి కోట్లాది చుక్కలవుతాయి
వాటిని దోసిట్లో నింపుకుని
మేం మళ్లీ మా పొలాల్లోకి తిరిగివస్తాం

మేం భూమిమీద సముద్రాన్ని విత్తాం
ఇంక నీకు చోటేది!
మేం మా పాటల్ని కోల్పోలేదు
మా ఆటల్నీ మరచిపోలేదు
నీకు కనిపించడం లేదా!
(కోట్లాది కిషన్‌జీలకు అంకితం)

## పెరుమాళ మురుగన్

### హిందీమూలం: ఉజ్వల్ వారణాసి

పట్టణం నడిబొడ్డున నిలబడి
ఆ మనిషి అన్నాడు
నాకు తెలుసు
భూమి తిరుగుతుంది
తిరుగుతూనే ఉంటుంది
నేను పెరుమాళ్‌మురుగన్‌ను
నేను బతికే ఉన్నాను

కాని నా లోపలి రచయిత చనిపోయాడు
నేనింకేమీ రాయను
నేనింకేమీ మాట్లాడను

నా పక్కన నిలబడిన నేస్తాన్ని నేనడిగాను
ఈ పెరుమాళ్ మురుగన్ ఎవరు?
అతడన్నాడు - రచయిత ఉండేవాడు
ఇప్పుడు తెలియదు
ఏమి రాస్తాడని నేనడిగాను
తెలియదు - అతడు జవాబు చెప్పాడు
మళ్లీ ఆయనే అడిగాడు - తెలుసుకోవాలనుకుంటున్నావా
నేనన్నాను - తెలియదు

కాని ఒకటి మాత్రం తెలుసుకోవాలనుంది
అతనికింత ధైర్యమేమిటి?

అతడన్నాడు -
ఆయన సాహసమల్లా
అతనింక మాట్లాడనని
గట్టిగా గొంతుచించుకొని చెప్తాడు
అంతే రోడ్డుకిరువైపులా ఇళ్లల్లో
కిటికీలు మూసుకుంటాయి
కిటికీల ఆవల కర్టెన్లు మూసుకుంటాయి
కర్టెన్ల వెనుక లైట్ ఆర్పబడుతుంది
నువ్వూ నేను
రోడ్డుపక్కన అలా నిలబడి ఉండిపోతాం.
(వర్ల్డ్ బుక్ ఫెయిర్‌లో ఫిబ్రవరి 20న జరిగిన 'కవితా మే సోలాకే బాద్' కవి సమ్మేళనంలో చదివిన కవిత)

## అతడు

- శాఖమూరి రవి

అవునవును
నీవన్నట్లు
అతడే అతి పెద్ద నక్సలైట్
కడగొట్టుకే అంకితమన్న
కనకపు సింహాసనను
కాపలా శునకమై
కాచుకొని మింగేసిన
అంటరానివాడని
అవినీతి మొదటి బహుమతిచ్చి
అవమానంతో తన్ని తరిమేసిన అతడే
అతి పెద్ద నక్సలైట్
కొమురంభీంపై ఒట్టేసి
ఆదివాసులె మూలవాసులని
అడవికి ముప్పంటు హుకుం జారిచేసిన
ఏ సిద్ధాంతమైతే
తమ సిద్ధాంతమని
పద్నాలుగేళ్లు పాటపాడిన పొలిటిషీన్ దొరవారు
పల్లకీనెక్కివారం
పక్షములైన ఎల్లకముందె
సెప్టెంబర్ 21
కదులుతున్న కలాలను బంధించిన అతడే
అతిపెద్ద నక్సలైట్
ఆరు నెలల్లో ఉద్యోగాల జాతరనాపేసి
మూడెకరాల వసుదను మూలకు నెట్టేసి
నిట్టాడై నిలువాల్సిన విత్తనాలు
వల్లకాడులోకమురు వాసనలౌతుంటె
కుట్టనట్టు కునుకుతీస్తూ
కానుకల వర్షంతో
కార్పోరేట్లను స్వాగతించి
గుట్టల చుట్టు ప్రదక్షణ కొట్టిన
అతడే అతిపెద్ద నక్సలైట్

## అతడు, అడవి మీద చిగురించిన దండకారణ్యం

- నాగేశ్వర్

అతడు ఉరి కొయ్య మీద
చిరునవ్వు వెన్నెలయ్యిండు
వాడు బెదురు కళ్లతో
పిరికితనం తలారయ్యిండు

అతడు
పెట్టుబడి సామ్రాజ్యవాద మెడమీద
ఇంక్విలాబ్ పిడికిలి కొడవలయ్యిండు
వాడు
పెట్టుబడి హస్తాలతో మిలాఖత్ అయి
ఈ దేశ వనరుల్ని కొల్లగొట్టే తెల్లవాడయ్యిండు

అతడిప్పుడు
భూమయ్యా, కిష్టాగౌడ్
వాడిప్పుడు
రాజ్యం ముఖం తగిలించుకున్న
బహుళజాతి కంపెనీ పాదసేవకుడు

అతడి పాదాలతో నడుస్తున్న మనుషులు
స్వావలంబన జనతన సర్కారై అడుగులేస్తున్నరు
వాడి పాదాలతో నడుస్తున్న రాజ్యం
నేల మాళిగల్లోని మూలుగుల్ని సైతం
దోసి వాడి దోసిట్లో గుమ్మరిస్తోంది

అతడిప్పుడు
అడవి మీద చిగురించిన దండకారణ్యం
వాడిప్పుడు
అడవి మీద పొంచి ఉన్న గ్రీన్‌హంట్



# వీళ్ళెవరో మీకు తెలుసా ?!

**- పలమనేరు బాలాజి**

యాక్సిడెంట్ జరిగి ఎంతసేపయ్యిందో తెలీదు.

బతకటానికి ఎంతో తపన పడుతున్నట్లున్నాడు. నలభై దాటి ఉంటుంది. కానీ మొహంలోని ఆందోళనల వల్ల చూడ్డానికి మరో పదేళ్ళు పెద్దవాడిలా కనబడుతున్నాడు.

అతడి ప్రాణం అతడి కళ్ళల్లో కొట్టుకుంటుందేమో అనిపించేలా, ఆ కళ్ళు ఎవరినో వెతుకుతున్నాయి. రోడ్డుపైన అచేతనంగా పడివున్నాడు. కానీ బలవంతాన నోరు కదిపే ప్రయత్నం చేస్తున్నాడు. చెవుల్లోంచి, ముక్కుల్లోంచి రక్తం బయటకొచ్చేసింది.

నిరంతరం రద్దీగా ఉండే ఆ జాతీయ రహదారిపైన అంతకు ముందే జరిగిన ఆ రోడ్డు ప్రమాదాన్ని పట్టించుకునే పరిస్థితిలో ఎవరూ లేరు. స్కూటర్ ఎక్కడో దూరంగా వెళ్ళి పడింది. అతడి స్కూటర్‌ను ఢీకొట్టిన లారీ ఆగకుండా బెంగుళూరు వైపు వేగంగా దూసుకెళ్ళి పోయింది.

అతి బలవంతాన తలను పైకి కదల్చగలిగాడు. ప్రాణం పోతున్నట్లు అనిపించింది. కానీ ఎవర్నో, దేన్నో వెతికి పట్టుకోవాలనే పట్టుదల అతడి కళ్ళల్లో స్పష్టంగా కనబడుతోంది. అతడి ఎడమ చేయి కదిలింది. ఎడమవైపు ఫ్యాంటు జేబు వద్ద తచ్చాడితే కొన్ని క్షణాల ప్రయత్నం తర్వాత అతడి చేతికి సెల్‌ఫోన్ దొరికింది.

లోపలెక్కడో మూగదెబ్బలు బలంగా తగిలినట్లున్నాయి. ఎముకలు విరిగినట్లున్నాయి. అచేతనంగా అలా కొన్ని క్షణాలు పడుండిపోయి, ఏమిటో చైతన్యం అతడ్ని ఆవహించినట్టె ఉన్నట్లుండి కదిలాడు. ఎవరైనా అతడ్ని ఆ క్షణం దగ్గరగా చూసినట్లయితే జడుసుకునేవాళ్ళు. ఏదో శక్తి ఆవహించినవాడిలా, ఒంట్లో మిగిలిన కాస్త బలాన్ని తోడుతీసుకొని పక్కకుతిరిగి సెల్‌ఫోన్ ఆన్ చేశాడు.

సెల్‌ఫోన్ ఆపరేట్ చేస్తూనే రోడ్డుకు అటూ ఇటూ తలతిప్పి చూశాడు. అతడికి కొంచెం దూరంలో రోడ్డు పక్కన చెట్ల చాటున పడున్న ఆమె కనిపించింది.

మూసుకుపోతున్న కళ్ళను బలవంతాన తెరచి కొంచెం పరీక్షగా అటువైపే చూశాడు. అతడి మొహంలో ఆదుర్దా, భయం, నిస్సహాయత కనబడుతున్నాయి. ఆమె శరీరంలో మెల్లగా కదలికలు కనిపించాయి. బాధను, నొప్పిని తట్టుకోలేక ఆమె మగతగా అరుస్తోంది. కదులుతున్న ఆమె పెదవులు కనిపిస్తున్నాయి ... కానీ దూరం వల్లనో లేదా చెవులు దెబ్బతినటం వల్లనో అతడికి ఆమె మూలుగులు వినపడడం లేదు. కానీ ఆమె కనురెప్పల, పెదవుల కదలికలు చూడగానే అంతటి బాధలోనూ అతడి కళ్ళల్లో ఏదో వెలుగు తళుక్కుమంది.

అత్యవసర పరిస్థితుల్లో ఎమర్జెన్సీ నెంబర్ నొక్కగానే ఆ అత్యాధునిక సెల్‌ఫోన్ నుండి అత్యవసర సహాయం కోసం అతడున్న ప్రదేశం వివరాలతో సహా సమాచారం క్షణాల్లో చేరిపోతుంది. ఆమెను చూస్తూ అతి బలవంతాన నోరు పెకల్చుకొని ఏదో చెప్పే ప్రయత్నం చేశాడు కానీ, అతడికి శరీరం సహకరించలేదు.

అతడి పెదాల కదలికను బట్టి మొహంలో, కళ్ళల్లో కదలాడిన భావాల్ని బట్టి బహుశా అతడు అనదలచుకున్నది ఏమిటో చెప్పగలిగే ఆమె... అచేతనంగా రోడ్డు పక్కనే పడిఉంది. పక్కకు తిరగడం వల్ల అతడి గాయాలనుండి రక్త స్రావం అధికమయ్యింది. నొప్పి మరింత ఎక్కువయ్యింది.

రోడ్డు పక్కగా కారు ఆగింది. ఎవరో దిగి రోడ్డుపైన పడివున్న అతడ్ని, అతడికి కొంచెం దూరంలో రోడ్డుకు అడ్డంగా పడున్న స్కూటర్‌ని, ఇంకొంచెం దూరంగా రోడ్డు పక్కనే చెట్ల చాటున పడున్న ఆమెను దగ్గరగా వెళ్ళి పరిశీలించి నిట్టూర్చారు.

'వీళ్ళెవరో మీకు తెలుసా?'

'తెలిసిన వాళ్ళా?'

'ఏమిటో, ఎవరో పాపం రోడ్డు పైన దిక్కులేని సావు సస్తారేమో. పెద్ద వయసు కూడా లేదు.'

'పదండి పోదాం. మళ్ళీ కేసు, సాక్ష్యం, పోలీసులు, కోర్టులు, విచారణలు... మనకెందుకు గొడవ.. పోదాం.. పదపద'

'అంతేలే నేను మాత్రం ఎవరో ఏమిటో తెలిసిన వాళ్ళేమో అని చూడ్డానికి వచ్చానంతే నాకు మాత్రం కేసులు, పోలీసులు, సాక్ష్యం, కోర్టులు అంటే ఇష్టమూ ఏమిటి? పద పద'.

మరికొన్ని క్షణాల తేడాతో ముగ్గురూ అక్కడి నుండి కదిలారు.

బస్సుల్లో, కార్లల్లోంచి మనుషులు యథాలాపంగా రోడ్డు ప్రమాద దృశ్యాన్ని చూడటం, తెలిసిన వాళ్ళేమోనని అతడివైపు, ఆమెవైపు, స్కూటర్‌వైపు చూడటం పక్కవారితో సానుభూతిగా మాట్లాడుకుంటూ వెళ్ళడం జరుగుతోంది. ఆ సెల్‌ఫోన్ అత్యంత ఆధునికమైంది. అత్యాధునిక సాంకేతిక పద్ధతుల ద్వారా యాక్సిడెంట్ జరిగిన సంగతి ఆ ప్రదేశం వివరాలు చాలా త్వరగా పోలీస్ శాఖ వారికి, 108 వారికి అందజేయబడ్డాయి.

ఫోన్లు కదిలాయి, సైరన్ మోతతో వైద్య సిబ్బందితో కూడిన 108 అంబులెన్స్ వచ్చేసింది. ఆ వెనుకే పోలీస్‌శాఖ సిబ్బంది వచ్చేశారు. వచ్చిన వారు చకచకా కదిలారు, క్షణం కూడా వృథా చేయలేదు. మెరుపు వేగంతో తమ పనులు పూర్తి చేసుకున్నారు. ఫోటోలు తీసుకున్నారు. రోడ్డుకు ఎంత దూరంలో స్కూటర్, ఆమె, అతడు పడి వున్నారో కొలతలు తీసుకున్నారు. వివరాలన్నీ చిన్న డైరీల్లో నమోదుచేసుకున్నారు. సైరన్ మోతతో 108 వెనుదిరిగింది. అప్పటికి కొన్ని క్షణాల ముందే ఇద్దరికీ స్పృహ తప్పిపోవడం వల్ల జరుగుతున్న దేమిటో గ్రహించే స్థితిలో వాళ్ళిద్దరూ లేరు.

* * *

ప్రభుత్వ ఆసుపత్రి

రాత్రి, పగలు తేడా లేకుండా రద్దీగానే ఉంది. సిబ్బంది షిఫ్ట్ మారారు. అలసిపోయిన మొహాలతో డ్యూటీ నుండి వెడుతున్న వాళ్ళల్లో ఏదో నిశ్చింత లీలగా కనబడుతోంది. బహుశా బాధలు, భయాలు,

నొప్పులు, ఏడ్పుల నుండి ఆ రోజుకిక విరామం దొరికిన సంతోషం కాబోలు వాళ్ళ మొహాల్లో దాక్కుని ఉంది.

అప్పటిదాకా బయట ప్రపంచంతో... అదే ... తమదైన ప్రపంచంలో నిశ్చంతగా బతికి, ఊసురోమంటూ డ్యూటీలకు హాజరవుతున్న వాళ్ళల్లో కొందరిలో విసుగు కనబడుతోంది. మరి కొందరిలో నిర్లిప్తత కనబడుతోంది.

కొత్తగా ఉద్యోగంలో చేరిన వాళ్ళల్లో మాత్రం బయటనుండి ఆస్పత్రి లోపలికి వచ్చేసరికి ఏదో కొత్త ఉత్సాహం కనబడుతోంది. వాళ్ళ కదలికల్లో మాటల్లో, చూపుల్లో నవ్వుల్లో చలాకితనం కనబడుతోంది.

బయట కనబడుతున్న భావాల్ని కూడా అత్యంత సహజంగా అదే నిజమన్నట్లు నటించటం అలవాటు చేసుకున్న వాళ్ళూ కొందరున్నారు. హెడ్‌నర్సు చాలా గడసరి, తెలివైంది కూడా. తన డ్యూటీ సమయంలో మనశ్శాంతిని పోగొట్టుకోకుండా వుండటానికే ఎప్పుడూ ప్రయత్నిస్తూ ఉంటుంది. ఆమె ప్రయత్నమంతా ఒక్కటే. ఎన్ని ఎమర్జెన్సీ కేసులు వచ్చినా, ఎంత సమస్యాత్మకంగా పరిస్థితులు మారినా తను ప్రశాంతంగా వుండాల్సిందే. తన ప్రశాంతతను మనశ్శాంతినీ ఎవ్వరూ పోగొట్టలేరు, పోగొట్టరాదు.

ఆమె దేంట్లోనూ నేరుగా వ్యక్తిగతంగా జోక్యం చేసుకోదు. కానీ అన్ని పనులూ చేయిస్తుంది. ఆమె అదుపాజ్ఞల్లోనే అన్నీ జరగాలనుకుంటుంది. జరిపిస్తుంది కూడా. అక్కడ ఆమె చాలా కాలంగా పనిచేస్తూ ఉండటం వల్ల, ఆమే సీనియర్ కావటం వల్ల కుర్రడాక్టర్లు కూడా ఆమెను అనుసరించక పోతే వచ్చే రకరకాల ఇబ్బందుల్ని దృష్టిలో ఉంచుకుని ఎందుకైనా మంచిదనుకుని ఆమె చెప్పింది విన్నట్లు నటించడమో, కనిపించడమో చేస్తుంటారు.

ఆమెతో వాదనలు పెట్టుకోవటం ఎవ్వరికీ అస్సలు ఇష్టం ఉండదు. ఎవరైనా ప్రశాంతంగా వుండాలనుకుంటే ఆమెతో గొడవ లేకుండా ఉండాలని, సాధ్యమైనంత ప్రశాంతంగా ఆమెను ఉంచాలని అందరికీ అనుభవపూర్వకంగా తెలుసు కాబట్టే, ఆమెతో లౌక్యంగా ప్రవరిస్తూ ఉంటారు. వయస్సు యాభై దాటినా ఆ విషయం ఆమె చెపితేనే కానీ ఎవరికీ తెలియదు.

ఆమెకు ముందు నుండీ తన శరీర లావణ్యంపైనే శ్రద్ధ ఎక్కువ. అందువల్లే ఆమె తక్కువ వయస్సు మనిషిలా కనపడగలుగుతోంది. ఆమెకు ఒక పట్టాన ఎవరిపైనా ప్రేమకానీ, దయ, జాలీ, అనురాగం, ఇష్టం, అభిమానం లాంటివి కానీ, కోపం, విసుగూ, చిరాకు, ద్వేషం, అసూయ లాంటివికానీ, భయం లాంటిది కానీ కలగదు. సర్వ సాధారణంగా ఆమె అన్నిటికీ అతీతంగానే ఉన్నట్లుంటుంది. లేదా అన్నింటికీ అతీతంగా ఉన్నట్లు నటిస్తూ అయినా ఉంటుంది.

తనపేరు నీలిమ అంటుంది కానీ రికార్డుల్లో ఆ పేరు ఎందుకనో నీలమ్మ అని తెలియక రాసారెవరో.

అలాంటి నీలమ్మ 'అయ్యో ' అంది.

అప్పుడే సైరన్ వేసుకుంటూ ఆసుపత్రి ముందుకొచ్చి ఆగిన 108 లోంచి ఇద్దర్నీ స్ట్రెచర్స్ మీద ఆస్పత్రిలోపలికి తీసుకువచ్చారు.

రోడ్డు ప్రమాదంలో గాయపడిన వాళ్ళు. వాళ్ళిద్దర్నీ చూడగానే హెడ్ నర్స్ మొహంలో రంగులు మారిపోయాయి. గొంతులోంచి అప్రయత్నంగా 'అయ్యో' అనే మాట తన్నుకొచ్చింది. ఐదారు క్షణాలు ఆమె అట్లాగే నిల్చుండి పోయింది. ఆ ఐదారు క్షణాలైనా ఆమె మొహంలో కనిపించిన బాధను చూసి అక్కడున్న వాళ్ళందరూ బిత్తరపోయారు. అంత మాత్రం బాధ ఆమె మొహంలో చూసిన వాళ్ళు లేరు. అయ్యో అనే రెండున్నర అక్షరాల్ని ఆమె నోట వెంట వినిన వాళ్ళూ లేరు. అందుకే అంత కంగారు.

ఆమె అలా బాధని వ్యక్తపరచిందంటే ...అది చాలా అరుదైన విషయమే. ఎందుకంటే... ఎట్లాంటి ప్రాణాపాయ స్థితిలో, దయనీయమైన పరిస్థితుల్లో ఉన్న రోగిని చూసినా ఆమె మొహంలో ఎలాంటి భావమూ వ్యక్తం కాదు. ఆమె గొంతులో 'అయ్యో' లాంటి మాట అస్సలు రాదు. చాలా యథాలాపంగా చెయ్యాల్సిన పనుల్ని చక చకా అందరికీ పురమాయించేస్తుంది. ఎందుకనో ఎవరిపట్లా సానుభూతి చూపించటాన్ని బహుశా ఆమె నామోషీగా ఏమైనా అనుకుంటుందో ఏమో చెప్పేవాళ్ళు లేరు.

ఆమె నోట్లోంచి అయ్యో అనే మాట వినబడగానే నర్సులు ఉలిక్కిపడ్డారు. డ్యూటీ డాక్టర్లు కంగారుపడ్డారు. యూనిఫాం మార్చుకుని, చీరల్లోకి మారి డ్యూటిమారి ఇండ్లకు వెడుతున్న వాళ్ళు కూడా అక్కడే అట్లాగే నిలిచిపోయారు. అప్పుడే డ్యూటీకి వచ్చిన వాళ్ళు చకచకా కదిలారు.ముందు డాక్టరు కదిలాడు. తర్వాత నర్సులు ముందుకొచ్చారు. డ్యూటీ దిగిన నర్సులు కూడా ఆమె ముందుకొచ్చి నిలబడ్డారు.

'ఏమైంది మేడం'

'తెలిసిన వాళ్ళా?'

'బంధువులా మేడం?'

'వీళ్ళెవరో మీకు తెలుసా?!'

'క్విక్ క్విక్... మూవ్... మూవ్... ఎమెర్జెన్సీ...'

క్షణాల్లో అందరూ సర్దుకునేసారు. జరగాల్సిన తతంగం అంతే మెరుపు వేగంతో జరిగిపోయింది.

కారుతున్న రక్తాన్ని శుభ్రంచేసి గాయాలకు చికిత్స చేయడం, ఎక్స్‌రేలు తీయడం, తగిలిన గాయాలకు కుట్లు వేయడం, కట్లు కట్టడం, రక్తం పరీక్షకు పంపడం, యాక్సిడెంట్ తాలుకు ప్రాథమిక సమాచారాన్ని రికార్డుల్లో నమోదు చేయడం.. అన్నీ చాలా వేగంగా జరిగిపోయాయి. డ్యూటీ డాక్టర్లు డ్యూటీ నర్సులు, డ్యూటీ నుండి దిగిన నర్సులు, వార్డుబాయ్స్, ల్యాబ్ టెక్నిషియన్, ఎక్స్‌రే యూనిట్ వాళ్లు, స్కావెంజర్స్, స్వీపర్స్, ఫార్మసీ వాళ్ళు, ఒకరని కాదు ఒక విభాగమని కాదు, అందరూ చురుగ్గా కదిలేసరికి 108 పైలెట్ యుగంధర్‌కు, సిబ్బందికి కళ్ళు గిర్రున తిరిగాయి.

తాము చూస్తున్నది కలో, నిజమో అర్థం కాని స్థితి వాళ్ళది. చూసి చూసి ఇక ఉండలేక యుగంధర్ లోపల అనకుండా ఉండలేక మెల్లగా పైకే అనేసాడు.

'ఇంత శ్రద్ధ చూపిస్తే, ఇంత వేగంగా వీళ్ళు కదిలితే ఇప్పటికి ఎంత మంది బతికుండే వాళ్ళోమో. యాక్సిడెంట్స్‌లో చచ్చేవాళ్ళకన్నా, టయానికి చికిత్స అందకుండా చచ్చేవాళ్ళే ఎక్కువ కదా'

ఆ మాట విన్నాక 108 సిబ్బంది కూడా అంగీకారసూచకంగా తలాడించేసారు. 108 సిబ్బంది ఆస్పత్రి బయట రావిచెట్టు కిందకు వచ్చి నిలబడి పాత గుడ్డలు తీసుకుని వాళ్ళ చేతులకు అంటిన రక్తాన్ని తుడుచుకోసాగారు.

'ఫోన్‌లో సమాచారం రాగానే మనం ఎంత వేగంతో యాక్సిడెంట్స్ అయిన చోటుకు వెడతామో, గాయపడిన వాళ్ళ ప్రాణం నిలిపేందుకు ఎంత ఆదుర్దాతో ఆస్పత్రికి తీసుకువస్తామో ఎవరికి తెలుసు? మనం తీసుకు వచ్చే వాళ్ళెవరో మనకు తెలుసా? మనకు బంధువులా?

స్నేహితులా? ముక్కూమొహం తెలియని వాళ్ళపైన మనం అంత శ్రద్ధపెట్టి అంత జాగ్రత్తగా ఇక్కడకు తీసుకువస్తే ఇక్కడేం జరుగుతుందో మనకు తెలిసిందే కదా?' అంటున్నాడు యుగంధర్.

'ఏమో అన్నా మనకూ వీళ్ళకూ ఉండేది మామూలు చేతులూ, గుండె కాయలే కదా, అయినా మనం స్పందించినట్లు ఆస్పత్రి సిబ్బంది ఎవరూ ఎప్పుడూ స్పందించరు. పనిచేయరా అంటే చెయ్యరని కాదు, పనిచేస్తారు, పనిని పనిలాగే యథావిధిగా చేస్తారు. ఏమాత్రం తపన ఉండదు, సీరియస్‌నెస్ ఉండదు. ప్రాణం పోతోందే అనే బాధగానీ, జాలికానీ, దయకానీ ఉండదు. అయినా జాకోబ్ డాక్టర్, అరుంధతమ్మ నర్సు లాంటోళ్ళు కూడా ఉంటారనుకో. వాళ్ళయితే వచ్చే యాక్సిడెంట్ కేసులకు క్షణం కూడా వృథా కాకుండా, ఆలస్యం కాకుండా చికిత్స అందిస్తారు. వచ్చినవాళ్ళు వాళ్ళబంధువులేమో అనిపిస్తుంది చూసే దానికి వాళ్ళ ఆరాటం చూస్తే. మనుషులంటే ఎవరైనా మనుషులేకదా అనే ప్రేమ వాళ్ళకుంది. అది అందరికీ ఉండదు కదా?' అంది 108 నర్సు.

'ఏమో.. రోగుల్ని చూసి చూసి వీళ్ళు అంతా మామూలుగానే అనుకునేస్తారేమో. చప్పున కదలరు. నింపాదిగా పనులు చెయ్యటం వీళ్ళకు మొదటి నుండి అలవాటే కదా. నువ్వన్నట్లు అప్పుడప్పుడూ మంచి డాక్టర్లూ, గొప్ప నర్సులూ ఉంటారు. అన్నో తమ్ముడో, అక్కో, చెల్లెలో గాయపడి ప్రాణాలు పోయే పరిస్థితిలో వచ్చినట్లు కదులుతారు. నిజంగా అలాంటి వాళ్ళే దేవుళ్ళు. వీళ్ళందరూ మామూలు డాక్టర్లు, నర్సులు, దేవుళ్ళు కాదు' అన్నాడు యుగంధర్ శుభ్రం చేయటానికి వాహనంలోపలికి వెడుతూ.

పోలీసులు వచ్చారు కేసు వివరాలు నమోదు చేసుకున్నారు. డ్యూటీ డాక్టరు రాసి ఇచ్చిన కాగితాలు తీసుకొని, ముట్టినట్లు రిజిష్టరులో సంతకాలు చేశారు.

'ఇద్దరూ స్పృహలో లేరు. వీళ్ళ బట్టల్లో , పర్సుల్లో వివరాలేమైనా దొరుకుతాయేమో చూడాలి. లేదంటే సెల్ ఫోన్స్ ద్వారా అయినా ప్రయత్నించాలి' అంటున్నాడు ముసలి కానిస్టేబుల్

'సెల్‌ఫోన్లూ లేవూ. పర్సులూ లేవు. ఎప్పుడో లూటీ అయిపోయాయి. వివరాలు తెలుసుకోవడం కష్టం. యాక్సిడెంట్ గుర్తైండే వాళ్ళ దగ్గర కూడా దొంగతనాలు చేసేవాళ్ళు అసలు మనుషులేనా అని?' అన్నాడు వార్డు బాయ్.

'అవసరం లేదు వీళ్ళు నాకు తెలుసు' అంది నీలిమ చాలా వేగంగా. బుల్లెట్‌లా దూసుకు వచ్చాయి ఆ మాటలు

'ఎవరు మేడం వీళ్ళిద్దరూ? భార్యాభర్తలేనా? మీకు తెలిసిన వాళ్ళా, బంధువులా?' కుతూహలంగా అడిగాడు పక్కనే వున్న కుర్ర కానిస్టేబుల్.

నీలిమ నిర్లిప్తంగా వుండిపోయింది. కనురెప్పలు మాత్రం మామూలుకంటే ఎక్కువగా కొట్టుకుంటున్నాయి. నింపాదిగా మాట్లాడ్డానికే ప్రయత్నిస్తూ ఆమె గొంతు విప్పింది.

అందరూ కుతూహలంగా ఆమెవైపే చూస్తూ నిలబడ్డారు. కొన్ని క్షణాలపాటూ అక్కడ నిశ్శబ్దం అలుముకుంది.

మొదటిసారి ఆస్పత్రి సిబ్బందికి ఆమె గొంతులో ఏదో జీర వినబడుతుంటే నమ్మలేనట్లు ఆమె ముఖాన్నే వాళ్ళలాపరిశీలనగా చూస్తూ ఉంటే ఆమె గొంతు సవరించుకుంది.

'ఇద్దరూ బ్యాంకులో పనిచేస్తారు. ముక్తేశ్వరరావు అని బ్యాంకు మేనేజర్ లాంగ్ బజారులో వాళ్ళ ఇల్లు'.

నీలిమ మాటలతో కుర్ర కానిస్టేబుల్ ముఖంలో నిశ్చింత కనిపించింది. 'హమ్మయ్య, వీళ్ళెవరో మీకు తెలిసిన వాళ్ళే అయి ఉంటారు లెండి. ఇంక మేం వాళ్ళ వివరాల కోసం టెన్షన్ పడేపని తప్పోయ్యింది.' అని కూడా అనేసాడు, కుడిచేత్తో తల వెంట్రుకల్ని సవరించుకుంటూ.

ఈలోగా అనుపమ అనే నర్సు నీలిమ దగ్గరకు వచ్చి నిలుచుంది. నలభై లోపు వయసు. మంచి పొడగరి. చామనఛాయ ముఖంపైన ఏవో కాలిన గాయాల తాలూకా మచ్చలు కనపడుతున్నాయి.

'సిస్టర్... బ్యాంక్ మేనేజర్... అంటే... అప్పుడు అతడేనా? సిస్టర్' సంశయంగా లోగొంతుతో అడిగింది అనుపమ.

ఆ ప్రశ్నతో నీలిమ మొహంలో రంగులు మారిపోయాయి. జవాబు చెప్పే ప్రయత్నం చెప్పకుండా , మౌనంగా తలాడించింది. ఆమె కళ్ళల్లో ఎక్కడో తడి మొదలైనట్లుంది. ఆ కళ్ళతడి.. ఎవరి కంటా కనపడకుందను కుందేమో.

అత్యవసరమైన పనేదో హఠాత్తుగా గుర్తుకొచ్చిన దానిలా తల అటు తిప్పుకొని, ఆస్పత్రిలోపలి కారిడార్‌వైపు వడివడిగా నడుచుకుంటూ వెళ్ళింది.

అటువైపు కాన్పుల వార్డులోంచి గట్టిగా ఎవరో ఏడుస్తున్న సవ్వడి వినపడుతోంది.

'ఏమిటీ ఏమైంది?' అనుపమ నీలిమ వైపే చూస్తూ అడిగింది.

'బహుశా బిడ్డ చనిపోయి ఉంటుంది. లేత అమ్మాయి పసిపిల్ల. పదహారేళ్ళ అయినా ఉండవేమో. అప్పుడే పెళ్ళయి, కాన్పుకు వచ్చిందంటే కడుపులో దేవినట్లుంది. సన్నగా బలహీనంగా పీలగా ఉంది. నాకు చూడగానే అర్థమైపోయింది. తల్లో, బిడ్డో ఎవరో ఒకరే బతకతారేమో అనిపించింది. ఎవరు పోయారో, ఎవరు మిగిలారో తెలీదు'. నీలమ్మ గొంతులో బాధకానీ, దు:ఖంకానీ లేవు. వాటిని మించిందేదో ఉందనిపించింది అనుపమకు. అయినా ఏమీ పట్టనట్లు, దేన్నీ పట్టించుకోనట్లు కనపడే నీలిమలో తనకు తెలియని లోపలి మనిషెవరో ఉన్నట్లు అనిపించింది ఆమెకు ఆ క్షణం.

'ఈ కాలంలో కూడా... ఇంకా బాల్య వివాహాలు జరుగుతున్నా యంటే..' అర్థాంతరంగా తన మాటలు ఆపేసింది... అనుపమ.

అప్పటికే ముగ్గురు పత్రికా విలేఖరులు ఆస్పత్రిలోకి రావటం, రోడ్డు ప్రమాదంలో గాయపడిన వాళ్ళ వివరాలు సేకరించడం, క్షతగాత్రుల ఫోటోలు తీసుకోవడం... ఆస్పత్రి సిబ్బందితో, పోలీసు వారితో మాట్లాడ్డం వచ్చినవాళ్ళు వెళ్ళిపోవడం పదినిమిషాల్లోపలే ఆ తతంగం మొత్తం పూర్తయి పోయింది.

మళ్ళీ ఒకసారి నీలిమ ముఖాన్ని పరిశీలనగా చూసే ప్రయత్నం చేసింది అనుపమ. డ్యూటీ పూర్తయింది కాబట్టి ఇంటికి వెడుతూ వెళ్ళొస్తానని చెప్పబోయి క్షణం ఆగి ఇంకేదో స్వాంతనగా నీలిమకు చెప్పాలనుకుని, ఏం చెప్పాలో తోచక, ఏమీ చెప్పలేక ఆమె భుజంపైన చేయివేసి వెళ్ళొస్తానంటూ చెప్పి ఆస్పత్రిలోంచి బయటకు నడిచింది. ఆస్పత్రి బయట రావిచెట్టు కింద 108 సిబ్బందితో నవ్వుతూ మాట్లాడుతూ ఉన్న కానిస్టేబుల్స్ ఇద్దరూ, అనుపమను చూసి ఎందుకో మాటలు ఆపేసారు.

తన గురించో, నీలిమ గురించో ఏవో కుళ్ళు జోకులు చెప్పుకుంటున్నారని అనిపించింది అనుపమకు. అయినా అదేమీ గమనించనట్లుగా, అక్కడికి నుండి కదలబోయింది, కానీ కుర్ర కానిస్టేబుల్ ఆమె ముందుకొచ్చి దారికడ్డంగా నిలబడి పోయాడు.

'సిస్టర్... ఎవరా బ్యాంకు మేనేజర్. ఆ పెద్ద సిస్టర్‌కు బంధువా.

మీకు వివరాలు తెలిసినట్లుంది. చెప్పచ్చు కదా' అన్నాడు.

'ఆ నీలమ్మనే అడగొచ్చుకానీ ఆమె ఒకసారి ఉన్నట్లు ఒకసారి ఉండదు. కసురుకున్నట్లు మాట్లాడుతుంది ఒక్కోసారి.' బట్టతల తడుముకుంటూ అన్నాడు ముసలి కానిస్టేబుల్.

'సంవత్సరం ముందు నీలిమ సిస్టర్ కొడుకు చేసిన యాక్సిడెంట్‌లో కాళ్ళు విరగ్గొట్టుకుంది ఈ బ్యాంకు మేనేజరు కొడుకే. అయినా కేసు లేకుండా ఆ మేనేజరు ఎందుకో రాజీ పడ్డాడు. లేదంటే సిస్టర్ కొడుకు కన్న బాధలు పడిండేవాడు. ఆయన చాలా మంచివాడు.ఆ తర్వాత కూడా రెండు, మూడు సార్లు యాక్సిడెంట్‌లు చేశాడు సిస్టర్ కొడుకు. ఆమెకు ఇప్పుడదంతా గుర్తుకొచ్చినట్లుంది.' వివరాలు చెప్పుకొచ్చింది అనుపమ.

డ్యూటీ ముగించుకొని ఇది వరకే ఇండ్లకు బయలుదేరి ఆగిపోయిన ఇంకో నలుగురు నర్సులు, ఒక కుర్రడాక్టరు కూడా అటువైపుగా ఆస్పత్రి వెలుపలికి వెడుతూ, వీళ్ళను చూసి అక్కడే ఆగి పోయారు.

వెన్నెల పలుచగా ఉంది. ఉండుండీ గాలి వీస్తోంది. కరెంటు దీపాల వెలుతురు బలహీనంగా ఉంది. కొంచెం చీకటి, కొంచెం వెలుతురు అలుముకున్న ఆ రాత్రి రావిచెట్టు కింద చేరిన గుంపులో ఎవరో ఉన్నట్లుండి అన్నారు.

'ఏమీ పట్టనట్లు మొండిగా బండగా కనబడతుందికానీ ఆ నీలిమ సిస్టర్ కూడా ఎంతో చురుగ్గా ఫోన్లు చేసిందో. ఆ బ్యాంకు మేనేజరుకు సంబంధించిన వాళ్ళకి. ఇంకాసేపట్లో వాళ్ళెవరో వస్తారట. మొత్తంపైన అంతా చకచకా కదిలాం. ఒకే మాట సిస్టర్ నోట్లోంచి అయ్యో అనే మాట వినపడింది అంతే అందరూ అలెర్ట్ అయిపోయాం'.

ఆ తర్వాత యుగంధర్ మాట్లాడకుండా ఉండలేక పోయాడు. 'అంతే సినిమాలో జరిగినట్లుంది సార్., నాకైతే ఏమి స్పీడ్‌గా కదిలారండి. 108 కంటే వేగంగా కదిలారంతా. ఈ మాదిరే ఇంత హుషారుగా అందరూ పనిచేస్తే ఇంకెంత మంది బతుకుతారో'.

ఆ మాటలో కుర్రడాక్టరుకు ఉన్నట్లుండి కోపమొచ్చింది. 'అదేమిటయ్యా అట్లా మాట్లాడతావ్. మేం అన్ని కేసుల్ని ఇట్లే శ్రద్ధగా చూస్తాం. ఇంకా పరుగెత్తి చెయ్యాలని మాకూ ఉంటుంది. మేం ఎక్కువ ఇంట్రెస్టు చూపించమనుకో మా ముందో, వెనుకో మళ్ళీ మాపైనే జోకులు వేస్తారు కొందరు. స్పీడ్ తగ్గించుకోమని సలహాకూడా ఇస్తారు కొందరు.'

ఇంకో నర్సు క్కూడా కోపం వచ్చినట్లుంది. అసహనంగా అంది. 'ఎంత పడీ పడీ చేసినా గాడిదా గుర్రమూ రెండూ ఒక్కటే కదా పనిచేసే వాళ్ళకూ పెత్తనాలు చేసే వాళ్ళకూ తేడా ఏముండాదో చెప్పండి. అయినా వంద పడకల ఆస్పత్రి అంటారు. ఈడ అసలు వంద పడకలు కూడా లేవు. లెక్కేసి చెప్తావుండా. బ్లడ్ బ్యాంకు పేరుకైతే ఉంది కానీ ... బ్లడ్ ఉండదు. మాకూ చెయ్యాలనే ఉంటుంది మనిషి ప్రాణం కాపాడాలనే ఉంటుంది. అన్నీ వుండల్ల కదా. తగినోళ్ళూ వుండల్ల కదా'. ఆమె మాటలు ఆపగానే కుర్ర డాక్టరు మాట్లాడాడు.

సిస్టర్ చెప్తావుండేది హండ్రెడ్ పర్సంట్ రైట్. జాతీయ రహదారిపైన ఉండే ఆస్పత్రి. యాక్సిడెంట్ కేసులు రాని రోజంటూ ఉండదు. కొంచెం సీరియస్ కేస్ వస్తే ఇక్కడ చెయ్యగలిగేది ఏముండాదో మనందరికీ తెలుసు. ఆరేళ్ళుగా అనస్తటిస్టు లేడు. ఆర్థో సర్జన్ లేడు. న్యూరో సర్జన్ లేడు. న్యూరాలజిస్టు లేడు. ఎక్స్‌రే ఉంది కానీ డిజిటల్ ఎక్సరే లేదు. సి.టి. స్కాను లేదు. ఎంఆర్ఐ లేదు. ఇక్కడ చూడండి మన సూపర్నెంట్ మేడం గసపోసుకుంటా పోతా వుండాది'.

ఆ మాటతో అందరూ తలలు తిప్పి కాన్పుల వార్డువైపు చూసారు ఆ ఆసుపత్రి మొత్తానికి పెద్ద డాక్టర్, సూపర్నెంట్ యాభైఐదేళ్ళు దాటినా చలాకీగా ఉండటానికే ఎప్పుడూ ప్రయత్నించే డాక్టర్ విశాలాక్షి పరుగులాంటి నడకతో వెడుతోంది.

'ఆమే మనకు అనస్తస్టు, గైనకాలజిస్టూ, సూపర్నెంటూ అన్నీ . ఒక్కరే ఇన్ని పనులు చెయ్యాలంటే సాధ్యంకాదు కదా'. కొనసాగించాడు కుర్రడాక్టర్.

'ఎంత పెద్ద యాక్సిడెంట్ అయినా మనం ఇక్కడ చేయగలిగింది ఫస్ట్ ఎయిడ్ మాత్రమే. అందుకే రోడ్ ట్రాన్స్‌పోర్ట్ యాక్సిడెంట్స్, అర్‌టిఎ కేసులన్నీట్లో మనందరం పోలీసోళ్ళయినా, ఆసుపత్రి వాళ్ళయినా, 108 వాళ్ళయినా కొట్టుకునేది ఒక్కటే. అందరి బాధా ఒక్కటే'. క్షణం ఆగి గొంతు సవరించుకుని, 'వీళ్ళేవరో మీకు తెలుసా?' అని ఆగాడు డాక్టరు.

'అవును డాక్టర్ సార్. యాక్సిడెంట్స్ జరిగినప్పుడు గాయపడినోళ్ళు ఎవరో ముందు తెలిస్తే చాలు చాలా ప్రయోజనం ఉంటుంది. చకచకా వాళ్ళ వాళ్ళకెవరికో ఫోన్ చేసి చెప్పేస్తాం. వాళ్ళ బంధువులో, స్నేహితులో, తెలిసినవాళ్ళో వచ్చేసారంటే, ఇంక మనందరి పని సులువైపోతుంది.' అంది అనసూయ మధ్యలో కలగచేసుకుంటూ.

'యాక్సిడెంట్స్‌లో గాయపడిన వాళ్ళు ఎంత ముఖ్యమైన మనిషో కావచ్చు. గొప్పోడో అయివుండవచ్చు లేదా మామూలు మనిషే అయివుండవచ్చు. ఎవరిదైనా ప్రాణం ప్రాణమే కదా. మనం ఇక్కడ ట్రీట్‌మెంట్ ఇచ్చాక మన రూల్స్ ప్రకారం జిల్లా ఆస్పత్రికే రెఫర్ చేస్తాం. అక్కడ చూసాక అవసరమైతే తిరుపతి రుయాస్పత్రికి పంపేస్తారంతే. అదే గాయపడిన వాళ్ళ వాళ్ళేవరో వచ్చారనుకో ఇంక వాళ్ళిష్టం, వాళ్ళ సౌకర్యం. ఈ పక్క వేలూరు, సి.యం.సి ఆస్పత్రికో అట్ల కోలారు మెడికల్ కాలేజికో.. లేదూ అంటే బెంగళూరుకో తీసుకొని పోతారు. వాళ్ళ బాధలేవో వాళ్ళు పడతారు'.

'మామూలు వాళ్ళను కూడా టయానికి చిత్తూరుకో, తిరుపతికో తీసుకుపోవాలన్నా, అక్కడే పరిస్థితుల్ని బట్టి చకచకా ట్రీట్‌మెంట్ ఇప్పించాలన్నా కూడా ... పేషెంట్స్‌తో బాటు తెలిసిన వాళ్ళెవరైనా పక్కలో ఉంటేనే కదా వీలవుతుంది. వాళ్ళకు సంబంధించిన మనుషులుంటేనే అన్ని పనులూ కరెక్ట్‌గా టయానికి జరగతాయి. ప్రాణాలు పోయేదానికైనా నిలిపేదానికైనా కొన్ని నిముషాలే, క్షణాలే ముఖ్యమైనవి. ఆ టయింలోపల కరెక్టు ట్రీట్‌మెంట్ గానా దొరికిందంటే మనిషి బతికినట్లే. లేదంటే ఆ టైం తప్పోయినంక ఎంత పెద్దాసుపత్రికి తీసుకెళ్ళినా ఏం లాభం? '

'యాక్సిడెంట్స్ అయిన వెంటనే సమాచారం ఎవరైనా చెప్పడం కూడా ఆలస్యం అవతానే ఉంటుందిసార్. కనీసం రోడ్డుపైన ఫలానా చోట ఇంత మంది దిక్కులేకుండా పడిండారని ఎవరైనా చెప్పేదానికి కూడా సంకోచిస్తారు. బద్దకిస్తారు ముందు అక్కడే ఆలస్యం అవుతుంది సార్' అంటున్నాడు యుగంధర్. ఏదో చెప్పబొయి ఆగి డాక్టర్ వైపు, పోలీసులవైపు ఒకసారి చూసి మళ్ళీ తలతిప్పుకొని గొంతు

సవరించుకున్నాడు.

'108 కోసం మాకు వచ్చే ఫోన్‌కాల్స్‌లో పనికిరాని మనుషులు వేళాకోలానికి చేసే ఫోన్లు కూడా వుంటాయిసార్. ఫోన్ చేస్తే 108 వస్తుందా రాదా చూద్దామనుకుని మొదట్లో కావాలని ఫోన్లు చేసేవాళ్లు. ఇప్పుడైతే అట్లాంటి రాంగ్ కాల్స్ తగ్గినాయి కానీ అప్పుడప్పుడు పనీపాటాలేని తిక్క ముండాకొడుకులు రాంగ్ కాల్స్ చేస్తానే ఉండారు. అక్కడికి పోయి పేషెంటే లేకుండా వెనక్కు తిరిగీ వచ్చేలోగా, ఆ టైంలో ఎవరికో నిజమైన ఆపదే జరిగితే కూడా మేం టయానికి పోలేం. దూరంగా ఉండే ఇంకో 108 అక్కడికి వెళ్ళి పేషెంట్స్‌ను తీసుకొని ఆస్పత్రికి వచ్చేలోగా ప్రాణం నిలుస్తుందని గ్యారంటీ లేదు సార్. అట్లా పోయిన ప్రాణాలు కూడా ఉన్నాయి.'

అనసూయ గబాలున అంది 'అవునవును. పోయిన వారం మనమే చూసాం కదా, ఎంత బాధవుతుందో ఇట్లాంటివి జరిగినప్పుడు.'

'అన్నింటికంటే బాధాకరం... అసలు ఘోరం ఇంకోటుంది సార్ ' అన్నాడు యుగంధర్ ఆగి ఆగి మాట్లాడుతూ సంశయంగా.

ఏదో చెప్పటానికి మొహమాటపడుతున్నట్లు కనిపించాడు. చేతులు పిసుక్కుంటూ ... ఇబ్బందిగా మొహం పెట్టి, 'సార్ చాలా ఘోరం సార్.. కడుపుకు అన్నంతినే వాళ్ళెవరూ అట్లాంటి పని చెయ్యరు.' అని సందిగ్ధంగా ఆగిపోయాడు.

'అదా.... చెప్పు చెప్పు తప్పేముందాది? నువ్వు చెప్పినా చెప్పకపోయినా నిజం అదేకదా. ఇప్పుడీ యాక్సిడెంట్ కేసు విషయంలో కూడా నువ్వు చెప్తా వుండేదే కరెక్టు జరిగిందదేలే.' అంది తేలిగ్గా నవ్వేస్తూ అనసూయ.

'ఏం జరిగింది సిస్టర్?' ఈ మధ్యే ఉద్యోగంలో చేరిన కొత్త నర్సు ఒకావిడ కుతూహలాన్ని అంచుకోలేక అడిగేసింది.

'ఎప్పుడు ఎక్కడ యాక్సిడెంట్స్ జరిగినా నూటికి డెబ్బయి భాగాలు జరిగేదే ఇప్పుడూ జరిగింది. పేషెంట్స్ సెల్‌ఫోన్లు, పర్సులు, వాచీలు లేవు. ఇంకా ఏమేం పోయాయో తెలీదు. వెధవలు, రక్తం కార్చుకుంటూ మనిషి ప్రాణంకోసం రోడ్డుపైన పరితపిస్తావుంటే ప్రాణాలు కాపాడాల్సింది పోయి దొంగతనాలు, దోపిడీలు చేస్తారు. దొంగలే ఈ పని చేస్తారనీ కాదు. అంతవరకూ దొంగతనాలు చెయ్యని వాళ్ళు కూడా అట్లాంటప్పుడు .. విలువైన సెల్‌ఫోన్ల కోసం దొంగతనాలు చేసేస్తారు. డబ్బూ నగలు పోయినా పర్వాలేదు. సెల్‌ఫోన్, పర్సుతో బాటు ఐడికార్డులు, లైసెన్సు కాగితాలు అన్నీ ఎత్తుకొని పోతారు. దాంతో గాయపడిన మనుషులెవరో ఎవ్వరికీ తెలీకుండా పోతుంది. చాలా కేసుల్లో చూస్తావున్నా కదా.' అన్నాడు డాక్టరు

ఆ మాటలతో కుర్రకానిస్టేబుల్ 'మొన్నయితే చాలా ఘోరం సార్. రోడ్డుపైన గాయపడి సచ్చేటప్పుడు కూడా ఒకాయన ఎవర్నో అదే పనిగా కలవరించాడు. మేం వెళ్ళేసరికే ఎవరో ఆయన సెల్ ఎత్తేసారు. అదే ఆ సెల్ వుండింటే ... వాళ్ళ వాళ్ళకి ఫోన్ చేసి చెప్పేవాళ్ళం. చివరి చూపయినా దక్కిందేదేమో...'

ఆ మాటలు నచ్చనట్లు వికారంగా మొహం పెట్టాడు ముసలి కానిస్టేబుల్. రాని దగ్గును బలవంతంగా తెచ్చుకొనే ప్రయత్నం చేస్తూ, నోటికి అడ్డంగా ఎడమ అరచేతిని పెట్టుకొని, కుడి చేత్తో మెడవద్ద పట్టిన చెమటను తుడుచున్నాడు.

'మనకే ఆ పరిస్థితి వస్తే.... అని మనిషి ఆలోచించాలి. రోడ్డుపైన యాక్సిడెంట్ అయి ప్రాణం పోతావుండేది మనకే అయితే, మన కుటుంబ సభ్యులకే అయితే... అనే ఆలోచన, భయం, బాధ ఉండాలి. మనిషి పట్ల మనిషికి ప్రేమ, బాధ్యత, ఉండాలి. అప్పుడు ఇట్లాంటివి తగ్గుతాయేమో. లేదా జరగవేమో' అన్నాడు డాక్టర్. మెయిన్ రోడ్డువైపు చూస్తూ.

సైరన్ వేసుకుంటూ మరో 108 వాహనం మెయిన్ రోడ్డు నుండి ఆస్పత్రి ఆవరణలోకి వేగంగా వచ్చి క్యాజువాల్టీ ముందు ఆగింది. ఇద్దరు క్షతగాత్రులు. మొదట పైలెట్ దిగి 108 వెనుక నిలబడ్డాడు.

ఆస్పత్రి బయట అక్కడక్కడా తిరుగుతున్న వాళ్ళు, దూరంగా నిల్చున్న వాళ్ళు కదిలారు. ఆస్పత్రి సిబ్బంది చురుగ్గా కదిలారు. క్యాజువాల్టీ ముందు గుంపు చేరిపోయారు.

స్ట్రెచర్‌పై రక్తగాయాలతో, నొప్పితో విలవిలలాడుతున్న ఇద్దర్ని చక చకా స్ట్రెచర్‌పైన ఆస్పత్రి లోపలికి మోసుకు వెడుతున్నారు.

గుంపులో కలకలం.

'ఎవరు ...?'

'ఎవరు వాళ్ళు... పాపం. బతుకుతారో లేదో...'

'మరీ చిన్న వయస్సు. ఏ తల్లి కన్న బిడ్డలో ఏమో?'

'తెలిసినవాళ్ళేమో చూడండి ...'

'వీళ్ళెవరో మీకు తెలుసా...?!'



Statement about ownership and other particulars of periodical **ARUNATARA** as required to be published in the first issue of every year after the last day of February.

**Form IV (See Rule 8)**

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | Vijayawada |
| 2. Periodicity of its Publication | : | Monthly |
| 3. Printer's Name | : | Chalasani Prasad |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 33-13-3, Seetarampuram Vijayawada-520 002. |
| 4. Publisher's Name | : | Chalasani Prasad |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 33-13-3, Seetarampuram Vijayawada-520 002. |
| 5. Editor's Name | : | Chalasani Prasad |
| Whether citizen of India | : | Indian |
| Address | : | 33-13-3, Seetarampuram Vijayawada-520 002. |
| 6. Name and addresses of Individuals who own the newspaper | : | Chalasani Prasad |

I, Chalasani Prasad, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

*Sd/-*

*(Chalasani Prasad)*

Date : 1st March, 2015 Signature of the Publisher

కథ

# అయ్యో రామ

- బమ్మిడి జగదీశ్వరరావు

శ్రీరాముడు శిరసు పట్టుకు కూర్చున్నాడు. శిరోభారం దించుకొనే దోవ కనబడినట్టు లేదు. సీత చిన్నబోయినా తల తిప్పి చూడలేదు. ఆందోళనలో పడ్డ ఆంజనేయుడు 'రామ...రామ...' అని జపించడం మాని 'అయ్యో రామ' అని తపిస్తూ ఉన్నాడు!?

తల్లి మాట విని తండ్రి మాటలకు తలవంచి అడవులకెళ్ళినప్పుడు ఇంత బాధ పడలేదు, ధర్మమనుకున్నాడు. రావణుడు తీసికెళ్ళిన సీతను తెచ్చి తిరిగి ఇంట్లో పెట్టుకున్నాడని - జనంలో ఒక్కడు అంటే ఇంత బాధ పడలేదు, ఖర్మమనుకున్నాడు. ఇప్పుడు జనమంతా తలోమాట అంటూ ఉంటే, 'శ్రీరామనవమి జరుపుకోను, సీతను పెళ్ళి చేసుకోను, ఏటా పెళ్ళి దేనికి? ఈ మనుషులు వీళ్ళు మాత్రం పెళ్ళి ఒక్కసారే చేసుకుంటారు, నాకు మాత్రం ఏటికేడూ పెళ్ళే...' నీలమేఘం కరిగి కన్నీరై కురిసింది!?

'బ్రహ్మచారిగా ఉండిపోవడంతో బతికిపోయాను' అనుకుని అంత దుఃఖం లోనూ కొంత ఆనంద పడ్డాడు ఆంజనేయుడు!?

'పెళ్ళి చేస్తే తిక్క కుదురుతుంది...' ఎవరో ఎక్కడో శాస్త్రం పొడిస్తే తననే పొడిచినట్టు ఉలిక్కి పడ్డాడు రాముడు.

'నీ పెళ్ళి నా చావు కొచ్చింది...' చంద్రబాబు నాయుడు ముక్కులుతూ ఉన్నాడో పక్క, మరో పక్క 'మా మనోభావాలు దెబ్బతిన్నాయి...' అంటే 'మా మనోభావాలు దెబ్బతిన్నాయి..' అని ఏ ప్రాంతానికా ప్రాంతం భగ భగ మండి పడుతున్నారు.

'భక్తుల మనోభావాలు చాలా గొప్పవి...' ఆధ్యాత్మిక వేత్తలు ఆవేదన చెందుతున్నారో, పెంచుతున్నారో తెలియడం లేదు.

'భగవంతుడి మనోభావాల కన్నా భక్తుల మనోభావాలే ముఖ్యం..' భక్తాగ్రేసరుడయిన ఆంజనేయుడు అనుకోకుండా ఉండలేకపోయాడు. 'జనంలో రామభక్తి పెరగడం పొంగిపొర్లడం బాగుంది గాని, అదిలా రాములోర్ని ముంచెత్తడమే బాగులేదు' అనుకొని 'అయ్యో రామ' అన్నాడు...అంటూనే ఉన్నాడు ఆంజనేయుడు.

'ఇది నాకు అగ్ని పరీక్ష...' చంద్రబాబు నాయుడు మూలగడం చూసి సీతమ్మ తాను అగ్ని పరీక్షకు గురయిన ఘట్టం మరిచిపోయింది.

రాముడిప్పుడు కళ్యాణరాముడు కాదు, కన్నీటి రాముడు. రాముడి కళ్ళలో నీళ్ళు నిండాయి. రాముని గడ్డం ఎత్తి కళ్ళలోకి చూసింది సీత.

'పోనీ మనం పెళ్ళి చేసుకోవడం మానేద్దాం...' పతి మనసును అర్థం చేసుకున్న సతి అయ్యింది సీత.

సీత అరచేతిని చాచి అర్థించింది. ఆమె చేతిలో రాముని దుఃఖపు బొట్టు జారి పడింది. ఆ కన్నీటి బొట్టు పాదరసం పూసినట్టు వణుకుతున్న చేతిలో అటూ ఇటూ దొర్లింది. ఆ కన్నీటి చుక్కలో ఇంద్రధనస్సును మించిన ఏడు రంగులున్నాయి. అంతేనా? అద్దంలా ప్రతిఫలిస్తోంది. రాముని ప్రతిరూపం ఒక్కటేనా? కళ్యాణరాముడు... కోదండరాముడు... పట్టాభిరాముడు... భద్రాద్రిరాముడు... సీతారాముడు...

కన్నీటి అద్దంలో రాముడు తన ప్రతిరూపాన్ని తనే చూసుకోవడం సీతకు అంత దుఃఖంలో ఒకింత ముచ్చటేసింది. ముసి ముసిగా నవ్వింది. ఆ నవ్వు ఎంతో సేపు సీత ముఖాన పొడిచి నిలవలేదు.

'భద్రాద్రి రాముడు లేడు, ఇంకెక్కడా? తెలంగాణలో ఉండిపోయాడు. మన ఆంధ్రావాళ్ళకు ఆంధ్రా రాముడు ఉండొద్దా? ప్రాంత భక్తి భగవంతుడి మీద భక్తిని అధిగమించడంతో 'భద్రాచలాన్ని మర్చిపో...' వీరభక్తులు వీరతిలకం దిద్దుకున్నారు.

ఎనకాల ఉన్న ఏడుకొండల వాడు 'గోవిందా గోవింద' అన్నాడు, 'ఆంధ్రాలో వెంకటేశ్వరస్వామి మనకెందుకు?' అంటారని అతని గుండెల్లో రాయి పడింది. ఇలా అయితే కుబేరుని అప్పు తీర్చేదెలా అనేమో దిగులు పడ్డాడు.

'శ్రీరామ నవమి వేడుకలు ప్రభుత్వం ఎక్కడ నిర్వహిస్తుందో తేల్చి చెప్పాలి...' నినాదాలే మంత్రాలయ్యాయి.

'ప్రజలు ఎక్కడ నచ్చితే అక్కడ నిర్వహించుకుంటారు, ప్రభుత్వం దేనికి?' సీతమ్మ అమాయకంగా అడిగింది.

రాముడికి సిగ్గుతో కాదు, చింతతో మాట రాలేదు.

'ఎప్పటిలాగే భద్రాద్రిలో వేడుకలు...' ప్రజాగ్రహం చూసి ఆంజనేయుడు మాట మింగేసాడు. 'దేవుళ్ళని కూడా వాటాలేసుకుంటున్నారు' గొణుక్కున్నాడు.

ఒంటిమిట్టకు ఓటేసాడు ముఖ్యమంత్రి చంద్రబాబు నాయుడు. అంతే భక్తులు హారతి కర్పూరంలా భగభగమని నిరసన మంటలు వరుసన వేసారు. ఒక్కొక్కరూ ఒక్కో అగ్నిగుండమయ్యారు.

'మా ఉత్తరాంధ్ర వెనకబడింది. దేవుడి విషయంలోనైనా ముందున ఉంచాలి. రామనామం...రామతీర్థం! రాముని పేరుతో ఉంది. త్రేతాయుగం నుంచీ ఉంది. అంచేత శ్రీరామనవమి వేడుకలు విజయనగరం జిల్లా రామతీర్థంలో జరపాలి...'

'మా చిత్తూరు జిల్లా వాల్మీకిపురం అన్ని విధాల యోగ్యమైనది. రాముడు ఆయుధాలు వదిలి రుషిలా పాలించాడు. పైగా ఇక్కడి రాముడు పట్టాభిషిక్తుడు. రాముణ్ణి సృష్టించిన వాల్మీకి పేరు గల పురం...'

'మా కడప జిల్లా ఒంటిమిట్టలోని రాముడు కోదండరాముడు. ఇక్కడ నూటా అరవై రెండు అడుగుల ఎత్తులో గాలి గోపురం ఉంది. ఇంత ఎత్తయిన గుడి ఎక్కడా లేదు. ఇలాటి కట్టడం మరెక్కడా లేదు...'

కోతి చేతిలో కాదు. భక్తుల చేతిలో కొబ్బరికాయలున్నాయి. తామనుకున్న చోటనే కొట్టాలని సిద్ధమయిపోయారు.

'దేవుడా...' అనుకున్నాడు రాముడు.

రాముణ్ణి చూసిన సీత ముఖంలో పెళ్ళికళ లేదు!?

'మా రామతీర్థం త్రేతాయుగం నుంచీ ఉంది. పాండవులు ఈ తోవనే వెళ్ళారు. దశావతారాల్లో నాలుగవతారాలు ఇక్కడే చూడొచ్చు.'

'మా వాల్మీకిపురానికి పురాణ, చారిత్రక ఆధారాలున్నాయి. మన గుడికి దక్షిణ దిక్కున ఉన్న కోతుల మిట్ట..కోతులమిట్ట కాదు శ్రతశృంగ పర్వత శ్రేణులవి...'

'మా ఒంటిమిట్టకు దగ్గరలోనే కీర్తనలు రచించిన అన్నమయ్య

ఊరు తాళ్ళపాక ఉంది. త్రేతాయుగంలో జాంబవంతునితో శ్రీరాముడు ఇక్కడే తిరుగాడాడు...'

ఎవరి వాదన వారిదే.

ఆంజనేయుడు మారు రూపు ధరించి వెళ్ళి 'రాముడు బండల్లో కాదు గుండెల్లో ఉండాలి..ఉన్నాడు' గుండె తెరిచి చూపేవాడే అతనికా అవకాశం ఇవ్వలేదు. అవతలకి తోసేసారు.

'అంతా రామమయం...జగమంతా రామమయం...' పాట వెక్కిరిస్తూ ఉంది.

టీవీల్లో భక్తులు బల ప్రదర్శనకు దిగిపోయారు. వేదనన్నారు. ఆవేదనన్నారు. ఆవేశం చూపించారు.

'1652లోనే ఫ్రెంచి దేశానికి చెందని భక్తుడొకడు ఒంటిమిట్ట దేశంలోని రామలయాల్లోనే ప్రాశస్త్యమైందని చెప్పాడు...'

'అలాగయితే మా వాల్మీకిపురానికి సి.పి.బ్రౌన్, థామస్ మన్రో... ఇలా ఎందరో వచ్చారు...'

'మా రామతీర్థానికి ఆంజనేయుడే వచ్చాడు..'

'మా రాముడి దగ్గరికి జాంబవంతుడే వచ్చాడు...'

'మా ఒంటిమిట్టలో ఆంజనేయుడే లేడు. అది కదా గొప్ప...'

ఇదంతా చూస్తున్న ఆంజనేయుడు బుంగమూతి పెట్టి బాధపడడం చూసిన సీతమ్మకి ఏడుపు పోయి నవ్వొచ్చింది.

అంతలోనే తన మగని పేరుతో-దేవుని పేరుతో ప్రాంతాలు విడిపోతాయా? తన ఆలోచనలకు తనే ఉలిక్కిపడింది సీత.

'మా ఆదాయం...మా రామతీర్థం ఆదాయం కోటిన్నర... ప్రభుత్వ హోదా ఇచ్చినా మీ ఒంటిమిట్టది ముప్పైఅయిదు లక్షలే..'

సీతారాములు ఇద్దరూ ముఖముఖాలు చూసుకున్నారు.

'మా రామతీర్థాల్లో పగలు ముహూర్తం..పగలు పెళ్ళి...భక్తులకి ఇబ్బంది లేదు...మీది రాత్రి ముహూర్తం.. భక్తులకి ఎంత కష్టం'

'అటు తిరుపతి ఇటు ఒంటిమిట్ట...ఆపైన శ్రీశైలం..అన్నీ కలిపితే ఆధ్యాత్మిక ప్రాంతమయిపోతుంది. టూరిజం డెవలప్ అయిపోతుంది. బిజినెస్సే బిజినెస్సు. ఆదాయమే ఆదాయం...'

'ఆ పక్క అరసవెల్లి, ఈ పక్క శ్రీకూర్మం...అల్లవతలపక్క శ్రీముఖలింగం..అన్నీ కలిపితే ఆధ్యాత్మిక ప్రాంతమయిపోతుంది. టూరిజం డెవలప్పయిపోతుంది.బిజినెస్సే బిజినెస్సు. ఇన్‌కమ్మే ఇన్‌కమ్ము..'

సన్యాసులు తగ్గలేదు. ఒగ్గలేదు.

'మేమే అంత సన్యాసుల్లా కనపడుతున్నామా, మా ఊర్లో రామకోవెల ఉంది...'

'మా వీథిలో రామకోవెల ఉంది...'

'మాకూ రామ మందిరం ఉంది...'

'మొత్తం పదమూడు జిల్లాలు..జిల్లాకో ఏడాది ఇచ్చినా పదమూడు జిల్లాల్లోనూ పెట్టొచ్చు. పన్నెండు నదుల్లో ఏడాదికో నదిలో పుష్కరం జరిపినట్టు...'పండితుడు ఆలోచనామృతం పోసాడు -

ఇప్పుడు విజయనగరం, చిత్తూరు, కడప - ఈ మూడు జిల్లాలకు తోడు పది జిల్లాలు మాకంటే మాకని పేచీకి దిగాయి... మూడు జిల్లాల నిప్పు పదమూడు జిల్లాలకు అంటుకుంది.

'అసలు ఒంటిమిట్టకు హోదా ఎలా ఇచ్చారో ముఖ్యమంత్రే చెప్పాలి!'

'ఎలా ఏంటి? అచ్చం రాజధాని లాగే! రామతీర్థం ఒరిస్సాకి దగ్గరుంది. వాల్మీకిపురం తమిళనాడుకి దగ్గరుంది. అందరికీ మధ్యలో ఏది ఉందో అదే - అదే రాజధాని న్యాయం...' 'దేశం' భక్తుని వివరణకి గులాబీ కండువా ఒప్పలేదు, 'అనాదిగా ఆచారంగా ఎప్పటిలాగే భద్రాద్రి లోనే పట్టువస్త్రాలు, ముత్యాలు దేవునికి ప్రభుత్వం సమర్పించుకోవచ్చు. దేవుడు అందరికీ ఒకటే, అందుకే తెలంగాణ వస్తే దర్గాకి, తిరుపతి ఏడుకొండల వాడికి పదికోట్లు ప్రకటించారు మా మంత్రి...' గులాబీ కండువా -

ఎవరి రంగు వాళ్ళు బయటపెట్టుకున్నారు.

మీడియాకి పుట్ పెట్టలేనంత ఫుటేజీ -

'దేవుడు కాపాడాడు..' ప్రభుత్వం ఊపిరి పీల్చుకుంది. 'ప్రజల అన్ని సమస్యల్నీ పక్కన పెట్టిన రాముడు నిజంగానే దేముడు...' కృతజ్ఞతగా ముఖ్యమంత్రి పట్టువస్త్రాలు సమర్పించుకున్నారు.

'ఈ నరుల కన్నా వానరులే మిన్న...' చెమర్చిన కళ్ళతో అంది సీత.

గర్వంగా ఆంజనేయుడి ఛాతి ఉప్పొంగింది.

'నా వనవాస జీవితమే బాగుంది..' గొణుక్కున్నాడు రాముడు.

అర్థం కానట్టు చూసింది అర్ధాంగి సీత.

'రావణుడి హస్తాల్లోంచి నిన్ను రక్షించుకున్నాను. ఈ భక్తుల కబంధ హస్తాల్లోంచి నన్నెవరు రక్షిస్తారు?! రాముడు పసిపిల్లాడికి మల్లే సీత పైట పట్టుకు వెక్కి వెక్కి ఏడ్చాడు. ☆

<u>తీర్మానం - 1</u>

<u>బొబ్బిలి సాహిత్య పాఠశాల</u>

## నరేంద్ర మోడీ నాయకత్వంలోని సంఘ్‌పరివార్ హిందుత్వ శక్తుల ఫాసిజాన్ని ఓడిద్దాం!

భారతదేశంలో హిందుత్వ శక్తులు అన్ని ప్రజాస్వామిక సంస్థల మీద, భావజాలం మీద పెద్ద ఎత్తున దాడి చేస్తున్నాయి. నరేంద్ర మోడి ప్రధానమంత్రిగా అధికారం చేపట్టిన తరువాత సంఘ్‌పరివార్ శక్తులు తమ దాడిని తీవ్రతరం చేసాయి. చరిత్రను వక్రీకరిస్తున్నాయి. పాఠ్యాంశాలను హైందవీకరించటానికి మొత్తంగా విద్యను కాషాయీకరించే దుర్మార్గానికి తెగబడుతున్నాయి. సర్దార్ పటేల్ ఉక్కు విగ్రహం ప్రతిష్ఠించే కార్యక్రమాన్ని హిందుత్వ ఆధిపత్యానికి సంకేతంగా ముందుకు తెస్తున్నాయి. గుజరాత్‌లో జరిగిన మారణకాండ గాయాలు సలపుతూండగానే ముజఫర్‌నగర్ ఘాతుకాలు ముందుకు తెచ్చారు. మరొకవైపు సామ్రాజ్యవాద శక్తులకు దన్నుగా నిలుస్తూ దేశాన్ని బహుళజాతి కార్పొరేట్లకు అప్పగించే చర్యలకు పాల్పడుతూ సామాన్య ప్రజల మీద, ఆదివాసుల మీద ప్రత్యక్ష యుద్ధాన్ని, హింసను అమలు చేస్తున్నది. ఏకంగా రాజ్యాంగంలో 'లౌకిక', 'సామ్యవాద' పదాలనే తొలగించే పనికి పూనుకుంటున్నది. మతం విషయంలో 'ఘర్‌వాపస్' అని, స్త్రీల విషయంలో హిందూ స్త్రీలు ఒక్కొక్కరు నలుగుర్ని కనాలని పిలుపునిస్తున్నది. ఇంత జరుగుతున్నా మోడీ తన స్పందన తెలుపకుండా ఫాసిజాన్ని తీవ్రంగా అమలు చేయటానికి, ఫాసిస్టు రాజ్యంగా భారత రాజ్యాన్ని తన చెప్పుచేతల్లో నడిపించటానికి తన గుజరాత్ అనుభవాన్ని ఉపయోగిస్తున్నాడు. నరేంద్రమోడీ, సంఘ్‌పరివార్ హిందుత్వ శక్తుల దుర్మార్గాన్ని, ఫాసిజాన్ని విప్లవ రచయితల సంఘం తీవ్రంగా ఖండిస్తున్నది. ప్రజాస్వామిక శక్తులు, వ్యక్తులు సంఘటితం కావాలని, ఫాసిజాన్ని నిలువరించాలని, ఓడించాలని పిలుపునిస్తుంది.

గల్పిక

# పెట్టుబడి చరిత్ర

- పి.చిన్నయ్య

విశ్వనగరంగా మారబోతున్న హైదరాబాద్‌లో ఈ మధ్య పారిశ్రామికవేత్తల సమావేశమొకటి స్థానిక పెట్టుబడిదారుల సహకారంతో జరిగింది. జాతీయ, అంతర్జాతీయ ప్రతినిధులు హాజరయ్యారు. (అవినీతి కుంభకోణాల్లో ఇరుక్కున్న రాజకీయ నాయకులు, బ్యాంకుల దగ్గర వేలకోట్ల రూపాయలు తీసుకున్న విల్‌ఫుల్ డిఫాల్టర్ పారిశ్రామికవేత్తలు గూడా దానిలో పాల్గొన్నారనుకోండి) వారి సమావేశ ప్రధాన ఉద్దేశం, ఈ ప్రాంత పునర్నిర్మాణ అభివృద్ధిలో భాగంగా తమ పెట్టుబడులు, వాటికొచ్చే లాభాలను పంచుకోవడంలో ఎదురయ్యే సమస్యలు, సవాళ్ళు, వైరుధ్యాలను సామరస్యంగా పరిష్కరించుకోవటమే. ఈ సమావేశపు మధ్యలో అకస్మాత్తుగా ఓ ఆంధ్ర పెట్టుబడి (ఆ.పె) దారుడు కోపంతో లేచి,

'ఇంకా ఎంతకాలమని ఈ తిట్లను, అవమానాలను భరించాలి చెప్పండి మేం?' ఆవేశంగా అరిచాడు.

'మిత్రమా, ఎందుకంత కోపం, నెమ్మదిగా చర్చించుకొని, పరిష్కరించుకుందాం కాదా?' స్థానిక పెట్టుబడి (స్థా.పె) దారుడు సర్ది చెప్పబోయాడు.

'మీకేమిటండి, ఎన్నన్నా చెబుతారు. తగిలేటోనికి తెలుస్తది బాధ. మీ ప్రాంత నాయకులు మమ్మల్ని వలసవాదులని, దోపిడిదారులని, దొంగలని, లఫంగులని అనరాని మాటలు అంటూనే ఉన్నరు. మీ ప్రాంత కవి గాయకులు తక్కువ తిన్నరా? మమ్మల్ని అవమానపరుస్తూ, పాటలు, కవితలు ఇప్పటికీ పాడుతూనే ఉన్నరు. ఎంత కాలం ఓపిక పట్టాలి?' మరింత కోపంతో లేచాడు ఆ.పె.దారుడు.

స్థా.పె.దారునికి, ఆ.పె.దారుణ్ణి ఎలా సముదాయించాలో అర్థంగాక, పక్కనే ఉన్న అంతర్జాతీయ పెట్టుబడి (అ.పె) దారునికి సమస్యనంతా వివరించాడు.

అ.పె.దారుడు ఇటువంటి విషయాల్లో బాగా నలిగి ఉన్నాడు. క్షణాల్లో సమస్యనంతా సంపూర్ణంగ అర్థం చేసుకుని, ఆ.పె.దారునితో

'మిత్రమా! ఇంత చిన్న విషయానికి అంత కోపమెందుకు చెప్పు? మన చరిత్ర స్థల, కాలాల్ని బట్టి ఎలా మారుతుందో, మనం దానికనుగుణంగా ఎలా మారాలో చెబుతా జాగ్రత్తగా విను...

ఒకప్పుడు మీ దేశాన్ని మేం పాలించాం. మీ ఒక్క దేశాన్ని కాదనుకో, ప్రపంచంలో చాలా దేశాలను ఆక్రమించి పాలించాం. మేం మీ దేశంలో రోడ్లు, రైళ్ళు (ఆ కాలానికి రింగురోడ్లు, మెట్రో లైన్లు, బుల్లెట్ రైళ్ళ ఆలోచన రాలేదనుకోండి మాకు), పరిశ్రమలు పెట్టి అభివృద్ధి చేయాలని ఎంతో ప్రయత్నించినా, మీ దేశంలో కొంతమంది అభివృద్ధి నిరోధకులు, తీవ్రవాద శక్తులు మేము మీ దేశాన్ని దోపిడీ చేస్తున్నామని, సంపదనంతా మా దేశానికి తరలించుకు పోతున్నామని మామీద నిందలు వేసి, పుస్తకాలు రాసి, నానా రకాలుగా ప్రచారం చేసి, ప్రశాంతంగా జీవిస్తున్న ప్రజల్లో అసంతృప్తిని రగిల్చి, మా మీదికి ఉసిగొల్పిరి (ఈ ప్రాంతం వాళ్ళను మీ మీదికి ఉసిగొల్పినట్లు). భగత్‌సింగ్ అనే తీవ్రవాది ఏకంగా పార్లమెంట్‌లోనే బాంబులు వేశాక ఇంత పెద్ద ప్రాంతాన్ని పాలించటం సాధ్యం కాదని అర్థమయ్యాక, ప్రత్యామ్నాయం ఆలోచించి, మా నమ్మినబంట్లయిన నాయకుల చేతిల అధికారం పెట్టి మా దేశానికి వెళ్ళిపోతిమి. అయితే ఏమిటి? బహుళజాతి కంపెనీల రూపంలో తిరిగి మీ దేశానికి రాలేదా! అప్పటి కంటే ఎక్కువ లాభాలను తీసుకుపోవటం లేదా! ఏది కావాలన్నా మీ దేశ నాయకులు క్షణాల్లో చేసి పెట్టడం లేదా?

ఈ రోజు మిమ్మల్ని అంటున్నట్టే, ఆనాడు మమ్మల్ని దొంగలని, దోపిడీదారులని, విదేశీ తెల్లకుక్కలని నానా మాటలన్నారు. 'మా కొద్దు ఈ తెల్లదొరమని' ఓ కవంటే, 'ఎవడువాడు, ఎచటివాడు ఇటువచ్చిన తెల్లవాడు' అంటూ ఇంకో కవి పాట రాయలేదా? అయినా బాధపడ్డామా మేము? కాలమే గాయాల్ని మాన్పుతుంది. మాలాగే మీరూ కొంత కాలం ఓపిక పట్టాలి. ఈ ప్రాంతం మీద తాత్కాలికంగా రాజకీయ అధికారాన్ని కోల్పోయారే గాని, అంతకంటే ఎక్కువ లాభాలను కళ్ళచూస్తారు. అయినా ఈ ప్రాంతపువారి మీద అంత కోపం, కసి ఎందుకు? నలభై, యాభై లక్షల జనాభా ఉన్న స్కాట్లాండు వాళ్ళే మా మీద కోపంతో ప్రత్యేక దేశం కావాలంటుంటే, మూడు కోట్లున్న ఈ ప్రాంతం వాళ్ళు రాష్ట్రాన్ని కోరుకుంటే తప్పేముంది? దేశాన్ని కోరుకుంటే తప్పుగాని! అయినా మొత్తం మాకే దక్కాలనే దురాశ మంచిది కాదు. ఈ ప్రాంత మిత్రులకు కొంత దక్కాలి గదా. ఈ ప్రాంతం నుండి మన వర్గ మిత్రులు కొత్తగా ఎదుగుతున్నారు. వారికి అవకాశం కల్పించాలి. వారిని మనతో కలుపుకోవాలి. మనం వారిలో కలిసిపోవాలి.

ప్రపంచ కార్మికులందరూ ఏకం కావాలని అటువైపు వాళ్ళంటారు. ప్రపంచ పెట్టుబడిదారులమంతా ఐక్యంగుండాలని మనమనాలి. మన మధ్యుండే పోటీ, అనైక్యతే విప్లవాలకు కారణమైతాయని మార్క్స్ అనే పెద్దమనిషంటాడు. అందుకే మన మధ్య, మనకు పాలకులకు మధ్య తలెత్తే సమస్యల్ని మన ప్రపంచ పెద్దన్న అమెరికా సమక్షంలో పరిష్కరించుకోవాలి. ఆంధ్ర పెట్టుబడిదారులను ఈ రాష్ట్రంల పెట్టుబడులు పెట్టొద్దని ఈ ప్రభుత్వం అనటం లేదే. పైగా ప్రపంచంలో ఎక్కడ లేని విధంగ, లక్షలాది ఎకరాలను మనకోసం సర్వ సౌకర్యాలతో సిద్ధంగా ఉంచి, ఎటువంటి గొడవలు పడకుండా ఈ ప్రాంత పునర్నిర్మాణంలో భాగస్వాములవాలి మనం. అసలు పునర్నిర్మాణం అంటే ఏమిటనుకుంటున్నారు? మన మధ్యున్న వైరుధ్యాలను పరిష్కరించుకోవటం. లాభాలను పంచుకోవటమేగా!'

ఇంత విన్నాక కూడా స్థా.పె.దారునికి మనసుల కొన్ని భయాలు, అనుమానాలు వెంటాడతూనే ఉన్నాయి. ఎంతైనా తెలంగాణోడు గదా!

'మన మధ్యున్న సమస్యల్ని పరిష్కరించుకుంటం సరే, కాని మనకు, ప్రజలకు మధ్య వైరుధ్యాలు పెరుగుతున్నాయి కదా, అవి ఎట్లా పరిష్కారమైతవి?' అ.పె.దారుణ్ణి అడిగాడు.

'వాటిని పరిష్కరించటానికేగా సైన్యాన్ని దేశం మధ్యలకు దించేది'

'దేశం మధ్యలకా, ఎందుకు?'మరింత భయంతో అడిగాడు స్థా.పె.దారుడు.

'మనకు దక్కాల్సిన కావలసినన్ని వనరులున్నది అక్కడే. మనకు దక్కకుండ చేస్తున్న ప్రత్యర్థులున్నది అక్కడే గనుక. అందుకే అమెరికా, ఇజ్రాయిల్‌లలో సైనిక శిక్షణ ఇప్పించేది' అ.పె.దారుని జవాబుతో పెట్టుబడిదారుల మొఖాలన్నీ వెలిగాయి. ఒక్క స్థా.పె.దారుని ముఖం తప్ప. ఎందుకంటే ఆయన తెలంగాణ పోరాట చరిత్రను కళ్ళారా చూసినోడు గనుక.



# పల్లెను మింగిన పెట్టుబడి : ఒక చర్చ

- ఆర్.వి. రమణ మూర్తి

ఎస్. విద్యాసాగర్ గారు రాసిన 'పల్లెను మింగిన పెట్టుబడి' పుస్తకంపై 'అరుణతార' జనవరి 2015 సంచికలో ఎన్.రవిగారు రాసిన సమీక్ష ఆసక్తి కలిగించడమే కాకుండా, దీనిపై కాస్త లోతుగా చర్చ జరగాలన్న అభిప్రాయం కలగడం ఈ వ్యాసం యొక్క స్ఫూర్తి. పుస్తకాన్ని సమీక్షిస్తూ పుస్తకంలో ప్రస్తావించిన గ్రామీణ జీవితంలో, రైతుల వ్యవసాయ పద్ధతుల్లో, పంటల్లో, మార్కెటు సంబంధాల్లో మార్పులను ఎవ్వరూ కాదనలేని వాస్తవాలని చెపుతూ వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానం పూర్తిగా ఒచ్చిందన్న వాదనను రవిగారు సున్నితంగా తిరస్కరించారు. రచయిత చెప్పిన వివరాలు ఎత్తుగడల కోసం పరిగణనలోకి తీసికోవాలనీ రవిగారు చేసిన సూచనలో స్పష్టత లేదు. దేనితో ఎందుకు ఆమోదిస్తున్నారో, దేనితో ఎందుకు విభేదిస్తున్నారో అర్థం కాలేదు. సిద్ధాంతాలని వాస్తవాలతో నిరూపించుకోవడం అందరికీ అవసరం. వాస్తవ నిరూపణకి అసంభవమైన సిద్ధాంతం అశాస్త్రీయం.

నిజానికి పుస్తకంలో విద్యాసాగర్ రాసిన గ్రామీణ వ్యవసాయంలో జరిగిన మార్పులని చాలా మంది పరిశీలకులు ఇటీవల కాలంలో క్షేత్ర స్థాయి ఆధారాలతో విశ్లేషించారు. పెరిగిన ఉత్పత్తి, ఉత్పాదకత, పెట్టుబడి, ద్రవీకరణ, పెరుగుతున్న వేతన కార్మికులు, బ్యాంక్ రుణాలు, కొత్త వంగడాలు, ఎరువులు, యంత్రాలు, మార్కెట్లు వగైరాలన్నీ రవిగారు ఒప్పుకున్నట్టు అర్థమౌతోంది. ఇవన్నీ కూడా పెట్టుబడిదారీ వ్యవస్థ లేకుండానే అన్నది వారి నిర్ధారణ. స్థూలంగా రవిగారు పుస్తకంతో విభేదించిన అంశాలు ఐదు. మొదటిది భూకమతాల కేంద్రీకరణ మాత్రమే వ్యవసాయంలో పెట్టుబడి సంబంధాలు పూర్తవడానికి కావలసిన షరతు. చిన్న కమతాలుండడం రచయిత పేర్కొన్నట్టుగా కాక పెట్టుబడిదారీ విధానంలో సాధ్యపడని ఒక వైరుధ్యం అనీ వారి భావన. రెండవ అంశం, కౌలు మార్కెటులో పెద్ద రైతులు చిన్నరైతుల దగ్గర నుండి భూమి కౌలుకు తీసుకోవడం మాత్రమే పెట్టుబడిదారీ విధానానికి సంకేతం, చిన్న రైతులు పెద్ద రైతుల నుండి కౌలు తీసుకోవడం 'అర్ధ భూస్వామ్యాని'కి చిహ్నం అని వారి వాదన. మూడవ అంశం గ్రామీణ ప్రాంతంలో వ్యవసాయ ఆధారిత కార్మికులు 51 శాతానికి పడిపోవడం, గణాంకాలు పొరపాటే కానీ నిజం కాకపోవచ్చు అని. అలాగ అయితే మిగతా 49 శాతం ఏం చేస్తున్నారని వారి ప్రశ్న. నాలుగవ అంశం వ్యవసాయంలో పెరిగిన యాంత్రీకరణ వాస్తవమే అయినా, అది శ్రమను తగ్గించడానికే గానీ రైతు లాభార్జనకు పనికి రాలేదు. లాభార్జన లేని యాంత్రీకరణ కూడా పెట్టుబడిదారీ విధానంలో భాగంకాదు అని వారి అభిప్రాయం. నాలుగవది, మార్క్స్, కౌట్స్కీ లెనిన్‌లు చెప్పిన పెట్టుబడిదారీ విధాన విశ్లేషణ భారత దేశానికి మాత్రం వర్తించదు. ఐదవది, రచయిత భూమి జాతీయం చేయడం వల్లనే భూ సమస్య పరిష్కారం అవుతుందన్న వాదనతో పూర్తిగా విబేధించడం. ఈ ఐదు అంశాలను విశ్లేషిస్తూనే పుస్తకంపై నా అభిప్రాయం కూడా చెప్తాను.

భారత దేశంలో స్వాతంత్ర్యానంతరం పెట్టుబడి-రాజ్యం స్వభావంపై 1970 దశకంలో పెద్ద చర్చే జరిగింది. కేవలం ఉత్పత్తి శక్తుల అభివృద్ధి కాక, ఉత్పత్తి సంబంధాలు సమగ్రంగా మారినప్పుడే దాన్ని పెట్టుబడిదారీ విధానంగా అంగీకరించాలని ఇంగ్లిషు మార్క్సిస్టు అయిన మారిస్ డాబ్ ప్రతిపాదించాడు. కానీ పాల్ స్వీజీ అనే అమెరికన్ మార్క్సిస్ట్ సరుకు ఉత్పత్తి, మారకపు సంబంధాలల్లో వ్యాపారధోరణి ఒస్తే చాలని, వలసవాదం ఆ రకంగా ప్రపంచానికంతా పెట్టుబడి సంబంధాలను చేరవేసి సాంప్రదాయ సంబంధాలను మార్చేసిందని వాదించాడు. చాలా మంది డాబ్ వాదననే సరైన మార్క్సిస్టు పద్ధతిగా ఒప్పుకోవడం జరిగింది. భారత దేశంలో బ్రిటిషు పాలకులు రైతువారీ చట్టాలను అమలుచేసి, ఆనకట్టలు నిర్మాణం చేసి, భూమిని ఆస్తి హక్కును చేసి, భూమి శిస్తును ద్రవ్యీకరించడం ద్వారా సరుకు ఉత్పత్తిని ప్రోత్సహించడం ద్వారా వ్యాపార ధోరణులు చాలా ప్రాంతాల్లో 19వ శతాబ్దంలోనే మొదలయ్యాయి. కానీ దున్నేవారి చేతిలో కాక భూమి భూస్వాముల చేతిలోనే కేంద్రీకృతమైంది. తత్ఫలితంగా కౌలు విధానం విస్తృతమైంది. కానీ రైతువారీ ప్రాంతాల్లో హరిత విప్లవం తర్వాత కౌలు విధానం క్షీణించి, యజమాని వ్యవసాయమే విస్తరించింది. జమీందారీ ప్రాంతాల్లో భూ బదలాయింపు జరగక ఫ్యూడల్ శక్తుల ఆధీనంలో భూమి ఉండడం వల్ల, కూలీ విధానం పూర్తిగా రాక, బలవంతపు బానిస శ్రమ విధానాలు ఇంకా ఉండడవల్ల, కుల వివక్ష ద్వారా శ్రామికులను అణచి వేసే వ్యవస్థ వల్ల దళారీ వ్యాపారుల చేతుల్లో, భూస్వామ్య చేతుల్లో ఇరుక్కున్న కౌలుదారులకు పెట్టుబడిదారుగా వ్యవహరించే వెసులుబాటు లేదని కొంత మంది (ఉత్సా పట్నాయక్ లాంటి) మేధావులు అన్నారు. ఇది వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానం పూర్తి అభివృద్ధి చెందని 'అర్ధ భూస్వామ్యం' అని చెపుతూ, పెట్టుబడిదారీ ధోరణులు కూడా అభివృద్ధి చెందుతున్నాయని విషయాన్ని చూడాలని ఆమె ప్రతిపాదించారు. ముఖ్యంగా హరిత విప్లవం అమలుకాబడిన పంజాబ్, హర్యానా, ఉత్తర యూ.పి, కోస్తాంధ్ర లాంటి ప్రాంతాలలో పెట్టుబడి సంబంధాలు సంపూర్ణంగా అభివృద్ధి అయ్యాయని చాలా మంది విశ్లేషకులు అభిప్రాయపడ్డారు (ఉత్సాపట్నాయక్, కెరోల్ ఉపాధ్యాయ, డేనియల్ థార్నర్, ఇతరులు). ఇదే విషయం లెనిన్ కూడా నోర్దోనిక్కులతో వాదిస్తూ 'రష్యాలో పెట్టుబడిదారీ విధానం - మార్క్స్ విమర్శకులు' పుస్తకంలో అప్పటి 1908 కాలం రష్యా గురించి రాస్తాడు. అర్ధ భూస్వామ్య నిర్ధారణకు నిర్దిష్టమైన సూత్రీకరణ నిజానికి అందుబాటులో లేదు. అది అసంపూర్ణమైన ప్రక్రియగా అర్థం చేసుకోవటం జరిగింది. బెంగాల్‌లో జోతెదార్‌లే వడ్డీ వ్యాపారస్తులై, వారి వద్ద ఉన్న కౌలు రైతులు వడ్డీ, కౌలు ఇచ్చిన తర్వాత మిగులు విలువను కోల్పోయి జరుగుబాటును మాత్రమే పునరుత్పత్తి చేసే వ్యవస్థని అర్ధ భూస్వామ్య మోడల్‌గా చిత్రీకరించాడు అమిత్‌బాదురీ. దీనిలో నుండి కౌలు రైతులకు కొత్త టెక్నాలజీ అమలు చేసే వెసులుబాటు

లేకుండా జోతెదార్‌లు అడ్డుపడతారని అభిప్రాయపడ్డాడు. ఈ చిత్రీకరణతో ఒక సమస్య దేశమంతా ఒకే విధంగా లేకపోవటం. అర్ధభూస్వామ్యాన్ని గానీ, పెట్టుబడి సంబంధాలను గానీ మారగలిగే ధోరణులుగా చూస్తే తప్ప, మార్పుని అర్థం చేసుకోవటం కష్టం. ఈ చర్చ ఆగిపోయి 40 ఏళ్ళు అయింది. దీని తదనంతరం వచ్చిన మార్పులపై ఎన్నో పుస్తకాలు వచ్చాయి. పున: సమీక్ష ఈ మధ్య కాలంలో మళ్ళీ మొదలయింది. విద్యాసాగర్ పుస్తకం ఈ నేపథ్యంలోదే. శ్రామిక వర్గం పూర్తిగా రాని వ్యవస్థలో, రైతు కూలీలను కలుపుకుంటూ రాజ్యాన్ని కూల్చి వేయడానికి పట్నాలను చుట్టుముట్టి మిలటరీ పంథాలో మిలటరీ శక్తితో విప్లవం తెచ్చుకొని సమాజం మార్చుకోగలిగితే పెట్టుబడి సంబంధాల చర్చే అనవసరం. ఇక పెట్టుబడిదారీ విధానం ఒచ్చిందన్న వాళ్ళకు కార్మికులను ఆర్గనైజ్ చేయడం ప్రధాన వ్యూహం, కర్తవ్యం.

భూస్వామ్య విధానం అంటేనూ, పెట్టుబడిదారీ విధానం అంటేనూ కార్ల్ మార్క్స్ ఒక నిర్వచనం ఇచ్చాడు. మొదటి దానిలో సరుకు ఉత్పత్తి ఉండదు, ఉన్నా, భూమి, శ్రమ అనేవి మారకపు విలువ ఉన్న సరుకుగా ఉండవు. భూమి మీద, శ్రమ మీద భూస్వాముల బలవంతమైన ఆధిపత్యం ఉంటుంది. భూస్వామ్య కౌలు కూడా విపరీతంగా ఉండి, సెర్ఫుకు తన నేల మీద పండించుకోవడానికి కూడా సమయం, వనరులు ఉండకుండా చేయడమే కాక, భూమికి కట్టిపడేసి స్వేచ్ఛలేని పరిస్థితిలో శ్రమను ప్రత్యక్షంగా దోపిడి చేస్తారు. ఇక పెట్టుబడిదారీ విధానంలో, ఉత్పత్తి, భూమి, శ్రమలు మూడి సరుకుగా మారడం, పూర్తిగా ద్రవ్య మారకం జరగడం సాధారణ సరుకు ఉత్పత్తిలో అన్ని సంబంధాలు భాగమై పోవడం ప్రధానమైన అంశాలు. కానీ శ్రామికుల స్వేచ్ఛ పెట్టుబడిదారీ విధానం ఇచ్చేది కాదు. అది రాజకీయ పోరాటంతో శ్రామికులు సాధించుకున్న హక్కు. అందుకే అమెరికాలో 150 ఏళ్ళు పెట్టుబడిదారీ విధానం నల్లజాతీయులను బానిసలుగా వాడుకోవడం భూస్వామ్యానికి ప్రతీక కాదు. సౌత్ కొరియా, సింగపూర్ లాంటి ఎన్నో దేశాల్లో నియంతృత్వాన్ని పెట్టుబడుదారులు పోషించారు. మరొక విషయం అన్ని దేశాల్లో పెట్టుబడిదారీ విధానం రూపంలో ఒకేలాగా ఉండదు. ఆయా రాజకీయ, ఆర్థిక, చారిత్రక, నైసర్గిక పరిస్థితులకి అనుగుణంగా రూపొందుతుంది. కానీ 'మిగులు శ్రమని' అంతర్లీనం చేసుకోవడంలో సారంలో మార్పు ఉండదు. అందువల్ల బ్రిటన్‌లో వచ్చిన పెట్టుబడిదారీ రూపం అదే తరహాలో అన్ని చోట్ల వచ్చే అవకాశం లేదు. దీనిని సారంలో తేడాగా చాలా మంది పొరపాటు పడతారు.

ఇక 'అర్ధభూస్వామ్యం' ఒక అసంపూర్ణమైన, అస్పష్టమైన వివరణ. పెట్టుబడిదారీ సంబంధాలున్నా తగు పాళ్ళలో లేదనడం, కుల వ్యవస్థ ఉండడం, చిన్న కమతాలుండడం, జీతగాళ్ళ వ్యవస్థ, భూస్వాములు లేకుండానే భూస్వామ్యం ఉందనడం, పెట్టుబడిదారీ విధానం లేకుండా పెట్టుబడి ఉందనడం ఉదాహరణలు. నిజానికి ఇవి ఉత్పత్తి శక్తులను, ఉత్పత్తి సంబంధాలకు అడ్డంకిగా మారిన నిరూపితమైన ఆధారం ఇంత వరకూ ఏ అధ్యయనాలు చూపలేకపోయాయి. లోతైన చర్చ కూడా జరగలేదని చెప్పాలి. ఇంకొక విషయం, తెలుగులో ఫ్యూడలిజానికీ, లాండ్ లార్డిజానికి ఒకటే పదం 'భూస్వామ్యం'. కానీ అవి రెండు వేరు వేరు విషయాలు, కానీ ఒకటే పదం వాడడం వల్ల గందరగోళం అయింది. ఒక గ్రామంలో ఒక పెద్ద రైతు గూండాయిజం చేస్తే, దాన్ని భూస్వామ్యం అనడం కాజాలదు. పట్టణ ప్రాంతాల్లో పారిశ్రామికవేత్తలు కూడా గూండాయిజం, హత్యలు చేయిస్తారు. అది ఎట్లాగయితే ఫ్యూడలిజంతో సంబంధంలేని ఒక అప్రజాస్వామిక చర్యో అదీ అంతే కానీ అన్నీ హింసలు ఫ్యూడలిజం కావు.

మార్క్సిజం ప్రకారం పెట్టుబడిదారీ విధానానికి ప్రామాణికం ఉత్పత్తి, భూమి (వనరులు), శ్రమ సరుకుగా మారి డబ్బు రూపంలో మారకపు విలువ మార్కెటు వ్యవస్థలో చలామణి కావడం. కానీ రవి ప్రకారం వ్యవసాయంలో పెట్టుబడిదారీ విధానానికి ప్రధాన చిహ్నం భూమి కేంద్రీకరణ మాత్రమే. మార్క్స్ ప్రకారం పెట్టుబడి కేంద్రీకరణ పరిస్థితుల ఫలితంగా జరిగే పరిణామమే, కానీ ఫండమెంటల్ కండిషన్ కాదు. అది లోపలి నుండి వికేంద్రీకృత పోటీ రంగాలదాకా విస్తరించి ఉంటుంది. ఇక భూమి విషయానికొస్తే బ్రిటన్‌లో భూకమతాల కేంద్రీకరణ 16వ శతాబ్దంలో పెట్టుబడిదారీ విధానం వ్యవసాయంలో ప్రవేశించక ముందే ఎన్‌క్లోజర్స్ ద్వారా జరిగిన ప్రిమిటివ్ ఎక్యుములేషన్. అది భూమిని ఒక పెట్టుబడిగా మార్చిన ప్రక్రియ. అలాగే చిన్న రైతులను బేదఖలు చేసి శ్రామికులుగా మార్చిన వైనం. ఇది ఏదో మేరకు అన్ని పెట్టుబడిదారీ సమాజాల్లో జరిగేదే. కానీ అన్ని దేశాల్లో ఒకే లాగా జరగలేదు. చిన్న రైతులు బేదఖలు బ్రిటన్, జర్మనీలలో మాత్రమే జరిగింది. కానీ ఫ్రాన్స్, ఇటలీ, రష్యా దక్షిణ యూరపు, తూర్పు యూరపు, స్కాండినేవియన్ దేశాల్లో ప్రపంచ పెట్టుబడిదారీ విధానం రూపుదిద్దుకుంటున్న 18-19వ శతాబ్దంలో కూడా జరగలేదు. ఫ్రెంచ్ విప్లవంలో చిన్న రైతులను భాగస్వాములు చేసుకున్న బూర్జువా వర్గం చిన్న కమతాలు రక్షణ చట్టాలను తేవాల్సి వచ్చింది. పెట్టుబదిదారీ విధానంలో సంక్షోభానికి గురయి కూడా ఫ్రాన్స్‌లో చిన్న రైతాంగం వ్యవసాయం వీడలేదు. లెనిన్ 'రష్యాలో పెట్టుబడిదారీ విధానం పుస్తకం'లో అమెరికాలో చిన్న కమతాల ఉదాహరణలు చూపిస్తూ కమతాల సైజు ఆధారంగా పెట్టుబడిదారీ సంబంధాలని నిర్ణయించడం సరికాదని వాదిస్తాడు. ఇక సైజు ఆధారంగా విశ్లేషించాలంటే ప్రపంచంలో ఒక ఐదు-ఆరు దేశాలకు మినహాయిస్తే, భూకమతాల కేంద్రీకరణ 20వ శతాబ్దం నుండి మెజారిటీ దేశాల్లో ఎక్కడా జరగలేదన్నది చారిత్రక వాస్తవం. అమెరికా, కెనడా, బ్రెజిల్, ఆస్ట్రేలియాలలో తప్ప భూకమతాల సైజు 5 హెక్టార్లకు మించి ఎక్కడా పెరగలేదు. ఆ దేశాలు కూడా సహజమైన పరిణామాలకు భిన్నంగా మూలవాసుల్ని పూర్తిగా అంతం చేసి, పెద్ద పెద్ద భూ ఖండాలను ఆక్రమించడం ద్వారా జరిగిన పరిణామం. అమెరికాలో ఈ రోజు 200-300 ఎకరాల వాళ్ళు చిన్న రైతులుగా పిలువబడతారు. వాళ్ళూ తీవ్రమైన సంక్షోభంలో కూడా బతకడానికి నిరంతర పోరాటం చేస్తూనే ఉన్నారు. 19వ శతాబ్దం నుండి యూరోపియన్ దేశాలు అసలు వ్యవసాయోత్పత్తుల్ని తయారు చేసుకోవడం మానేసి కాలనీల నుండి తక్కువ ధరలకు దిగుమతి చేసుకోవడం చేసారు. దీనితో వారి దేశాల్లో వ్యవసాయ ప్రాముఖ్యత క్షీణించింది. వారి రైతాంగం 'కొత్త ప్రపంచానికి' వలస వెళ్ళే పరిస్థితిలో సంస్థాగత మార్పు జరిగింది (టి.జె.బైర్స్, బర్న్‌స్టైన్ రచనలు చూడచ్చు). ఇక గత యాభై ఏళ్ళలో జపాన్‌లో, సౌత్ కొరియాలో, తాయివాన్‌లో అమెరికా రెండవ ప్రపంచ యుద్ధానంతరం మార్షల్ ప్లాన్‌లో భాగంగా భూసంస్కరణలు అమలు చేసి చిన్న కమతాలు వ్యవసాయాన్ని పెట్టుబడిదారీ విధానంతో అనుసంధానం చేసింది. ఇక్కడ ఇప్పటికే చిన్న కమతాలే ఉన్నాయి. దీనికి ఒక కారణం ఉంది. అది ఏంటంటే చిన్న సరుకు ఉత్పత్తి దారులు తమ కుటుంబ శ్రమను వాడి శ్రమ ఖర్చును తగ్గించి పెద్ద పెట్టుబడిదారులను పోటీలో నిరంతరం

సవాలు చేస్తూ, ఖాళీ కడుపులుంచుకొనో, తమ శ్రమ అధికంగా వెచ్చించి దానికి విలువ కట్టకుండా మార్కెటు ధర ఎంత తక్కువైనా ఉత్పత్తి చేయడానికి సిద్ధంగా ఉండడం. ఇది 19వ శతాబ్దంలో జర్మనీలో, రష్యాలో కూడా ఉండడాన్ని మార్క్స్, ఎంగెల్స్, కౌట్స్కీ, లెనిన్‌లు విపులంగా వివరించారు. అయితే, యూరపు దేశాల గ్రామీణ ప్రాంతాల నుండి అమెరికా, కెనడా, ఆస్ట్రేలియా దేశాలకు విపరీతంగా వలస వెళ్ళటం ద్వారా చాలా మంది చిన్న సరుకు ఉత్పత్తి దారులు ప్రత్యామ్నాయం దొరకబుచ్చుకుని వ్యవసాయం వదిలివెళ్ళారు. ఇది 20, 21వ శతాబ్దంలో ఏ వలసానంతర దేశాలకు అందుబాటులో లేని పరిస్థితి. ఇరవయ్యవ శతాబ్దపు తీవ్రమైన యాంత్రీకరణ వల్ల పారిశ్రామిక రంగం కార్మికులని పెద్ద ఎత్తున ఇముడ్చుకోలేదు. అందువల్ల వ్యవసాయాన్నే అంటిపెట్టుకొని ఉండాల్సిన పరిస్థితి. పెట్టుబడి సంబంధాలు పెరగక కాదు.

వ్యవసాయంలో మన రాష్ట్రంలో స్థూల పెట్టుబడి 30 ఏళ్ళలో 7 శాతం నుండి 20 శాతానికి పెరిగింది. ఇందులో ఈ రోజు 90 శాతం ప్రైవేటు పెట్టుబడే. వ్యవసాయం నుంచి ఉత్పత్తి అయిన మిగులు వ్యవసాయేతర రంగాలకి తరలి పోవడం పెట్టుబడిదారీ అభివృద్ధిలో ఒక వ్యూహం. వ్యవసాయంలో మిగులు ఉత్పత్తి జరిగిందన్నది అసలు విషయం కానీ అది అక్కడే ఇన్వెస్ట్ కాబడాలని కొన్ని తప్పుడు వాదనలు ఉన్నాయి. భూ పరిమితి చట్టాలు వచ్చిన తర్వాత భూకేంద్రీకరణ బహిరంగంగా జరగడం అసాధ్యం. లోపాయికారిగా కొంత జరగచ్చు. దానిలో ఉండే రిస్క్ వల్ల ఈ ప్రక్రియ ఆగిపోయిందని చెప్పాలి. దరిమిలా సగటు కమతం సైజు తగ్గుతూ చిన్న కమతాల సంఖ్య సహజంగానే పెరుగుతూ వచ్చింది. సేవా రంగాలకు, పారిశ్రామిక రంగాలకు దీనివల్ల లాభమే కానీ నష్టం లేదు. ఎందుకంటే ఒళ్ళు హూనం చేసుకొని పండ్లు, కూరగాయలు, ధాన్యాలు, మాంసం, పాలు అతి చవకగా ఉత్పత్తి చేసి వాళ్ళేమి తినక పట్టణాలకు తరలిస్తారు. లాభాల వేటలో రైతులు చేయని ప్రయత్నం లేదు. ఈ విషయాలనే పుస్తకంలో విద్యాసాగర్ చెప్పడానికి ప్రయత్నించాడు. ఈ నేపథ్యంలో గ్రామాలు స్వయంప్రతిపత్తి కోల్పోయి పట్టణాల మీద ఆధారపడ్డ అనుబంధాలుగా మారడం అనేది జరుగుతోంది. ఇది పెట్టుబడిదారీ విధానం వేళ్ళూనురుకొనే నేపథ్యంలో జరిగే పరిణామం మాత్రమే. పెటీ కమోడిటీ ఉత్పత్తి పెట్టుబడిదారీ ఉత్పత్తితో నిలదొక్కుకోవడానికి నిత్య ప్రయత్నం చేస్తోంది. ఇది ఒక భారతదేశంలోనే కాక ఇతర ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికన్ దేశాలలో కూడా ఈ ప్రక్రియను చూడచ్చు. ఈ రోజు వ్యవసాయం మార్పులను కేవలం జాతీయ మార్కెట్టు స్థాయిలో కాక అంతర్జాతీయ స్థాయిలో మార్కెట్‌తో అనుసంధానం చేయబడుతోంది. దీనికి కావలసినంత ఆధారం ఉంది. యూరప్‌లో జరిగిన పెట్టుబడిదారీ మార్పుల లాగే వర్ధమాన దేశాల్లో పెట్టుబడిదారీ విధానం రూపంలో కాక అదనపు విలువని, సంపదని పోగుచేసే సారంలో పూర్తి సారూప్యత కలిగి ఉంటోంది.

ఆర్థిక వ్యవస్థలో ఒక భాగమైన వ్యవసాయం మిగతా రంగాలకు అతీతంగా ఉండడం జరగని పని. మన దేశంలో పారిశ్రామికాభివృద్ధి జరగట్లేదని, పారిశ్రామిక కార్మికులు లేరనే వాదన సత్యదూరం. ఊహించిన స్థాయిలో లేకపోవచ్చు. సేవా రంగం అత్యధిక శాతంగా ఉండడం 20వ శతాబ్దపు పెట్టుబడిదారీ విధానంలో సార్వజనీన లక్షణం. చైనాలో కూడా పారిశ్రామిక కార్మికుల శాతం 42 శాతానికి మించలేదు. మన దేశంలో 19 శాతంగా ఉంది. భవిష్యత్తులో ఇంకా పెరిగే అవకాశం లేకపోలేదు. అయితే ఈ పారిశ్రామిక అభివృద్ధి కూడా పెట్టుబడిదారీ విధానం కాదని, ఇక్కడి పారిశ్రామిక వేత్తలు సామ్రాజ్యవాదుల పెట్టుబడికి ఏజెంట్లు మాత్రమేనని వారు కంప్రాడార్ పెట్టుబడిదారులని చేసే 60 ఏళ్ళ కిందటి నిర్ధారణని ఈనాటికీ కొనసాగించడం అధ్యయనం చేయకుండా చేసే ఒక లేజీ ఆర్గ్యుమెంట్. దానికి ఆనాడు ఉన్న భూమిక ఏమిటంటే భారత్ లాంటి దేశాల్లో పేద దేశాలుగానే ఉండిపోయి పారిశ్రామికీకరణ వేగవంతంగా జరగకపోవడం, ఇంకా భారత దేశ స్థూల ఉత్పత్తి 3.5 శాతానికి మించి పెరగకపోవడం కాంప్రాడార్‌లు చాలా లాభాన్ని అంతర్జాతీయ గుత్త పెట్టుబడిదారులకు టెక్నాలజీ కోసం రాయల్టీలుగా సమర్పించుకొని తక్కువ లాభాలతో సంతృప్తిపడి దళారీలుగా మిగిలిపోవడం. సిద్ధాంతరీత్యా ఇది 1930లో చైనాలోని పరిస్థితులపై మావో చేసిన సమీక్ష. దీన్ని మక్కీకి మక్కి కాపీ చేసి భారత దేశానికి అర్ధశతాబ్దం తరువాత 30 ఏళ్ళుగా వినిపించడం వాస్తవ పరిస్థితులను చూడకుండా చేసే నిర్ధారణే. టెక్నాలజీ సామర్థ్యం ద్వారా క్యాపిటలిజం స్వభావం నిర్ణయించడంపై ప్రపంచంలో ఎక్కడా ఆమోదం లేదు. ఏ రూపంలో ఉన్నా క్యాపిటలిజం మౌలిక స్వభావం కార్మికుల శ్రమని దోపిడీ చేయడమే. మెట్రోపాలిటన్-పెరిఫరి దేశాలలో ఉన్న పెట్టుబడి గ్లోబలైజేషన్ నేపథ్యంలో ప్రపంచ పెట్టుబడిగా మారి తన సంక్షోభాన్ని అధిగమించే వ్యూహంలో పునరుద్ధానం చెందింది. ఇకజాతీయ పెట్టుబడికి హేతుబద్ధత లేదు, మిలాఖత్‌లోనే లాభముంది. 21వ శతాబ్దంలో పెట్టుబడి విధానం విస్తరించే తీరు 18వ శతాబ్దంలో ఉండేలాగా అవకాశం ఉండదు. 18వ శతాబ్దపు పెట్టుబడిదారీ మోడల్‌ని మాత్రమే ఊహించుకొని, జరుగుతున్న దానిని తృణీకరించడం మెథడోలాజికల్ పొరపాటు.

రవిగారు కూడా 'గిడసబారిన' భారతదేశ అభివృద్ధిగా తన సమీక్షలో పేర్కొన్నారు. దీని కారణంగా వ్యవసాయంలో చాలా మంది ఉండిపోయారన్న విషయం. ఇది ఎంపిరికల్‌గా సరైంది కాదు. వ్యవసాయ ఆధారిత కార్మికులు 1960లో 76 శాతం నుండి 2013లో 46 శాతానికి పడిపోవడమే కాక, వలసరేటు గణనీయంగా పెరుగుతోంది. 2001-11లో భారత దేశంలో 2వ శ్రేణి నగరాలు వేగవంతంగా విస్తరించడానికి కారణం వ్యవసాయేతర రంగం వృద్ధి చెందడమే. భారత దేశ స్థూల ఉత్పత్తి విషయానికొస్తే, 1976-2004 దాకా 5.8 శాతం రేటున పెరిగి తర్వాత కాలంలో 2004-2010 మధ్య 9 శాతానికి ఎగబాకి, గ్లోబల్ రిసెషన్ పరిస్థితుల్లో కూడా 6.5 శాతం అభివృద్ధి నమోదు చేసుకుంది. ఈ రోజుకీ ప్రపంచంలో వేగంగా అభివృద్ధి చెందుతున్న దేశాలలో రెండవ దేశంగా, దరిమిల అత్యంత ఎక్కువగా ప్రపంచ పెట్టుబడిని ఆకర్షిస్తున్న రెండవ దేశంగా ప్రపంచ బ్యాంకే అంగీకరించిన పరిస్థితిలో దీన్ని రవిగారు 'గిడసబారిన' అభివృద్ధిగా వర్ణించడం సత్యదూరం అవుతుంది. అభివృద్ధి ఫలాలు అందరికి దక్కుతున్నాయని ఎవరూ అనడం లేదు. నిస్సందేహంగా ఈ అభివృద్ధి ఫలాలు దేశంలోని పై పది శాతం, కొద్ది మంది పెట్టుబడిదారులు, విదేశీ పెట్టుబడిదారులు విపరీతంగా పెరిగిన సంపదను హాయిగా అనుభవిస్తున్నారు. ఇంతటి సంపద, ఉత్పత్తి ఏ అర్ధ భూస్వామ్య-కాంప్రాడార్ పునాదుల మీద నిలవడం అసాధ్యం, చరిత్రలో ఎక్కడా జరగని విషయం. ఇక్కడ కావలసిన క్యాపిటలిస్టు పునాదులు దాని ద్వారా శ్రామికుల శ్రమ దోపిడి ద్వారా మాత్రమే

మిగులు విలువను ఉత్పత్తి చేయడం సాధ్యం. ప్రపంచంలో మొదటి 500 వందల మంది బిలియనీర్లలో 25 శాతం మంది భారతీయులు ఉండడం ఇక్కడ జరుగుతున్న పెట్టుబడిదారీ విధానానికి, దాని దోపిడికి ఒక ఉదాహరణ. టాటా బ్రిటన్‌లోని జాగ్వర్ కార్ కంపెనీని కొనివేయటం GMR, GVK, INFOSIS, WIPRO, Dr.Reddy's, Ranbaxy లాంటి ఎన్నో ఇండియన్ MNC'sలో అంతర్జాతీయ పెట్టుబడి విపణిలో ప్రవేశించడం చూస్తే భారతీయ పెట్టుబడి ఎంతగా వేళ్ళూనుకుందో అర్థమవుతుంది. పెద్ద పెద్ద ఖత్రీనరీలే కాక రాష్ట్ర స్థాయిలో, జాతీయ స్థాయిలో గత 30 ఏళ్ళుగా పెరిగిన పెట్టుబడి గురించి హరీష్ దామోదరన్ రాసిన న్యూ క్యాపిటలిస్ట్ ఆఫ్ ఇండియా పుస్తకం కళ్ళు తెరిపించే సమాచారం.

రవి ప్రస్తావించిన మూడవ అంశం పుస్తకంలోని గణాంకాలకు సంబంధించినది. ఇక్కడ రవి 9వ పట్టికలో (148వ పేజి) లేవనెత్తిన సందేహంలో కాస్త నిజముంది. అది చిన్న పొరపాటు. 2001 నుండి 2011 భారత దేశంలోని రైతుల సంఖ్య 12.73 కోట్ల నుండి 9.58 కోట్లకు పడిపోవడం చూపిన గణాంకం కరెక్టే, కానీ వ్యవసాయ కార్మికుల మొత్తంలో రైతుల, కూలీల భాగం 26.4 శాతంగా, 23.71 శాతంగా తప్పుగా అచ్చు అయింది. కానీ సంఖ్య రీత్యా పట్టికలో పొరపాటు లేదు. ఇక రవిగారు సందేహించిన శ్రీకాకుళం జిల్లాలో మొత్తం శ్రామికుల సంఖ్యలో రైతుల భాగం 18 శాతానికి పడిపోవడం, కూలీల భాగం 48.32 శాతానికి పడిపోవడంలో ఏమీ పొరపాటు లేదు. దేశంలోనే మొదటిసారి 2.45 కోట్ల రైతులు, పది కోట్ల మంది కూలీలు 2001-2011 దశాబ్దకాలంలో వ్యవసాయాన్ని వదిలేయడం ఆర్థిక శాస్త్రవేత్తలను సైతం ఆశ్చర్యపరుస్తున్న విషయం. 51 శాతం కార్మికులు వ్యవసాయేతర రంగంపై ఆధారపడుతున్నారు. ఇందులో 12 శాతం భవన కార్మికులుగా, 16 శాతం పారిశ్రామిక వాడల్లో, 25 శాతం సేవా రంగంలో పనిచేసే కార్మికులు. ఇక శ్రీకాకుళం, ఉత్తరాంధ్ర విషయానికొస్తే అక్కడి పరిస్థితి తెలిసిన వారికి రైతు భాగం ఇంతగా పడిపోవడంలో ఆశ్చర్యం కలిగించేది కాదు. శ్రీకాకుళం జిల్లా రైతు కూలీలు ఒరిస్సా నుండి విశాఖ - మద్రాసు హైదరాబాదు నగరాల దాకా వలసలు వెళ్ళడం అందరికీ తెలిసిందే, భవన కార్మికులుగా, రిక్షా కార్మికులుగా కోస్తా వ్యవసాయంలో మండీలలో, కోల్డ్ స్టోరేజీలలో, భవన నిర్మాణాలలో, చేపల చెరువుల్లో కార్మికులుగా పని చేసే వాళ్ళందరులో సింహ భాగం శ్రీకాకుళం, విజయనగరం, విశాఖ జిల్లాలకు చెందిన వారే. ఇక 18 శాతానికి శ్రీకాకుళం రైతాంగం పడిపోవడం అభివృద్ధికి చిహ్నం అని రచయిత చేసిన వ్యంగ్యమయిన వ్యాఖ్యను రవిగారు అపార్థం చేసుకున్నారు. పెట్టుబడిదారీ అభివృద్ధి ఎప్పుడు స్వర్గమో-నరకమో తెలియని డోలాయమాయమైనదిగా ఉంటుంది. 18 శాతానికి పడిపోవడం పెట్టుబడిదారీ విధానంలో చిన్న సరుకు ఉత్పత్తిదారుల సంక్షోభానికి ఒక సంకేతం, మరలాగే వారిని వలస కూలీలుగా మార్చి పట్టణాల బాట పట్టించే పరివర్తనకు కూడా పెట్టుబడిదారీ సంబంధానికి సంకేతమే. కార్మికులను ఆర్గనైజ్ చేసి పెట్టుబడిదారీ వ్యవస్థలో ఉన్న వైరుధ్యాన్ని తీవ్రతరం చేయమన్నాడు కార్ల్‌మార్క్స్. నిజానికి యూరప్‌లో ఏ హక్కులు లేని 19వ శతాబ్ది తొలి దశలో లాగా భారతీయ కార్మిక వర్గం ఏ హక్కులూ లేని అసంఘటిత రంగంలోకి ప్రవేశించడం కార్మిక ఉద్యమం ముందున్న అతి పెద్ద సవాల్. వీరి సంఖ్య భారత దేశంలో దాదాపు 25 కోట్లు! వామపక్ష పార్టీలందరినీ కలిపినా వీరిని ఆర్గనైజ్ చేయడానికి కావల్సిన బలంలో ఒక శాతం బలం కూడా లేనిది ప్రస్తుత పరిస్థితి. మరొక విషయం ఏమిటంటే వ్యవసాయంలోని మిగులు శ్రామికులను ఉపాధి కల్పించే సత్తా సమకాలీన పెట్టుబడిదారీ విధానానికి లేదు. విపరీతమైన యాంత్రీకరణ చెందిన యుగంలో పెట్టుబడిదారీ విధానం నిరుద్యోగులను తయారు చేస్తుంది. అయినా వారానికి రెండు రోజులైనా పని దొరుకుతుందేమో నన్న ఆశతో గ్రామీణ పేదలు పట్టణ బాటపడుతున్నారు. ప్రభుత్వం ఇస్తున్న ధాన్య పంపిణీ వల్ల కావచ్చు, NREGA వల్లనో వలసల వల్లనూ, శ్రామికుల సప్లై తగ్గ గత దశాబ్దంపైన కూలీరేట్లు పెరిగాయి. దరిమిలా ట్రాక్టర్లు, హార్వెస్టర్లు, ఇబ్బడి ముబ్బడిగా పెరిగాయి. వీటివల్ల లేబరు ఖర్చు గణనీయంగా తగ్గి, చిన్న రైతులు కూడా వ్యవసాయంలో ఇంకా నిలుచునే వెసులుబాటు రావడం జరిగింది. పెద్ద రైతులు, మధ్య రైతులు లాభసాటి వ్యవసాయం చేసుకుంటూనే ఉన్నారు. యాంత్రీకరణ వల్ల ఖర్చు తగ్గించుకోవడం, లాభాలను పెంచుకోవడం కోసమే. కానీ లాభాలు నిరంతర పోటీలో తీవ్ర ఆటుపోట్లకు గురి కావడం క్షీణించడం సహజ పరిణామాలు. ఈ వ్యాసం రాసే క్రమంలో ఈ వారమే పత్తిని కోసే యంత్రాలను వ్యవసాయ మంత్రి గుంటూరు ఆవిష్కరించిన వార్త చూసాను. వచ్చే 5 ఏళ్ళలో పత్తి పంటలో కూడా రెండు నెలల కూలీ అదృశ్యం అవుతుందని అర్థమవుతుంది. ఇది పెట్టుబడిదారీ వాస్తవం.

ఇప్పటికీ బోరు బావులు ఫెయిల్ అయి అప్పులో కూరుకుపోయి, అంచనాకు మించి కౌలుకు తీసుకున్న పత్తి రైతులు ఆత్మహత్యలు చేసుకోవడం అందరికి తెలిసిందే. ఆత్మహత్యలు ఆగాలంటూ నినాదాలు చేసే ఉద్యమకారులకి సైతం ఎవరికి వ్యతిరేకంగా ఉద్యమించాలో తెలీని చిత్రమైన పరిస్థితి. తెలంగాణలో ఆంధ్ర పాలకులను కాసేపు నిందించారు, నయా ఉదారవాద విధానాలను నిందించారు. ఎక్స్‌గ్రేషియాలు ఇవ్వాలనీ పెంచాలని ప్రభుత్వాలను డిమాండ్ చేశారు. కానీ ఆత్మహత్యలకు పరిష్కారం ఎవ్వరూ చెప్పలేకపోయారు. ఎందుకంటే అందరూ కళ్ళముందు పెరిగిన పెట్టుబడి వ్యవస్థను చూడకపోవడం. చిన్న కమతాలన్నీ పెట్టి సరుకు ఉత్పత్తిదారులను మార్కెట్లు ధరలను ఖర్చులకి అనుగుణంగా పెంచకుండా బిగదీస్తాయన్న విషయం ఎవ్వరికీ అర్థం అవడం లేదు. మార్కెట్లను నియంత్రించడం అనేది జాతీయ స్థాయిలో చెయ్యగలగాలి. ప్రత్యామ్నాయంగా లేకపోతే రైతులను కోఆపరేటివ్స్‌గా ఆర్గనైజ్ చేయాలి. అప్పుడు సమిష్టి కృషి వల్ల రైతులు ఖర్చును ఆదా చేసుకుని, ధరలను పడిపోకుండా బార్గెన్ చేసుకుని కొన్నాళ్ళు మనగలుగుతారు. అది కూడా దీర్ఘకాలంలో నష్టాలను చవిచూడవచ్చు. అంతిమంగా భూమిని జాతీయం చేసి, స్థూల ఉత్పత్తి నుండి రైతులకు కూలీలకు వారి భాగం పంచి ఇవ్వడం చివరి పరిష్కారం. ఈ పుస్తకంలో రచయిత చేసిన వాదన దిశ ఇది. దీన్ని రవిగారు పూర్తిగా అర్థం చేసుకోలేకపోయారు. 70 శాతం గ్రామీణ ప్రాంతంలో ఇప్పటికే ఎంతో కొంత భూమి దొరకడం జరిగింది. వీరికింద 65 శాతం సేద్యం జరుగుతోంది. వీళ్ళని కోఆపరేటివ్స్‌గా ఆర్గనైజ్ చేయాల్సిన క్లిష్ట దశకు మనం చేరుకున్నాం. కానీ ఈ దిశగా ఆలోచన అనేది ప్రారంభం కాకపోవడం ఒక దురదృష్టం.

ఈ సంక్షోభాన్ని భరించలేక రైతులు భూమిని తెగనమ్ముకుంటు న్నారు. భూసేకరణ విషయంలో పక్కనపెడితే, అత్యధికమైన ప్రాంతాల్లో భూసేకరణకు సరైన ధర ఇవ్వట్లేదని రైతులు నిరసిస్తున్నారే కానీ మేము అస్సలు ఇవ్వం అని చెప్పట్లేదన్నది వాస్తవం. సెజ్‌లకు వ్యతిరేకంగా

జరిగిన పోరాటాలు చాలా మటుకు విఫలం అవడానికి కారణం మధ్య తరగతి రైతులు భూమిని అమ్మడానికి ముందుండడం, దరిమిలా ఉద్యమాలు నీరుకారడమే కాక, మిగతా రైతులు కూడా అమ్మడానికి సిద్ధపడటం జరిగింది. ఇక నష్టపరిహారం రాని అసైండ్ ల్యాండ్ రైతులు పోరంబోకు భూమి మీద పరోక్షంగా ఆధారపడ్డ వాళ్ళు, స్త్రీలు, మత్స్యకారులు పోరాడారు. మెదక్, మహబూబ్‌నగర్, అనంతపురం, నెల్లూరు, చిత్తూరు, కాకినాడల్లో రైతులు భూమి అమ్మడానికి వెనకాడలేదు. వాళ్ళందరూ తరువాత బాగుపడ్డారా, నాశనమయ్యారా వేరే సంగతి. కానీ భూములు అమ్మడానికి మంచి ధర వస్తే అమ్మడానికి వెనకాడని పరిస్థితి. ఎందుకంటే టౌనులో ఆ డబ్బును ఎక్కడ ఇన్వెస్టు చేస్తే ఎక్కువ లాభం వస్తుందన్న నమ్మకం, వాస్తవం. ఇదే ఈ విధానానికున్న హెజిమోనీ, అంటే 'అంగీకరించిన ఆధిపత్యం' (Dominance with consent). అందులో వాళ్ళకు మెరుగులు పడే అవకాశం చూడడం. క్యాపిటలిజం నిజానికి విస్తరించే తీరే అంత. అది కొత్త సరుకులను తెస్తుంది. ఉత్పత్తి శక్తులను అభివృద్ధి చేస్తుంది. ఉత్పత్తి సంబంధాలను మార్చేస్తుంది. దాన్ని కూల్చి ఇంకా మెరుగైన సమాజాన్ని అందిస్తామనే వాళ్ళ మీద ప్రజలు అంత త్వరగా నమ్మకాన్ని పెట్టరు. ప్రజలు పెట్టుబడిదారీ వ్యవస్థను సమర్థించే బూర్జువా వర్గాన్నే నమ్ముకుంటుంది. ఇది చరిత్ర. భూస్వామ్య శక్తులను నెమ్మది నెమ్మదిగా పక్కకు నెట్టి ఆధిపత్యంలోకి రావడమే శాంతియుత బూర్జువా విప్లవం. జమీందారీ నిర్మూలన నుండి మొదలుకొని, అనేక రాయితీలు, రక్షణలు పొందుతూ నగరీకరణ కేంద్రంగా జరిగిన అభివృద్ధిలో బూర్జువా పెట్టుబడిదారుల అభివృద్ధి 60 ఏళ్ళుగా భారతదేశంలో నిస్సంకోచంగా అయింది (పార్థా చటర్జీని చదవండి). మన దేశంలో ఈ ప్రక్రియకు వామపక్షాలను బూర్జువా వర్గం బాగా వాడుకుంది. భూపోరాటాలు, భూపంపకాలు అందులో భాగమే. నక్సలైట్లు గ్రామాల్లోని అర్ధ భూస్వామ్యం నుండి కింది వర్గాలను విముక్తుల్ని చేసారు. తెలంగాణలో అప్‌స్టేటస్‌లోకి వచ్చిన చిన్న రైతాంగం మార్కెట్ జాలంలో బిగుస్తున్నారు. ధనిక రైతులు, పౌల్ట్రీలు, సీడ్ బిజినెస్‌లు, యంత్రాలు, అనుబంధ వ్యాపారాలు కొనుక్కొని లాభసాటి వ్యాపారం చేసుకుంటున్నారు. చిన్న రైతులకు వెసులుబాటు లేక ఇరుక్కుంటున్నారు.

ముగింపు : వ్యవసాయంలో మార్పుల గురించి వచ్చిన పుస్తకాలని సమకాలీన అధ్యయనాలతో, సమాచారంతో సాపేక్షంగా చదవడం అవసరం. రాష్ట్రంలో జరిగిన మౌలికమైన మార్పుల గురించి డి.నర్సింహారెడ్డి, జి.నిరంజనరావ్ ఎడిట్ చేసిన 'రూరల్ ట్రాన్స్‌ఫార్మేషన్స్' పుస్తకంలో కానీ వి.కె.రామచంద్రన్ ప్రభృతులు రాసిన 'సోషియో ఎకనామిక్ సర్వే ఆఫ్ త్రీ విలేజెస్ ఇన్ ఆంధ్రప్రదేశ్' పుస్తకంలో కానీ పల్లెను మింగిన పెట్టుబడి పుస్తకానికి మించిన వివరాలు అందుబాటులో ఉన్నాయి. ఇతర రాష్ట్రాల్లో పరిస్థితులను విశ్లేషించిన సురేందర్ జోద్‌కా, గుజరాత్‌పై 20 ఏళ్ళుగా రాస్తున్న యాన్ బ్రిమెన్ లాంటి మేధావులు పెట్టుబడిదారీ సంబంధాలపై ఈ విశ్లేషణే చేస్తూ వచ్చారు. తమిళనాడులో ఈ మార్పులు మరింత వేగవంతంగా జరుగుతున్నాయి. అత్యంత వెనుకబడిన ప్రాంతమైన శ్రీకాకుళంలో జరిగిన మార్పులు విద్యాసాగర్ విశ్లేషించడం అభివృద్ధి చెందిన ప్రాంతాల్లో ఇంకెంత జరిగి ఉంటుందో చెప్పడానికి పరోక్ష ఉదాహరణ. అర్ధ భూస్వామ్యాన్ని నిరంతరం కొనసాగే అంతులేని ప్రక్రియగా నిర్వచించడం అశాస్త్రీయం. వ్యవసాయంలో పెట్టుబడిదారీ సంబంధాలు వచ్చాయా లేక ఏ మేరకు వచ్చాయన్నది కేవలం పండిత చర్చ కాదు అని రవి గారు హెచ్చరించారు. కరెక్టే. మార్క్స్ కూడా ప్రపంచాన్ని ఇంత వరకు తాత్త్వికులు ఎంతో మంది విశ్లేషించారు, కానీ చేయాల్సింది ప్రపంచాన్ని మార్చడం అన్నాడు. అయితే అది తాత్త్వికుల విశ్లేషణకు అనుగుణంగానా, అతీతంగానా అన్నది ప్రశ్న. విప్లవకారులు వాస్తవాలను అధ్యయనం చేయకుండా జరిగిన మార్పుని సైద్ధాంతీకరించకుండా ప్రపంచాన్ని మార్చడం సాధ్యమా? గత 40 ఏళ్ళుగా సమాజంలో వచ్చిన మార్పులేమిటి? ప్రపంచీకరణ తర్వాత వచ్చిన మార్పులేమిటి? ఈ ప్రశ్నలకు ఉష్ట్ర పక్షి ఇసుక తుపాను ఎదుర్కొనే ధోరణి కాకుండా విస్తృతంగానూ విషయాలను చర్చిస్తే రాష్ట్రంలో మేధోపరమైన చర్చ ముందుకు వెళ్ళే ఆస్కారం ఉంటుంది.



చర్చ

# పల్లెను మింగిన పెట్టుబడి

- వి.వి.రెడ్డి

ఈ పుస్తక రచయిత ఎస్.ఎ.విద్యాసాగర్. పుస్తకం పేరు దాని వస్తువుకు తగినట్టుగానే ఉంది. అరుణతారలో (జనవరి 2015) రవి ఈ పుస్తకాన్ని సమీక్షించారు. ప్రస్తుత సమీక్ష దానికి అదనం.

ఫ్యూడల్ వ్యవస్థలో వ్యవసాయం ప్రధాన ఉత్పత్తిరంగం. పెట్టుబడిదారీ వ్యవస్థలో పరిశ్రమలే ప్రధాన ఉత్పత్తిరంగం. ఈ కారణంగా పారిశ్రామిక రంగం దేశ ఆర్థిక, రాజకీయ, సామాజిక వ్యవస్థల మీద తిరుగులేని ప్రభావాన్ని చూపుతుంది. పారిశ్రామిక రంగానికి భౌతిక పునాది పెట్టుబడి. అంటే, పెట్టుబడి రాజ్యమేలుతుంది.

పెట్టుబడి మనుగడకు, పెరుగుదలకు మూల కారణం లాభం. దీన్నే అదనపు విలువని, శ్రమదోపిడి అని కూడా అంటారు. కనుక, పెట్టుబడి లాభం కోసం ఎక్కడికైనా పోతుంది. ఏమైనా చేస్తుంది (మార్క్సు). ఒక్కమాటలో చెప్పాలంటే, పెట్టుబడికి ప్రాణం కంటే లాభమే మిన్న (see, capital, vol.1, chapter on Primitive Accumulation of Capital)

వ్యవసాయంలోకి పెట్టుబడి : ఫ్యూడల్ వ్యవస్థకు వ్యవసాయం కంచుకోట. 18వ శతాబ్దంలో ప్రారంభమైన బూర్జువా విప్లవం ఆ కోటను నేలమట్టం చేసింది. క్రమేణా పెట్టుబడి వ్యవసాయంలోకి ప్రవేశించి, బూర్జువా ఉత్పత్తి సంబంధాలను నెలకొల్పింది. రైతులు కూలీలుగా మార్చబడ్డారు. కూలీలు లేకుంటే అదనపు విలువ ఎలా వస్తుంది? అందుకే అన్నాడు మార్క్సు 'వ్యవసాయాన్ని జయించితేనే పెట్టుబడి ప్రపంచాన్ని జయించినట్లు'. ఇది నిజమైంది. నేడు ప్రపంచాన్ని ఏలుతున్నది పెట్టుబడే.

పెట్టుబడిదారీ వ్యవస్థలో వ్యవసాయ ఉత్పత్తులు కూడా సరుకులుగా మారుతాయి. అంటే పెట్టుబడి వ్యవసాయంలోకి ప్రత్యక్షంగానో, పరోక్షంగానో ప్రవేశించిందన్నమాట.

సరుకులు మారకం కోసమే ఉత్పత్తి చేయబడతాయి. అంటే అమ్మకం, కొనుగోలు కోసం. ఈ మారకం డబ్బు ద్వారా జరుగుతుంది. అమ్మగా వచ్చిన డబ్బులోనే అదనపు విలువ ఉంటుంది. అంటే సరుకులో అదనపు విలువ ఉంటుంది. సరుకును అమ్మినపుడు డబ్బు ద్వారా చేతికి వస్తుంది. మార్క్సు మాటల్లో 'అదనపు విలువ ఉత్పత్తిలోనే ఉంటుంది. సరుకు అమ్మకం ద్వారా చేతికి (పెట్టుబడిదారుని చేతికి) వస్తుంది.

అదనపు విలువను ఉత్పత్తి చేసేది కూడా 'సరుకే'. అది ఒక ప్రత్యేక సరుకు - శ్రమశక్తి. పెట్టుబడిదారీ వ్యవస్థలో శ్రమశక్తి కూడా ఒక సరుకే. ఎందుకంటే అది అమ్మబడుతుంది. కొనబడుతుంది. అమ్మేది కార్మికులు. కొనేది పెట్టుబడిదారులు. శ్రమశక్తి ధర వేతన విలువకు సమానం, అంటే కార్మికుని తిండి, గుడ్డకు అయితే, శ్రమశక్తికి ఒక ప్రత్యేక గుణముంది. అది దాని విలువ కంటే ఎక్కువ విలువను ఉత్పత్తి చేస్తుంది. అదే అదనపువిలువ (సరుకు విలువ-వేతన విలువ)

మన దేశ పరిస్థితి : స్వాతంత్ర్యానంతరం మన దేశం పెట్టుబడిదారీ అభివృద్ధి పంథాను చేపట్టింది. సోషలిస్టు నమూనా సమాజం ఒక ముసుగు మాత్రమే. ఆ ముసుగును నరసింహారావు ప్రభుత్వం పూర్తిగా తొలగించింది. అధికారంలో ఉన్న బూర్జువా వర్గం తన నిజ స్వరూపాన్ని బయటపెట్టింది. కేవలం ఆరు దశాబ్దాల కాలంలో దేశం ఆర్థికంగా, శాస్త్ర సాంకేతికంగా నింగికెగిరింది. మరోవైపు 40 కోట్ల ప్రజలు దారిద్ర్య కూపంలోకి నెట్టబడ్డారు. అందుకే అన్నాడు మార్క్సు 'కార్మికవర్గం ఎంత సంపదను సృష్టిస్తే అంతగా పనికిమాలిన వారవుతారు.'.

మన భూసంస్కరణలు దున్నేవాడికి భూమి కాదు, దున్నని వాడికే అని తేటతెల్లమయింది. 2011 జనాభా లెక్కల ప్రకారం గ్రామీణ కుటుంబాలల్లో మూడోవంతు వ్యవసాయ కూలీ కుటుంబాలు. 70 శాతం కుటుంబాలు సన్నకారు రైతులు (1-2 ఎకరాలు) వీరు పాక్షిక వ్యవసాయ కూలీలు. ఎందుకంటే, వారి భూమి మీద వచ్చే ఆదాయం కుటుంబ పోషణకు సరిపోదు కనుక. మరోవైపు కేవలం 8 శాతం కుటుంబాలు (20 ఎకరాల పైన) 42 శాతం సాగు భూమి కలిగిన వారు. అంటే, లెనిన్ సూచికల ప్రకారం, పెట్టుబడిదారీ వ్యవసాయానికి అవసరమైన రెండు షరతులు పూర్తి అయ్యాయి : ఒకటి వ్యవసాయ కూలీల లభ్యత, రెండు భూకేంద్రీకరణ (Development of capitalism in Agriculture 1914).

ఈనాడు మన గ్రామాలలో నాగలి కనుమరుగైంది. దానికి బదులుగా ట్రాక్టరు వచ్చింది. అంతేకాదు విత్తనాలు చల్లడానికి, నాట్లు వేయడానికి, కోతలు, నూర్పిళ్ళకు యంత్రాలు వచ్చాయి. దీని అర్థం వ్యవసాయంలోకి పెట్టుబడి ప్రవేశించింది. బహుశ ఈ శతాబ్దం చివరకు మన వ్యవసాయం, పశ్చిమ దేశాలలో లాగా కార్పొరేట్ వ్యవసాయం అవుతుంది. దీన్నే 'పెట్టుబడి పల్లెను మింగటం' అంటారు. పెద్ద చేప చిన్న చేపను మింగినట్లు పెద్ద కమతాలు చిన్న కమతాలను మింగుతాయి. మరింత పెద్ద కమతాలవుతాయి. ఇక పల్లెలు కూడా పట్టణాలుగా మారుతాయి. పచ్చదనం పోతుంది. ఆకాశం పొగ మేఘాలతో నిండుతుంది.

విద్యాసాగర్ శ్రీకాకుళం జిల్లాను నమూనాగా తీసుకున్నారు. అక్కడ క్షేత్రస్థాయిలో సేకరించిన గణాంకాలు జాతీయ స్థాయి గణాంకాలకు దాదాపు దగ్గరగా ఉన్నాయి. కనుక, శ్రీకాకుళం జిల్లాను మినీ భారతదేశంగా పరిగణించవచ్చు. ఎందుకంటే, అన్నం ఉడికిందో లేదో తెలుసుకోటానికి ఒక మెతుకు చాలు.

భూమి జాతీయకరణ : పెట్టుబడిదారీ అభివృద్ధిక్రమంలో, భూమితో సహా అన్ని శ్రమసాధనాలు బూర్జువా ఆస్తిగా మార్చబడతాయి. శ్రామిక విప్లవం తరువాత జాతీయం చేయబడేది బూర్జువా ఆస్తినే (Engels, Peasant Question in France and Germany 1872) ఎందుకంటే, అప్పటికి చిన్నా చితకా అమలు ఉండదు జాతీయం చేయడానికి. అందుకే, మార్క్సు-ఎంగెల్స్ కార్మిక విప్లవం ముందుగా

అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో వస్తుందన్నారు. అక్కడే విప్లవానికి కావల్సిన భౌతిక, ఆత్మిక పరిస్థితులు పరిపక్వమయ్యాయి గనుక. తద్విరుద్ధంగా వచ్చిన అక్టోబరు విప్లవం సోషలిస్టు విప్లవం కాదని చరిత్రే నిరూపించింది. ఆధునికి యుగంలో ఒకే ఒక విప్లవం విజయవంతం అయింది. అదే బూర్జువా విప్లవం. ఫ్యూడల్ ఉత్పత్తి సంబంధాలను రద్దు చేసి, బూర్జువా ఉత్పత్తి సంబంధాలను స్థాపించడమే విప్లవానికి అర్థం. ఇప్పుడు బూర్జువా వ్యవస్థ తన ప్రగతిశీల స్వభావాన్ని కోల్పోయింది. సామ్రాజ్యవాద దశలో ఉంది. సామ్రాజ్యవాద దశలో పెట్టుబడిదారీ వ్యవస్థ అంపశయ్య ఎక్కుతుంది. చావుకు దగ్గరగా ఉంటుంది. పాతిపెట్టటానికి కార్మిక వర్గం సిద్ధంగా ఉంది. అయితే, విప్లవ పరిస్థితులు ఇంకా పరిపక్వం కాలేదు. అందుకే, రోగి ఇంకా ప్రాణంతోనే ఉన్నాడు.

రష్యాలో సామూహిక వ్యవసాయంలో కూడా రైతులున్నారు. అలాగే, చైనాలో ప్రజాకోమర్దునుల్లో కూడా. ఈ రైతులు ఒకోరకంగా వేతన కార్మికులే. మార్క్సు నిర్వచనంలో ప్రొలిటేరియన్లు కాదు. అందుకే రష్యా సోషలిజం పెట్టుబడిదారీ విధానానికి మారింది. చైనా మిశ్రమ ఆర్థిక విధానానికి మళ్ళింది.

ఇక, నూతన ప్రజాస్వామ్యం గురించి ఒకమాట కొత్తదైనా, పాతదైనా, ప్రజాస్వామ్యం వర్గపాలనే. కార్మిక నియంతృత్వం కూడా వర్గస్వామ్యమే. వర్గాలు నశించినపుడే స్వామ్యం కూడా పోతుంది. అది కమ్యూనిజంలోనే సాధ్యం. ఎందుకంటే అది వర్గరహిత సమాజం. మార్క్సు మాటల్లో 'కమ్యూనిజమంటే, స్వేచ్ఛాయుత, స్వయం నియంత్రణ ఉత్పత్తిదారుల సమాఖ్య. ప్రజలను నియంత్రించే బదులు వస్తువులను నియంత్రించుతుంది' (Capital, Vol-III, P-820)

ఈ విషయాలు విద్యాసాగర్ తన పుస్తకంలో చర్చించితే బాగుండేది. కానీ, అతని పుస్తకం పరిధి పరిమితం. అయినప్పటికీ, 'పల్లెను మింగిన పెట్టుబడి' మార్క్సిస్టు సాహిత్య మహావృక్షంలో ఒక కొమ్మగా భావించవచ్చు. ఈ కృషికి విద్యాసాగరుడు అభినందనీయుడు.



*తీర్మానం - 2*

*బొబ్బిలి సాహిత్య పాఠశాల*

## ప్రపంచ బ్యాంకు విధానాలకు వ్యతిరేకంగా పోరాడుదాం

రెండు రాష్ట్రాలుగా విడిపోవాలని సుదీర్ఘకాలం తెలంగాణ ప్రజలు పోరాడిన తరువాత 2 జూన్ 2014న ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రెండు రాష్ట్రాలు ఏర్పడ్డాయి. ఈ రెండు రాష్ట్రాల ప్రభుత్వాలు కూడా ఆయా రాష్ట్రాలలోని ఇంతకాలం వెనుకబడేసిన జిల్లాలను, ప్రజలను వదిలి కంట్రాక్టర్లకు, కార్పొరేటర్లకు, 'ఎన్‌జీఓ'లకు పరిశ్రమాధిపతులకు ప్రాధాన్యత ఇస్తూ ప్రపంచ బ్యాంకు విధానాలనే ముందుకు తెచ్చాయి. ప్రజల మీద, ప్రజాస్వామిక భావజాలం మీద దాడి చేస్తున్నాయి. పౌరహక్కులను హరిస్తున్నాయి.

అసమానతలను పెంచి పోషించే ఈ రెండు రాష్ట్రాల ప్రభుత్వాల విధానాలను విరసం తీవ్రంగా ఖండిస్తున్నది. రాయలసీమలో అనంతపూర్ వంటి జిల్లాలను, ఉత్తరాంధ్ర, పల్నాడు ప్రాంతాలను అదే విధంగా తెలంగాణలో మహబూబ్‌నగర్, ఆదిలాబాద్ వంటి జాల్లాలను, ఈ రెండు రాష్ట్రాలలోని ఆదివాసులను ఇక ముందు కూడా వెనుకకు నెట్టి విధ్వంసానికి, విస్థాపనకు గురయ్యే పరిస్థితులు నివారించే చర్యలు చేపట్టాలని విరసం డిమాండ్ చేస్తున్నది. వెనుకబడిన ప్రజలు పోరాటాలకి విరసం సంఘీభావం ప్రకటిస్తున్నది.

*తీర్మానం - 3*

*బొబ్బిలి సాహిత్య పాఠశాల*

## తెలంగాణలో రాజ్య నిర్బంధం

తెలంగాణ రాష్ట్రం ఏర్పాటై నేటికి సరిగ్గా 7 నెలల 6 రోజులు అవుతోంది. రాజకీయ పార్టీలు, వాటి అనుయాయులు కోరుకున్న భౌగోళిక తెలంగాణ వచ్చింది. కానీ, దానిని ప్రజాస్వామీకరించే బాధ్యత మాత్రం అలాగే మిగిలిపోయింది. తెలంగాణ రాష్ట్ర ప్రతిపాదనను ముందుకు తెచ్చిన ప్రతిసారీ మనం ఈ ప్రజాస్వామికతను గురించి మాట్లాడుతూనే ఉన్నాం. ఏ ఆకాంక్షలతో తెలంగాణ రాష్ట్ర ఉద్యమం ప్రారంభమైందో ఆ ఆకాంక్షల సాధనలో తెలంగాణ మేధావి వర్గం విఫలమవుతోన్న సందర్భాలు ఈ 7 నెలల కాలంలో మనం గమనిస్తూనే ఉన్నాం. తెలంగాణ రాష్ట్రోద్యమ సందర్భంలో మనం ప్రజాస్వామిక తెలంగాణను ప్రస్తావించిన ప్రతిసారీ వ్యతిరేకించి వాయిదా వేసినవారూ ఈ మేధావులు, రచయితలే. తెలంగాణ రాష్ట్రంలో టి.ఆర్.ఎస్ ప్రభుత్వాన్ని ప్రశ్నించిన ప్రతిసారీ వెనకేసుకొస్తున్నదీ కూడా ఇదే మేధావి, రచయితల వర్గాలు కావడం విశేషం. అంటే మొత్తంగా తెలంగాణలో ప్రతిపక్ష స్వరాన్ని లేకుండా చేయాలని, అవసరమయితే ప్రలోభాలతో, లేదంటే నిర్బంధంతో దాన్ని ప్రతిష్టించాలని టి.ఆర్.ఎస్ ప్రభుత్వం చూస్తోంది. దానిలో భాగమే నేటి తెలంగాణలో రాజ్య నిర్బంధం.

తెలంగాణకు ఈ నిర్బంధాలు కొత్త కాదు. ఆనాడు ఎన్.టి.ఆర్. 'ఆట,పాట,మాట' ను నిషేధిస్తే అదే పేరు తన కొడుక్కు పెట్టుకున్న కెసిఆర్ అంతకంటే రెట్టింపు నిర్బంధాన్ని అవలంబిస్తున్నాడు. సెప్టెంబర్‌లో, మంచిర్యాలలో టిపిఎఫ్ నిర్వహించిన రాజకీయ తరగతులు, అదే సెప్టెంబర్‌లో 'రాజకీయ ప్రత్యామ్నాయ వేదిక' సభ, తరువాతి నెలలో ఎపి, తెలంగాణ ప్రభుత్వాలు కలిసి విరసం సభ్యుడు వి.వి. ఇంటి ముందు చేయించిన ధర్నా, జనవరి 29,30 నల్గొండలో టివివి 4వ రాష్ట్ర మహాసభలపై నిర్బంధాలను మనం ఎదుర్కొన్నాం. ఈ రాజ్య నిర్బంధాన్ని విరసం తీవ్రంగా ఖండిస్తోంది. రచయితలంతా తమ సామాజిక బాధ్యతగా ఈ రాజ్య నిర్బంధానికి వ్యతిరేకంగా మరింత బలంగా తమ గొంతును వినిపించాల్సిన సందర్భంగా విరసం గుర్తు చేస్తోంది.

# కామ్రేడ్ రఫూఫ్ స్మృతి

- సరస్వతి

ఎవరైనా కొంతకాలం విప్లవకారులుగా జీవించవచ్చు కాని జీవితకాలం విప్లవకారులుగా గుర్తించబడేది అమరులైన తర్వాతనే అని చారుమజుందార్ అంటాడు. కా.రఫూఫ్ జ్ఞాపకాల వెంటే చారుమజుందార్ సూక్తి గుర్తుకు రావడానికి కారణం ఉంది. కా.రఫూఫ్ చారుమజుందార్ ప్రియశిష్యుడు. ఎంతగానంటే డిమెన్షియాతో అన్ని విషయాలు మరిచిపోయిన చివరి దశలో కూడా కా.సి.ఎం పేరు చెప్పగానే ఆయన వెంటనే స్పందించారు. ఆయన తన ఉద్యమ జీవిత అనుభవాలను సహచరులతో పంచుకునేటప్పుడు చారుమజుందార్ పట్ల గౌరవం పదే పదే వ్యక్తమయ్యేది. విప్లవకారులకు ఆస్తిపాస్తులు ఏమైనా ఉన్నాయి అంటే అది ప్రజల పట్ల ప్రేమ, సమాజ మార్పు కోసం పనిచేయడంలో నిబద్ధత అన్న చారుమజుందార్ ఆదర్శాన్ని, ఆశయాన్ని ఎంతగానో చాటి చెప్పారాయన. విప్లవకారులు తాము నమ్మిన సిద్ధాంతానికి ఎంతగా అంకితమై ఉంటారో తన చేతనలోనూ, అచేతనావస్థలోనూ రఫూఫ్ తెలియజేశారు. ఆయన జీవితకాలం కమ్యూనిస్టు ఆదర్శాలతో, శ్రామికవర్గ విప్లవ పంథాలో కొనసాగారు. అనారోగ్యంతో ఉన్న చివరి రోజుల్లో తన పనులు తాను చేసుకోలేని స్థితిలో కూడా ఇంకొకరితో చేయించుకోడానికి ఇష్టపడేవారు కాదు.

రఫూఫ్ న్యాయవాద వృత్తి నుండి వృత్తి విప్లవకారుడిగా మారాడు. న్యాయవాదిగా ఎంతో మంది పేదల కేసులు తీసుకుని పోరాడాడు. ఎంతో నిజాయితీగా తన వృత్తి ధర్మాన్ని నిర్వర్తించినా ఈ వ్యవస్థలో ప్రజలకు న్యాయం జరగదని పీడిత ప్రజల విముక్తికి వర్గపోరాటం తప్ప వేరే మార్గం లేదని గ్రామాలకు వెళ్లి ఉద్యమాన్ని నిర్మించాడు. అనంతపురం జిల్లా, కదిరి తాలూకా నల్లచెరువు మండలంలో తన క్లాస్‌మేట్, స్నేహితుడు అయిన వడ్డీ వ్యాపారి ఇంటి మీద దాడి చేసి తన వర్గ దృక్పథాన్ని చాటాడు. 1967లో సిపిఎం నుండి సిపిఐ (ఎం.ఎల్) విడిపోయినప్పుడు కదిరి ప్రాంతంలో సిపిఎం పేరు చెప్పడానికి కూడా ఒక్క కార్యకర్త లేకుండా క్యాడర్ మొత్తాన్ని ఎం.ఎల్ వైపుగా ఆర్గనైజ్ చేశాడాయన. ప్రజల మీద విశ్వాసం సడలకూడదని చేప్పే రఫూఫ్ జ్ఞాపకాల్లో విప్లవోద్యమాన్ని, విప్లవకారుల్ని ప్రజలు ఎలా గుండెలల్లో పెట్టుకుని కాపాడుకుంటారో చెప్పేవాడు. ఎమర్జెన్సీ కాలంలో ఆయన రహస్య జీవితంలో ఉన్నప్పుడు కుటాగుళ్ళ నుండి ఒక అమ్మ భోజనం తెచ్చి పెట్టేది. మేకలను మేపుకోడానికి అడవికి పోతూ తన మధ్యాహ్న భోజనాన్ని రఫూఫ్‌కు పెట్టి ఆమె పస్తులుండేది.

అరెస్టయ్యాక బెంగాల్ పోలీసులు ఆయనను విచారణ కోసం కలకత్తా తీసుకెళ్ళారు. ఎన్‌క్వైరీ చేసే ముందు ఒక డాక్టర్ వచ్చి ఆయన ఆరోగ్య పరిస్థితిని పరీక్షించాలి. అలా వచ్చిన డాక్టర్ 'మీకు హార్ట్‌ప్రాబ్లం ఉందని చెప్పండి సార్' అని చెప్పి పోయేవారట. ప్రజలు పార్టీ రహస్యాలనెలా కాపాడతారో చెప్పడానికి ఆయన ఒక ఉదాహరణ చెప్పేవాడు. నక్సల్బరీ కాలంలో పోలీసులు అరెస్టు చేస్తే వివరాలు చెప్పకూడదని పార్టీ జాగ్రత్తలు చెప్పేది. అరెస్టయిన ఆదివాసీలు పోలీసుల వద్దే కాదు, కోర్టులో కూడా తమ పేరు, తండ్రి పేరు, ఏదడిగినా తెలీదనే చెప్పారట. ఇందిరా గాంధీ ప్రభుత్వం ఉద్యమాన్ని వదిలి లొంగిపోయిన వారికి జీవనభృతి కల్పిస్తుందని జీవో తెచ్చినప్పుడు కొంత మంది అపోహలకులోనై విప్లవోద్యమాన్ని త్యజించారు. ఆ సమయంలో కా.రఫూఫ్ కలకత్తా జైలులో ఉన్నాడు. ఆదివాసీ మహిళా కామ్రేడ్స్ ఆయనను కలిసి 'మీరు సంతకం చేయకండి, మేం బెయిల్ మీద విడుదలై బైటికి పోయాక జైలు మీద దాడి చేసి మిమ్మల్ని తీసుకెళ్తాం'మని అన్నారట. స్త్రీల పోరాట పటిమను గురించి చెప్పేటప్పుడు దీనిని ఉదహరించేవాడాయన. ఉద్యమంలోకి అనేక రకాల క్యాడర్ వస్తూ ఉంటారు. పోతూ ఉంటారు. దీర్ఘకాలిక సాయుధ పోరాటాన్ని అర్థం చేసుకోవడంలో లోపాలను ఆయన గుర్తించి క్యాడరుకు బోధపరిచేవాడు. ముఖ్యంగా ఏదైనా పనిని వాయిదా వేస్తుంటే దీర్ఘకాలిక పోరాటం అంటే నిదానంగా చేసుకొని పోయేది కాదని చెప్పేవాడు. ఆయన సరదాగా ఒక ఉదాహరణ చెప్తాడు. ఎవరో ఒకాయన వచ్చి, 'సార్ మనది దీర్ఘకాలిక సాయుధ పోరాటం కదా' అంటే ఆయన 'అవును' అన్నాడట. 'అయితే నాకు పిల్లలున్నారు సార్, వాళ్ళకు పెళ్ళిళ్లు చేసి వస్తాను' అని చెప్పాడట.

అరెస్టయిన కామ్రేడ్స్ కోర్టులో వకాల్తా పెట్టుకోరాదనే రోజులవి. చట్టాలను, కోర్టులను ఆ విధంగా ధిక్కరించేవారు. కోర్టులో ప్రవేశపెట్టగానే విప్లవ రాజకీయాలపై రోజంతా స్పీచ్ ఇచ్చేవారు. జడ్జిలకు ఓపిక నశించి బైటికిపోయి, టీ, కాఫీ తాగుతూ, సిగరెట్లు కాలుస్తూ కాలం గడిపి కోర్టు మూసే సమయానికి వచ్చి 'లైఫ్ సెంటెన్స్' ఇచ్చేవారు. కామ్రేడ్స్ నవ్వుతూ బైటికి వచ్చేవారు. ఏమైందని అడిగితే 'ఏముంది, మామూలే, 14 సంవత్సరాలు జైలు అనేవాళ్ళు. జైలు, కోర్టులంటే విప్లవకారులకు ఎంత తేలిక భావమో చెప్పేవాడాయన. జైళ్లు రాజకీయ పాఠశాలగా ఉపయోగపడేవి. కా.రఫూఫ్ జైల్లో ఉన్నప్పుడు లైబ్రరీయే పెట్టుకున్నారు. అన్ని పార్టీల కార్యకర్తలు కూడా అక్కడ చేరేవారు. దేశవిదేశీ పత్రికలు, సాహిత్యం వచ్చేది. వివిధ పార్టీల కార్యకర్తలతో రాజకీయ చర్చలు జరిగేవి. జైలు సిబ్బంది కూడా విప్లవకారులను గౌరవంగా చూసేవారు. రాత్రి 11 గంటలకు కూడా టీ పెట్టుకుని చదువుకుంటుంటే సహకరించేవారు. జైలు నుండి కా.రఫూఫ్‌ను కదిరి కోర్టుకు తీసుకొని వస్తే రైల్వేస్టేషన్ నుంచి కోర్టు దాకా జనం తండోపతండాలుగా బారులుతీరి ఆయన కోసం ఎదురుచూసేవారు.

పన్నెండు సంవత్సరాల జైలు జీవితం తరువాత బైటికి వచ్చిన కా.రఫూఫ్ తన స్వగ్రామం కుటాగుళ్ళ నుండి ఉద్యమాన్ని ప్రారంభించారు. ఎమర్జెన్సీ కాలంలో రఫూఫ్‌కు భోజనం పెట్టిన అమ్మతో పార్టీ క్యాడరు నిత్యం కలుస్తూ ఉండేవారు. ఆమె కుటుంబ సభ్యులు వ్యతిరేకిస్తే, ఆమె తన కుటుంబంతో వేరైపోయి కూలి పనులు చేస్తూ

# నేటి తెలుగు కవిత్వం - చాకలి జీవితం

- పి. దస్తగిరి

ప్రపంచ దేశాలతో పోల్చుకుంటే భారతదేశం ఒక విభిన్నమైన సామాజిక వ్యవస్థను కలిగి ఉంది. ప్రాచీనకాలంలో మొదలైన నాలుగు వర్ణాల నిచ్చెనమెట్ల వ్యవస్థ ఈనాటికీ కొనసాగుతూనే ఉంది. ఈ నాలుగు వర్ణాలలో మొదటి మూడు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలుకాగా, వీరికి ఊడిగం చేస్తూ బానిసలుగా బతకడం నాలుగో వర్ణమైన శూద్రుల బాధ్యతగా సనాతనధర్మం చెప్తుంది. శూద్రవర్ణంలో మళ్ళీ శూద్రులు, అతి శూద్రులు అని రెండు రకాలుగా విభజించుకుంటే, అందులో మొదటిరకంవారు (రెడ్డి, కమ్మ, యాదవ మొ॥) సమాజంలో వృత్తి గౌరవాన్ని, సామాజిక గౌరవాన్ని కలిగివుండగా, రెండో రకానికి చెందినవారు (చాకలి, మంగలి, కమ్మరి, కుమ్మరి మొ॥) తాము చేస్తున్న వృత్తి ఆధారంగానే మిగతా వర్ణాలవారిచేత వివక్షకు, అవమానాలకు గురవుతున్నారు. వారిలో 'చాకలి' సామాజికవర్గం గురించి ఎంతైనా చెప్పుకోవచ్చు.

బట్టలు ఉతకడం, చాకలివాళ్ళవృత్తి. దేవుని ఉత్సవాలకు, పెళ్ళిళ్ళకు దివిటీలు పట్టడం, పల్లకీలు మోయడం అదనపు పనులు. దేవతా ఉత్సవాలలో, తిరునాళ్ళలో, జాతర్లలో కోళ్ళను, పొట్టేళ్ళను నరకడం, వాటి తలలను కానుకలుగా తీసుకోవడం వీరి కొనసాగింపు పని. ప్రస్తుతకాలంలో కనిపించనప్పటికీ, కొంతకాలం కిందటి వరకూ అగ్రవర్ణ కులాల స్త్రీలు అత్తగారింటికిగాని, చుట్టాల ఇండ్లకుగాని వెళ్ళేసమయంలో కానుకలు, పిండివంటలు మొదలైనవి మోసుకెళ్ళడమేకాకుండా, వారెక్కిన ఎండ్లబండ్లకు అంగరక్షకుడిగా చాకలి ముందుగా వెళ్ళడమనేది ఆనవాయితీగా ఉండేది. అగ్రవర్ణాల పురుషులు ఏదయినా పనిమీద ఎక్కడికైనా వెళ్లినప్పుడు, వారి స్రీలకు ధైర్యంగా, రాత్రివేళల్లో వారి ఇండ్ల దగ్గర గూర్ఖాలుగా కావలి ఉండటం నిన్నటిమొన్నటిదాకా ఉండేది. అయితే ఇప్పుడు ఇది రూపాంతరంచెంది, పట్టణాలలో ఉండే అపార్టుమెంట్లకు కావలికాస్తూ ఆ అపార్టుమెంట్లలో ఉండేవారికి బట్టలు ఉతికి ఇస్త్రీ చేసేజీవనంగా కొనసాగుతున్నది.

పల్లెల్లో కొన్ని ఇండ్లకు ఒక చాకలి 'ఇంటి చాకలి'గా నిర్ణయించబడి ఉంటాడు. అగ్రవర్ణాల మురికి- బట్టల్ని ఉదయాన్నే చాకిరేవుకు తీసుకెళ్ళి శుభ్రంచేసి, ఆ బట్టల్ని అదేరోజు సాయంత్రానికి వారి ఇండ్లకు చేర్చడం వీరి విధి. ప్రతిరోజూ ఏదో ఒకపూట అన్నం పెట్టించుకెళ్ళడమనేది గ్రామాల్లోని సంప్రదాయం. ఇది పట్టణాలల్లో కనిపించదు.

ఎన్నో వృత్తి జీవితాల గురించి మాట్లాడిన తెలుగు కవిత్వం, సమాజంలో చాకలివృత్తి జీవితాన్ని గూర్చి ఏమాత్రం పెదవి విప్పిందో తెలుసుకోవడమే ఈ వ్యాసోద్దేశం.

ఊరందరికి అంటిన పెనుమురికిని చౌడు,సున్నం కలిపిన కమ్ముతో శాస్త్రీయంగా పిండి ఊరంతటినీ తెల్లటివస్త్రంలా శుభ్రంచేసేది చాకలి. పిల్లవాడు శుభ్రమైన బట్టలు తొడిగి బడికి వెళ్ళడంలో, అమ్మలక్కలు వేడుకల్లో మెరిసే బట్టలతో గౌరవం పెంచుకోవడంలో చాకలిశ్రమ దాగి ఉంది. పార్లమెంటులో ప్రధాని మెరిసిపోతున్నాడన్నా, అసెంబ్లీలో సిఎం తళతళలాడుతున్నాడన్నా అందుకు చాకలివృత్తి నైపుణ్యమే మూలకారణం. ఆ క్రమంలో పొరపాటున యజమాని మసిపాత మడుగులో జారిపోయినా, చీర చిరిగిపోయినా అందుకు మనసుకు నొప్పి కలిగించే ఎన్నో మాటలను భరిస్తున్నాడు చాకలి. అంతేకాదు, బట్టలుతకడానికి అవసరమైన సరుకుల ధరలు పెరిగి, తన శ్రమకుతగ్గ కూలి లేక ఆర్థికంగా అధోగోతిలోపడి బండపై బతుకు ఈడ్చుకుంటూ వస్తున్నాడు చాకలి. ఇటువంటి దుర్భరస్థితిలోవున్న చాకలి బతుకుల్ని పట్టించుకునే ఏ రాజకీయనాయకుడు లేక, బాధలే చాకలికి మిగిలాయంటూ సాహిత్య ప్రకాశ్ తన 'ఒకచాకిరేవు పాట'లో....

'రాజకీయ నాయకుడు సచివాలయంలో శ్వేతపత్రమై మెరవాలన్నా
విద్యార్థి స్కూల్ దుస్తుల్లో తెల్లగులాబీలా విరబూయాలన్నా
ఆడవాళ్ళు వేడుకల్లో పసిడికాంతులీనాలన్నా
అదంతా ఆమె చలవే
........................................
ఉతికేటప్పుడు రవిక రేవులో జారిపోయినా
ఆరేసేటప్పుడు ముళ్ళకంపని తగిలి చొక్కా చిరిగినా
ఇస్త్రీపెట్టే నిప్పురవ్వకి చీరకాలిపోయినా
యజమానులు తిట్టే బండబూతులు తినాల్సిందే
రజకుల జీవితాల్లో
*వెట్టి చాకిరేవులే తప్ప వెతలు తీరే దారి లేదా?!'*

అంటూ బండచాకిరీ చేసినా తమ జీవితాలకు భరోసా ఇవ్వలేని ప్రభుత్వాన్ని, చేతకాని రాజకీయ నాయకులను ప్రశ్నతో కడిగేస్తున్నాడు.

---

స్వతంత్రంగా జీవనం సాగించింది. అమ్మ ఇల్లు పార్టీ ఆఫీసుగా మారింది. రవూఫ్ రహస్య జీవితంలోకి వెళ్ళిన తర్వాత వయసు మీరి, తన పనులు తను చేసుకోలేని పరిస్థితిలో ఆమె మళ్ళీ కుటుంబ సభ్యులతో చేరింది. ఎవరైనా పార్టీ సభ్యులు, సానుభూతిపరులు కనిపిస్తే ఆమె 'సార్' గురించి అడిగేది. 'చనిపోయేలోపు ఒక్కసారి సార్‌ను చూడాలని ఉంది, చూపించండి' అనడిగేది. సార్ అమ్మను చూడను వెళ్ళారు. తర్వాత రెండు నెలల్లో అమ్మ చనిపోయింది. అమ్మ గురించి మాట్లాడేటప్పుడు సారు 'అమ్మ పార్టీకే అమ్మ' అని చెప్పేవాడు.

ప్రేమానురాగాలకు ప్రతీకలు విప్లవకారులు. వాళ్ల సాన్నిహిత్యంలో వాటి లోతు తెలుస్తుంది. విప్లవ ప్రజానీకం కూడా అంతే.

అమరుల త్యాగాలు, ఆశయాలు, అనుభవాలు వారు మనకందించిన గొప్ప సంపద. వాటిని తీసుకుని ముందుకు పోదాం. 'దోపిడీ పాలకవర్గం జీవించె రాతి విగ్రహాలలో. పీడిత ప్రజల కోసం అమరులైన వారు జీవించేరు ప్రజల హృదయాలలో'.

(ఫిబ్రవరి 9 కామ్రేడ్ రవూఫ్ మొదటి వర్ధంతి సందర్భంగా)



ఊళ్ళో అందరూ ఛీ అని పడేసిన చెమటను, మలమూత్రాలను చాకలి తన చేతులతో తాకడమేకాదు, చక్కగా మూటగట్టి వీపున మోసుకెళ్తాడు. ఆ బరువుతో వంగిపోయి గూని తెచ్చుకుంటాడు. దాంతో అవమానానికి గురవుతాడు. పొద్దంతా రేవులో గొడ్డుచాకిరి చేసి, రాత్రికిన్ని మెతుకులకోసం బువ్వ పుటికతో వెళ్తే, ఏదో ఉదారంగా అడుక్కునే బిచ్చగాళ్ళ మాదిరి రైతుల ఇళ్ళ పంచన నిలబడాల్సి వస్తోంది చాకలికి. అంతే కాదు వృత్తిని నిర్వర్తించే క్రమంలో వయసుకొచ్చిన చాకలి ఆడపిల్లలు రైతుల ఇళ్ళ దగ్గరికి వెళ్ళినప్పుడు, అగ్రవర్ణాల మృగాళ్ళు, కొవ్వెక్కి కూసే కారుకూతలను భరిస్తున్నారు. ఈ బాధనంతటినీ అక్షరాలకెక్కిస్తూ **పి.సి.రాములు** తన 'యాదుంచుకోండ్రి' కవితలో తెలిపాడు.

'ఔ! గట్ల గుడ్లుదెరిసి సిత్రంగ నగుతరేంది..........?
గూనపెంకులెక్క గొడ్తున్నంలే.....!
సుక్క పొద్దంగ లేసి ఇల్లిల్లూ దిరిగి జమేసిన
మీ మైల బట్టల మూటల్ని మోసిమోసి
మా ఎన్నుపూస కాల్చిన సెలాకలెక్క జివ్వనంగిపోయినంక
మీ లెక్క నిటారుగ నడిస్తందుకు మాకెన్నివికేడుంది........బాంచెన్!
..................................................................................
..................................................................................
మస్తు మిడిసి పడ్తన్నవే మైసీ...మా పానం గుంజేస్తన్నవే ఎల్లీ'అంటూ
*పరాశికాలాడ్తా.....సతాయించి సత్తెనాశేంద్రు'*

వృత్తిని నమ్ముకున్న చాకలికి బండతోనే మెతుకు, బండతోనే బతుకు. రెక్కాడితేగాని డొక్కాడనిచందంగా నిరంతరం రేవులో బండమీద రెక్కలు ముక్కలు చేసుకుంటేగాని పొట్టనిండని దుస్థితి చాకలిది. పొద్దుకే పొద్దయి పొడిచి బతుకు గడియారంతో పోటీ పడుతుంటాడు. ఉంటే రేవులో లేకుంటే ఇస్త్రీపెట్టెతో బతుకును ముడేసుకొని గింజుకుంటూ ఉంటాడు. కాళ్ళు లాగుతున్నా, నడుం వంగుతున్నా,బతుకు యుద్ధంలో చేతిలో ఆయుధంలాగా ఇస్త్రీపెట్టెను పట్టుకొని జీవితపు మడతల్ని సాపు చేసుకుంటూ ఉంటాడు. ఇస్త్రీకాకతో కారే శ్వేదజలంతో తీరని బతుకు దాహానికి కొట్టుమిట్టాడుతుంటాడు. ఎండలకు ఎండిపోతూ, వానలకు తడుస్తూ తన ఒళ్ళు గుల్లవుతున్నా లెక్కచేయక బతుకును ముక్కలు చేసుకుంటాడు చాకలి. ఈ బతుకుపోరును చిత్రంలా మన కళ్ళముందుంచింది కె. గీత తన 'ఇస్త్రీవాడు'లో.

'రేవు ముందు లేస్తుందో అతడు ముందు లేస్తాడోగాని
నిర్విరామంగా రెండు చేతులా కాలపురాతినతడు మోగిస్తూనే ఉంటాడు
..................................................................................
..................................................................................
ఉష్ణోగ్రతల హెచ్చుతగ్గుల మధ్య
స్వేదాన్ని ఉదకంలా తాగుకుంటూ
బరువుగా చేతులెత్తినబెట్టి
అతడలా నలిగిన బతుకు మడతల్ని
*ఆకలి నిప్పు పెట్టెతో సాఫీ చేస్తూనే ఉంటాడు'*

మనదేశ జెండా మూడురంగుల కలయిక. కాషాయం, తెలుపు, ఆకుపచ్చ. అంటే భారతీయులమంతా ఒక్కటేనని చెప్పుకునే జాతీయపతాకంలోనే కుల, మతరహిత భావనకు ప్రతీకగా కాషాయాన్ని చెప్పారు. కానీ ఈనాడు కాషాయం అంటే నిచ్చెనమెట్ల వ్యవస్థను కలిగి, కులగజ్జికి, మతమౌఢ్యానికి మారుపేరు. అటువంటి నిచ్చెనమెట్ల కులవ్యవస్థలో ఉన్న చాకలి కులమతాలకు అతీతంగా, ఈ దేశప్రజలందరి మురికినేకాదు, చీము, నెత్తురులా కారే హేయభావాలను కూడ శుభ్రంచేసి, ఎర్రదనానికి నిండుదనాన్నిచ్చే శ్రామిక కులంగా, సమసమాజ నిర్మాణకర్తగా 'మాలోపుట్టాల్సిందే తమ్మీ' అంటూ **జి.వి.రత్నాకర్** గొంతు పలికింది.

'ఈ దేశ జెండాపై నీవు కార్చిన
చీము నెత్తుటి మరకల్ని తొలగించి
ఎర్రదనానికి నిండుదనాన్నిచ్చిన
*నల్లటి చాకలి బండని నేను'*

చాకలి యజమానుల మాసిన బట్టల్ని ఉతికి శుభ్రంచేసి వారికి తిరిగి ఇచ్చే క్రమంలో బట్టలు తారుమారు కాకుండా కాల్చిన జీడిగింజ గుజ్జుతో గుర్తులేసుకోవడం పరిపాటి. ఇన్నాళ్ళు చదువు లేక ఎంతో మోసపోయిన చాకలి ఈనాడు చదువుపట్ల అవగాహన తెచ్చుకొని తన ఆత్మాభిమానాన్ని చాటుతున్నట్లు **శిఖామణి** తన 'కిర్రుచెప్పుల భాష'లో పలుకుతున్నాడు.

'ఇప్పుడు అక్షరాన్ని
కాల్చిన జీడిగింజను చేసి
జాతి వస్త్రం మీద
నా చాకలి సంతకాన్ని చేస్తున్నాను'

దళితులు ఊరికి దూరంగా విసిరేయబడి ఒకేసారి చంపబడితే, చాకలి బి.సి. వర్గంలో ఉన్నప్పటికీ ఊరి అంచున ఉంచబడి చీటికిమాటికి అవమానాలను ఎదుర్కొంటూ ప్రతిక్షణం మానసికంగా చంపబడుతున్నాడు.

పైన చెప్పిన కవితలన్నింటినీ బట్టి చాకలి జీవితం సాంఘికంగా ఎన్ని అవమానాలకు గురవుతున్నదో, ఆ వృత్తినే గుడ్డిగా నమ్ముకుని ఎంతటి శ్రమదోపిడీకి గురవుతున్నదో స్పష్టంగా తెలుస్తున్నది. దళితులుగాని దళితులుగా సమాజంలో ఎన్నో అవమానాలకు, అత్యాచారాలకు బలవుతున్న చాకలి జీవితంలో చైతన్యాన్ని, ఉత్తేజాన్ని నింపే కవిత్వం ఇంకా ఎంతో రావాల్సి ఉంది. అలా కవిత్వం ఎక్కువగా రావాలంటే ముందు చాకలివాళ్ళు బాగా చదవాలి. సమాజంపట్ల అవగాహన పెంచుకోవాలి. అప్పుడే తమ కష్టాలను, బాధలను గురించి రాయగలరు. మాట్లాడగలరు.



# ఇస్లాం తీవ్రవాద మూలాలు - పరిణామాలు

- ఎర్రంరెడ్డి నర్సింహారెడ్డి

**(గత సంచిక తరువాయి) : (2)**

**పశ్చిమాసియాలో అమెరికా వ్యూహం :**

అమెరికా ప్రారంభించిన కాలిఫేట్ వ్యతిరేక యుద్ధంలో ఇప్పుడు హఠత్తుగా సౌదీ, ఖతార్ దేశాలు కూడా చేతులు కలిపాయి. పాలస్తీనా పట్ల అమెరికా, టర్కీలమధ్య తీవ్ర వైరుధ్యం ఉంది. ఇప్పుడు టర్కీ కూడా అమెరికాతో చేతులు కలిపింది. అమెరికాకీ సిరియా శత్రురాజ్యం! సిరియాకీ అమెరికా శత్రురాజ్యం! ఈ రెండు రాజ్యాల సైనిక బలగాలు ఐఎస్ఐఎస్ అనే రాజ్య రహిత సంస్థపై యుద్ధంలో పరస్పరం సహకరించుకునే కొత్త పరిస్థితి ముందు కొచ్చింది. మధ్య ప్రాచ్యంలోని సాంప్రదాయంగా అమెరికాను అనుసరిస్తున్న రాజ్యాలకూ, అమెరికాను వ్యతిరేకిస్తున్న ధూర్త రాజ్యాలకు మధ్య ఎందుకిలా ఐక్యత కుదిరింది? షియా రాజ్యాలకు, సున్నీ రాజ్యాలకు మధ్య ఇలాంటి ఐక్యత ఎందుకు చేకూరింది? వీరందరికీ ఐఎస్ఐఎస్ ఉమ్మడి శత్రువుగా ఎందుకు మారింది? అది సంకీర్ణ యుద్ధానికి ఎందుకు దారితీస్తున్నది? ఇప్పుడు అంతర్జాతీయ రాజకీయ పరిశీలకులందరికీ ఇదో ప్రశ్న! రాజకీయాల్లో ఇలాంటి అరుదైన అద్భుతాలు కూడా జరుగుతాయి. అవకాశవాదమంటే ఇదే సుమా!

అల్‌ఖైదా కంటే అనేక రెట్లు ప్రమాదకరమైన తీవ్రవాద సంస్థగా ఐఎస్ఐఎస్‌ను అమెరికా ప్రకటించింది. అల్‌ఖైదా కంటే ఎక్కువ శక్తింవంతమైన అత్యాధునిక ఆయుధ, సమాచార, సాంకేతిక, ఆర్థిక వ్యవస్థలు గల సంస్థగా కూడా విశ్లేషించింది. అంతేకాకుండా అది 31వేల మంది సుశిక్షిత గెరిల్లా బలగాలతో దాదాపు 60 దేశాలలో శాఖలను కలిగివున్న సంస్థగా కూడా వ్యాఖ్యానించింది. అందుకు కారణాలు కూడా ఉన్నాయి. అమెరికా, యూరప్ దేశాలనుంచి వేలాది మంది విద్యాధికులైన అరబ్ యువతీ, యువకులు చదువులకి స్వస్తి చెప్పి ఐఎస్ఐఎస్‌లో విస్తృతంగా చేరుతున్న పరిస్థితి సామ్రాజ్యవాదులను ఆందోళనకు గురిచేస్తున్నది. అంతకంటే మించి, తన ఉపగ్రహ రాజ్యాలైన సౌదీ అరేబియా, ఈజిప్టు (ముఖ్యంగా సౌదీ) దేశాల యువతరం విశేషంగా ఐఎస్ఐఎస్ పట్ల ఆకర్షితమవుతుంది. అంతకంటే కూడా మరో ఆందోళనకరమైన అంశం అమెరికాను వేధిస్తున్నది. సద్దాం ప్రాతినిధ్యం వహించిన బాత్ పార్టీ నాయకత్వంలో నేడు ఇరాక్ ఉత్తర, వాయవ్య నగరాలు, పట్టణాలు విముక్తి అయ్యాయి. కారణాలు ఏమైనప్పటికీనీ, సిరియా బాతిస్టు ప్రభుత్వానికి ఇంత కాలం సాంప్రదాయ రాజకీయ పునాదిగా ఉన్న సిరియన్ బాత్ పార్టీ ప్రధాన శక్తులు ఇరాకియన్ బాత్ పార్టీతో చేతులు కలిపాయి. దీనితో టర్కీ నైరుతి సరిహద్దు నుంచి మధ్యధర సముద్ర తీరం వరకూ రెండు కోట్ల మందికి పైగా ప్రజలు నివసిస్తున్న 'రఖా లోయ' నేడు కాలిఫెట్ రాజ్యంగా మారింది. ఒకవైపు ఆధునిక విద్యాధిక అరబ్ యువతరం నుంచి రూపొందిన తీవ్రవాద శక్తులూ ఏకం కావడం సంప్రదాయ షియా, సున్నీ మత రాజ్యాలకు మింగుడు పడటం లేదు.

ఇరాక్ ప్రజలను ఐఎస్ఐఎస్ తీవ్రవాదులు ఊచకోత కోస్తున్నాయని, ఇరాక్ ప్రభుత్వం తన ప్రజలకు రక్షణ కల్పించలేని స్థితిలో ఉందని, అందుకు బయటి సహాయం కావాలని అమెరికా, పశ్చిమ దేశాల మీడియా ప్రచారం చేస్తుంది. ఈ ప్రచార లక్ష్యం విదేశీ శక్తులు సైనిక జోక్యం చేసుకుని రక్షించాలన్న డిమాండ్ ప్రపంచ ప్రజల నుండి తెప్పించే యత్నమే. 2003లో అమెరికా ఇరాక్‌ను దురాక్రమించిన తర్వాత అక్కడి చమురు కంపెనీలను వశం చేసుకుంది. ఇరాక్ ఆర్థిక, రాజకీయ వ్యవస్థలను తన అదుపులోకి తెచ్చుకుంది. రెండు లక్షల మందితో ఇరాక్ సైన్యాన్ని ఏర్పరచింది. బూటకపు ఎన్నికలు నిర్వహించి నౌరి-అల్-మాలికి కీలుబొమ్మ ప్రభుత్వాన్ని ఏర్పరిచింది. ఇరాక్ యుద్ధంలో 10 లక్షల మంది పౌరులు మరణించారు. అమెరికా విధించిన ఆంక్షల వలన మందులు అందక 5 లక్షల మంది ఇరాకీ పసిపాపలు అసువులు బాసారు. షియా-సున్నీ తెగల మధ్య విభేదాలు పెంచి పోషించి 2011లో తన సైన్యాలను ఉపసంహరించుకుంది. ఇరాక్ నుంచి 2011లో అమెరికన్ సైనిక బలగాల ఉపసంహరణ జరిగింది నిజమే! అయితే అది సమగ్ర సైనిక ఉపసంహరణ కాదు. ఇరాక్‌లో ఇప్పటికీ అమెరికన్ సైనిక నిపుణులూ, సలహాదారులూ, పర్యవేక్షకులూ వేలల్లో ఉన్నారు. ఇంకా ప్రైవేట్ విదేశీ కాంట్రాక్టు సేనలూ ఉన్నాయి. నిజానికి 2011కి ముందున్న వలస స్థితి నుంచి, సైనిక ఉపసంహరణ తర్వాత నయా వలస దేశంగా ఇరాక్ మారిందని అంతర్జాతీయ రాజకీయ పరిశీలకులందరూ ఏకగ్రీవంగా అంగీకరిస్తున్నదే!

ఇరాక్ ప్రజలు నేడు ఇస్లాం తీవ్రవాద శక్తులను అనుసరిస్తున్న మాట నిజమే. అందుకు కారకులెవరు? ఇస్లాం దేశాలన్నింటికి భిన్నంగా ఆదర్శ లౌకిక రాజ్యంగా పేరొందిన ఇరాక్‌ను దురాక్రమించిన విదేశీ సామ్రాజ్యవాదమే అందుకు కారణమవుతుంది. మధ్య ప్రాచ్యంలో అమెరికా సాధించిన ఘనకార్యం ఏమిటంటే ఇరాక్, లిబియా, సిరియా దేశాల్లో లౌకికవాదం సమాధులపై మతోన్మాద రక్కసులను ఆవిష్కరించడమే. నిన్నటి లౌకిక జాతిని విధ్వంసానికి గురిచేసిన దురాక్రమణ పాలనే నేటి అలౌకిక పరిస్థితులకు దారి తీసింది. అలాంటి అలౌకిక సామాజిక, రాజకీయ పరిస్థితులే ఇరాక్ ప్రజలను లౌకిక మార్గం నుంచి తప్పించాయి. వారు గతంలో అనుసరించిన లౌకిక రాజకీయ శక్తులనూ, సంస్థలనూ విదేశీ ఫాసిస్టు పాలన విధ్వంసం చేసిన పరిస్థితులను పరిగణనలోకి తీసుకోవాల్సి ఉంటుంది. ఈ నూతన అవాంఛనీయ పరిస్థితులే ఇరాక్ ప్రజలను నూతన రాజకీయ శక్తులనూ, సంస్థలనూ అనుసరించేందుకు కారణమవుతున్నాయి. ఒకవేళ గత లౌకికవాద బాత్ పార్టీకి బదులు, నూతన ఇస్లాం మత రాజకీయ శక్తులను ఇరాక్ ప్రజలు నిజంగానే అనుసరించారనుకుందాం ! అందుకు అవాంఛనీయమైన నూతన పరిస్థితులను తప్ప ప్రజలను

తప్పు పట్టాల్సింది లేదు. ఏది ఏమైనా ఇరాక్ ప్రజలే తమ దేశాన్ని కాపాడుకోవాలి. విదేశీ జోక్యం సరైనది కాదు.

పశ్చిమాసియా పట్ల అమెరికా అనుసరించే విధానంలో చాలా స్పష్టమైన తేడాలు, పరస్పర వైరుధ్యాలు ఉన్నాయనడానికి ఇస్లామిక్ స్టేట్ తీవ్రవాదులపై అమెరికా సైనిక దాడులే స్పష్టమైన ఉదాహరణ. బలగాలన్నీ ఇరాక్ నుంచి వైదొలిగాయని ఒబామా ప్రకటించిన తర్వాత మళ్ళీ ఇప్పుడు ఇరాక్‌కు బలగాలను పంపిస్తున్నారు. ఉత్తర ఇరాక్‌లో, సిరియాలో పెద్ద మొత్తంలో ప్రాంతాలను స్వాధీనం చేసుకున్న ఇస్లామిక్ స్టేట్ తీవ్రవాదులను ఈ ప్రాంతంలో అమెరికా, దాని మిత్రపక్షాలే సృష్టించాయి. ఇరాక్‌ను అమెరికా ఆక్రమించుకున్నప్పుడే ఇస్లామిక్ స్టేట్ తీవ్రవాదుల మూలాలు కనిపించాయి. అమెరికా ఆక్రమణకు వ్యతిరేకంగా జరిగిన ప్రతిఘటనలో అల్‌ఖైదా మూలాలు ఉన్నాయి. ఈ అల్‌ఖైదానే తదనంతర కాలంలో ఇస్లామిక్ స్టేట్ తీవ్రవాదులుగా రూపాంతరం చెందింది. సిరియాలో బషర్ అల్ అసద్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తలెత్తిన సాయుధ తిరుగుబాటుకు సౌదీ అరేబియా, కతార్, టర్కీ దేశాలు నిధులు సమకూర్చాయి. అంతేకాదు, అక్కడ తిరుగుబాటును నిర్వహించింది. అందుకు అవసరమైన సాధన సంపత్తిని సమకూర్చింది కూడా అమెరికానే. సిరియాలో మూడేళ్ళపాటు సుదీర్ఘంగా కొనసాగిన ఘర్షణల్లో సిరియా రెబెల్స్, అన్ని ఇస్లామిస్ట్ గ్రూపులకు అమెరికా, బ్రిటన్, ఫ్రాన్స్ వంటి పశ్చిమ దేశాలు నిధులు అందజేశాయి. వారికి అవసరమైన ఆయుధాలు, శిక్షణ సమకూర్చాయి. ఈ గ్రూపుల నుంచి ఐఎస్ ప్రయోజనం పొందింది.

**తీవ్రవాద ఉన్మాద చర్యలు :**

పశ్చిమ ఇరాక్‌లో తమను పెళ్ళి చేసుకోవడానికి అంగీకరించలేదన్న కారణంతో 150 మంది మహిళలను, వారితోపాటు మరో 91మంది పురుషులను చిన్నారులను ఇస్లామిక్ స్టేట్ (ఐఎస్) ఉగ్రవాదులు అత్యంత దుర్మార్గంగా పొట్టనబెట్టుకున్నారు. మొత్తం 241మంది మృతదేహాలను ఫల్లూజా ప్రాంతంలో సాముహికంగా ఖననం చేసేశారు. ఇరాక్‌లోని అల్ అన్బర్ ప్రావిన్సులో జీహాదీల నాయకుడు అబు అనాస్ అలి లిబి నేతృత్వంలో ఈ దారుణం జరిగినట్లు సమాచారం. ఇరాక్‌లో తాము స్వాధీనంలోకి తెచ్చుకున్న ప్రాంతాల్లో ఇస్లామిక్ చట్టాల నెపంతో క్రూరంగా ముస్లింలోని కొన్ని వర్గాలతో, ముస్లిమేతర తెగలతో ఉగ్రవాదులు ఘర్షణకు దిగుతున్నారు. ముస్లిమేతర తెగల్లో ముఖ్యంగా యాజిదీలను ఉగ్రవాదులు మొదటి నుంచీ టార్గెట్ చేస్తున్నారు. జీహాదీలను పెళ్లీ చేసుకోవాలని సెక్స్‌బానిసల్లా పడి ఉండాలని ఆ వర్గానికి చెందిన మహిళలపై ఒత్తిడి చేస్తున్నారు. యాజిదీ తెగలో మగవారిని చంపుతూ, మహిళలను బానిసలుగా వాడుకుంటున్నారు. మరోవైపు తమ (సున్నీ ముస్లిం)మత విభాగానికే చెందిన అల్బూనిమర్ వర్గంతో కూడా ఐఎస్ ఉగ్రవాదులు తరచూ ఘర్షణ పడుతున్నారు. ఒక రకంగా ఈ రెండు వర్గాల మధ్య యుద్ధమే కొనసాగుతోంది. అల్బూనిమర్ తెగపై కక్షగట్టారు. ప్రస్తుతం అన్బర్‌లోని తార్‌తార్ ప్రాంతంలో రెండు వర్గాల మధ్య పోరాటం కొనసాగుతున్నది. ఐఎస్ ఉగ్రవాదుల వల్ల అన్బర్ ప్రావిన్స్‌లోని 40శాతం పట్టణాలు శిథిలమయ్యాయని అన్బర్ పునర్నిర్మాణ కమిటీ అధ్యక్షుడు తెలిపారు. ఈ క్రమంలో చాలా కుటుంబాలు ఇతర ప్రాంతాలకు వలస వెళ్లాయి.

డిసెంబర్ 16న తెహ్రిక్ ఎ తాలిబన్ అన్న సంస్థ పాకిస్తాన్‌లోని పెషావర్ నగరంలో సైన్యం నిర్వహిస్తున్న పబ్లిక్ స్కూల్‌పై టెర్రరిస్టు దాడికి పాల్పడింది. ఈ దాడిలో 130 మందికి పైగా అందులో అత్యధికులు 13-15 ఏళ్ల వయసు విద్యార్థులు ప్రాణాలు కోల్పోయారు. ఉదయం10గంటలకు గోడదూకి ప్రవేశించి విద్యార్థులు, ఉపాధ్యాయులపై కాల్పులు జరిపిన ఏడుగురు తీవ్రవాదులూ ఆత్మహుతి బాంబు దాడులకు పాల్పడ్డారు. సైన్యం రంగ ప్రవేశం చేసింది. తీవ్రవాదుల బాంబు దాడిలో చనిపోయిన వారెందరో, సైన్యం ఎదురుకాల్పుల్లో చనిపోయిన వారెందరో ప్రభుత్వం ప్రకటించలేదు. ఉత్తర వజీరిస్తాన్ ప్రాంతంలో పాకిస్తాన్ సైన్యం సాగిస్తున్న దాడులకు ప్రతీకారంగా సైనిక స్కూలుపై దాడి చేసామని పాకిస్తానీ తాలిబాన్ ప్రకటించింది. ఈ స్కూలు నిర్వహణకు సైన్యం నిధులు సమకూరుస్తుంది. పెషావర్‌లో ఉన్న సైనికుల పిల్లలు ఇక్కడ చదువుకుంటారు. వీరితోపాటు పౌరుల పిల్లలకు కూడా ఇక్కడ ప్రవేశం ఉంది. వెయ్యికి పైగా వున్న విద్యార్థులలో అత్యధికులు పౌరవిద్యార్థులే

పెషావర్ నరమేధానికి బాధ్యత తనదేనని చెప్పుకున్న టి.టి.పి. (తెహ్రీక్-ఎ-తాలిబన్ పాకిస్తాన్) ఏడేళ్లుగా ఇక్కడ పాతుకపోయింది. ఆఫ్ఘాన్‌లో అమెరికా జోక్యాన్ని వ్యతిరేకించిన 13 పాకిస్తానీ తీవ్రవాద సంస్థలు టి.టి.పి. ఛత్రం కింద ఏకమయ్యాయి. 2007డిసెంబరులో దీనిపేరు వెలుగులోకి వచ్చింది. 2009లో అమెరికా జరిపిన డ్రోన్ దాడుల్లో టి.టి.పి. అధినేత మసూద్ మరణించాడు. 2008 జూలై 7న భారత రాయబార కార్యాలయంపై ఆత్మాహుతి బాంబుదాడితో 58 మంది మృతి చెందారు 141 మందికి తీవ్ర గాయాలు అయ్యాయి. ఆఫ్ఘాన్ ప్రభుత్వంతో తమ డిమాండ్లు నెరవేర్చుకోవడం కోసం దక్షిణ కొరియాకు చెందిన 23 మందిని తాలిబన్ బందీ చేసింది. తాలిబన్ డిమాండ్లను ఆఫ్ఘాన్ ఒప్పుకోకపోయేసరికి వారిని చంపేసింది. 2008 కాందహార్‌లో ఆత్మాహుతి బాంబుదాడిలో 80 మందికి పైగా మృతి చెందారు. నవంబరు 2న వాఘా సరిహద్దు ఘటన కూడా ఒకటి. పాక్ సైన్యం లక్ష్యంగా జరిగిన ఈ దాడిలో 60 మంది మరణించారు. 2014, ఫిబ్రవరిలో కాబూల్‌లోని ఓ రెస్టారెంట్‌పై తాలిబన్ ఆత్మాహుతి బాంబుదాడి 13 మంది విదేశీయులు మృతి. 2015 జనవరి 7న ఫ్రాన్స్‌లో 'చార్లీ హెబ్డో' వార్తాపత్రిక కార్యాలయంపై అల్‌ఖైదా తీవ్రవాదులు దాడి చేసి 12 మందిని హత్య చేశారు. మృతుల్లో ప్రధాన సంపాదకుడు స్టీపెన్ ఛార్బొనైర్, వ్యంగ్య చిత్రకారులు కాబు, టిగ్నస్, వోలిన్‌స్కీ ఇద్దరు పోలీసు అధికారులు ఉన్నారు. ఆఫ్ఘాన్‌లో నాటో కూటమికి వ్యతిరేకంగా పోరడటానికి మిలిటెంట్లను సమీకరించడమూ, పాకిస్తాన్‌లో సైన్యానికి వ్యతిరేకంగా ఆత్మరక్షణ పోరాటమనే లక్ష్యాలతో అది పనిచేస్తున్నది. పాక్ మాజీ ప్రధాని బెనజీర్ భుట్టో హత్యలోనూ టి.టి.పి. ప్రమేయం ఉందన్న అనుమానాలు లేకపోలేదు. ఈ ఏడాది మార్చిలో ప్రభుత్వం వీరితో చర్చలు జరిపినా ఫలితం లేకపోయింది. జూన్ ఎనిమిదిన కరాచీలోని జిన్నా అంతర్జాతీయ విమానాశ్రయంపై దాడులకు తెగబడి దాదాపు 28 మందిని పొట్టనబెట్టుకుంది. ఈ నేపథ్యంలో ఉత్తర వజీరిస్తాన్‌లోని గిరిజన ప్రాంతాల్లో ఉగ్రవాదులను మట్టుబెట్టేందుకు జర్బ్-ఎ-అజ్బ్

పేరుతో గత కొంతకాలంగా పాక్ సర్కార్ సైనికచర్యను కొనసాగిస్తోంది. ఇప్పటి వరకు ఈ దాడుల్లో 1300 మందికి పైగా హత్యలైనట్లు అంచనా భారత్ అఫ్ఘానిస్తాన్ విధ్వంసానికి పాల్పడుతున్న లష్కరే తొయిబా ముజాహిదిన్, జైషే మహ్మద్, ఇండియన్ ముజాహిదీన్ వంటి సంస్థలకు పాక్ సైన్యం ఐఎస్ఐ తెరవెనుక దండిగా సాయమందిస్తున్నాయి. అదే సమయంలో ఉత్తర వజీరిస్తాన్‌లోని టీటీపీ పై మాత్రం ఉక్కుపాదం మోపుతున్నాయి. ఈ మారణకాండను పెద్ద ఎత్తున ప్రచారం చేసిన ప్రచార సాధనాలు, పాకిస్తాన్‌లో గత ఆరునెలలుగా సాగుతున్న మరొక యుద్ధం గురించి వార్తలు ఇవ్వటంలేదు. గత జూన్ నెల నుండి అమెరికా సామ్రాజ్య వాదుల ఆజ్ఞల మేరకు, అమెరికా గూఢచారి సంస్థ ఆధ్వర్యంలో పాకిస్తాన్ సైన్యం టెర్రరిస్టుల ఏరివేత పేరిట ఉత్తర వజీరిస్తాన్ ప్రాంతంలో దాడులు సాగిస్తున్నది. దీనికి మద్దతుగా అమెరికా సైన్యం పైలెట్లు లేని విమానదాడులతో గ్రామాలపై బాంబుల వర్షం కురిపిస్తున్నది. జూన్‌లో బాంబులు, ఫిరంగులతో దాడిచేసిన పాకిస్తాన్ సైన్యం మూడు రోజులు విరామం ప్రకటించి,48గంటలలోగా ప్రజలీప్రాంతాన్ని ఖాళీచేసి తరలిపోవాలని ఆదేశించింది. ఉండిపోయిన వారందరినీ టెర్రరిస్టులుగా పరిగణించి దాడులు చేస్తానని హెచ్చరించింది. 48గంటల గడువు ముగియగానే పాకిస్తాన్ సైన్యం గ్రామాలను నేలమట్టం చేసింది. ఆరునెలలుగా సాగుతున్న ఈ పాశవిక సైనిక దాడుల ఫలితంగా 10 లక్షలమంది ఎలాంటి ప్రభుత్వ సహాయమూ అందకుండా తలదాచుకుంటున్నారు. ఈ దాడులలో మహిళలు, పిల్లలు మృతిచెందారని ఐరాస నివేదిక తెలిపింది. ఈ మారణకాండ గురించి ఎవరూ మాట్లడటంలేదు. కారణం అఫ్ఘనిస్తాన్‌లో అమెరికా సైనిక దురాక్రమణనూ, అక్కడి అమెరికా తొత్తు ప్రభుత్వాన్ని ప్రజలు వ్యతిరేకించడమే.

ముగింపు : ఇరాక్‌లో ఇస్లామిక్ తీవ్రవాద దాడికి అధిక ప్రచారమిచ్చి దురాక్రమణను సమర్థించుకునేందుకు అమెరికా సామ్రాజ్యవాదం పూనుకుంది. టెర్రరిజంపై పోరు కొనసాగుతుంది. మన పిల్లల ప్రతి రక్తపుబొట్టుకూ ప్రతీకారం తీర్చుకుంటామని నవాజ్ షరీఫ్ ప్రకటించారు. పాకిస్తాన్‌కు అన్నివిధాలా సహాయమందించి టెర్రరిస్టులను అంతమొందిస్తామని ఒబామ ప్రకటించారు. ఈ దాడికి ప్రతిగా డిసెంబర్16 సాయంత్రం ఖైబర్ జిల్లాలో వైమానిక దాడులు సాగించినట్లు పాకిస్తాన్ సైన్యం ప్రకటించింది. తాలిబన్ దాడిని, ఐఎస్ఐఎస్‌ను సాకుగా చూపి పశ్చిమాసియా నుండి ఉపసంహరించుకున్న సైనిక దళాలను పెంచడానికి అమెరికా సిద్ధమవుతున్నది. అమెరికా సామ్రాజ్యవాదుల మద్దతుతో పాకిస్తాన్ సైన్యం సాగిస్తున్న మారణకాండతో పాకిస్తాన్ రక్తసిక్తమౌతుంది. గత 30ఏళ్లుగా ఎందుకు పాకిస్తాన్ రక్తమోడుతున్నది. 1980 అఫ్ఘనిస్తాన్‌లో రష్యా అనుకూల ప్రభుత్వాన్ని కూలదోసేందుకు అమెరికా సామ్రాజ్య వాదమూ, పాకిస్తాన్ ప్రభుత్వమూ అఫ్ఘనిస్తాన్ ముజాహిదీన్‌లను మతోన్మాద ప్రాతిపదికను ప్రోత్సహించాయి. ధనమూ, ఆయుధాలు అందించాయి. పాకిస్తాన్‌లో శ్రామికుల, ప్రజాస్వామిక శక్తులను అణచివేసాయి. ముస్లిం మతోన్మాదాన్ని పెంచాయి. ఆనాటి పాకిస్తాన్ పాలకుడు జియా ఉల్ హక్‌కు అన్నిరకాలుగా అమెరికా సామ్రాజ్యవాదం మద్దతు ఇచ్చింది. పాక్ ప్రభుత్వ ద్వంద్వ విధానాలు ఉగ్రవాదానికి ఊతమిస్తున్నాయి. మంచి ఉగ్రవాదులు, చెడ్డ ఉగ్రవాదులు అంటూ వర్గీకరణ చేయడం, విభజించి చూడటం, విచక్షణ పాటించడం వంటి అపరిపక్వ విధానాల వల్ల సమస్య మరింత తీవ్రమవుతోంది. ఈ విధానమే తాలిబన్ తదితర ముస్లిం టెర్రరిస్టు సంస్థలను సృష్టించింది. వాటిని పెంచి పోషించింది సామ్రాజ్యవాద దేశాలే. పశ్చిమాసియా, ఉత్తరాఫ్రికా దేశాలన్నిటా వీటిని విస్తరింపజేసింది, ముస్లిం టెర్రరిస్టు సంస్థలను దేశభక్తులుగా చిత్రించి, వారి రక్షణకంటూ ఆ దేశాలపై సైనిక దురాక్రమణలకు అమెరికా పాల్పడింది. నియంతల పాలన, నియంతృత్వ పాలన ఉన్న దేశాలలోనే తీవ్రవాదం పెరిగింది. ప్రజాస్వామ్య వ్యవస్థలు బలహీనపడిన నేపథ్యంలోనే తీవ్రవాదం పట్ల ప్రజలకు సానుభూతి పెరిగింది. అందువలన తీవ్రవాదంపై పోరాటం కాకుండా తీవ్రవాదానికి మూలమైన సామ్రాజ్యవాదంపైన పోరాటాలు ఎక్కుపెట్టాలి.

ప్రపంచాధిపత్యస్థాపనకు అమెరికా సామ్రాజ్యవాదం, కొనసాగించిన, సాగిస్తున్న వ్యూహమిది. తాను పెంచి పోషించిన తీవ్రవాదంపై పోరు సాకుగా చూపి అమెరికా సామ్రాజ్యవాదం తన సైనిక దురాక్రమణలను సమర్థిస్తున్నది. ఈ దురాక్రమణలను వ్యతిరేకిస్తున్న శక్తులను టెర్రరిస్టులుగా చిత్రించి దాడులు చేస్తున్నది. పైలెట్లులేని విమానాలతో దాడులుచేసి వేలాదిమంది అఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్, యెమెన్ పౌరులను బలిగొన్న అమెరికా, తీవ్రవాద సంస్థలకు ఆయుధాలు, డబ్బులు కుమ్మరించి ఐఎస్ఐఎస్ సృష్టికి కారణమైన తానే ఈ టెర్రరిస్టు దాడిని ఖండించటం అసంబద్ధం. అందువల్ల తీవ్రవాద సంస్థల సృష్టికి కారణమైన నేర సామ్రాజ్యాధిపతి అమెరికానే అసలు ముద్దాయి. ప్రపంచ వ్యాప్తంగా ఇస్లాం తీవ్రవాదాన్ని ప్రచారం చేసి ఇప్పుడు ప్రపంచం ఎదుట నేరస్తురాలిగా నిలబెట్టింది. తన చమురు దాహం కోసం, ఆయుధ వ్యాపారం కోసం, ప్రపంచ వనరులపై ఆధిపత్యం కోసం, ప్రపంచ మార్కెట్ కోసం రెండవ ప్రపంచ యుద్ధం నాటి నుండి తాను పెంచి పోషించిన తీవ్రవాదం సాకుతోనే ఇరాక్, అఫ్ఘన్, లిబియాలపై దురాక్రమణ చేసింది, సిరియా, పాలస్తీనా, ఇరాన్ వంటి దేశాల మీద దాడులతో పరోక్షంగా మరికొన్ని తీవ్రవాద సంస్థలు పుట్టుకొచ్చాయి. అరబ్ ప్రపంచం అంతా ఏకమై నిలవకుండా సున్నీలు, షియాలుగా విభజించి పాలించడం అమెరికా ఎత్తుగడ, సమాజం నియంత్రణ నుంచి చమురు ప్రాంతాలను విడగొట్టి తమ చెప్పు చేతల్లో పెట్టుకోవాలనేది కూడా అమెరికా వ్యూహం. ఇందులో భాగంగానే అరబ్ ప్రాంతంలో సున్నీ, షియా విభేదాలను తీవ్ర స్థాయికి చేర్చింది. సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమాన్ని జాతుల, ఉపజాతుల ఉద్యమంగా మలిచే కుట్రలు అమెరికా పశ్చిమ దేశాలు చేస్తున్నాయి. నారుపోసి నీరు పోస్తూ సామ్రాజ్యవాదులు సృష్టించే మత మారణ హోమం నుంచి ముస్లిం ప్రపంచం బయట పడాలి. సామ్రాజ్యవాద జ్యోక్యాన్ని, కుట్రలను ఓడించడం ద్వారానే పశ్చిమాసియాలో, మధ్య ఆసియాలో శాంతి నెలకొంటుంది. అందుకు బుద్ధిజీవులు, లౌకిక ప్రజాస్వామిక వాదులు సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమాలను నిర్మించాల్సిన కర్తవ్యాన్ని స్వీకరించాల్సి ఉంది.



(అయిపోయింది)

సిద్ధాంత వ్యాసం

*(ఈ రెండు ఉపన్యాసాలు నేను వెతికిన మేరకు తెలుగులో లేవని అర్థమైంది. ఇందులోని విషయాలు విప్లవ రచయితలుగా మనకు ఎంతో అవసరమైనవిగా తోచాయి. అంతే కాక మోడీ నేతృత్వంలో బహుళజాతి కార్పొరేషన్లకు దేశాన్ని అమ్మేయడం, మరో వైపు హిందుత్వ ఫాసిస్టు దాడి సమాజంలోని పీడిత వర్గాలు, సెక్షన్లు అన్నిటి పై రోజురోజుకూ పెరుగుతున్న నేపథ్యంలో, జపాన్ చైనాను ఆక్రమించుకున్నలాంటి స్థితి కాకపోయినప్పటికీ ఐక్య సంఘటన విషయంలో ఆయన చెప్పిన అంశాలు ఆ దాడికి వ్యతిరేకంగా కళాకారులు, రచయితల ఐక్య సంఘటనను నిర్మించడం విషయంలో ఉండదగిన వైఖరికి అన్వయించుకోవడానికి ఉపయోగపడతాయి అనిపించడం కూడా అనువాదం చేయడానికి కారణం. విప్లవ రచయితలు కామ్రేడ్ మావో ఇందులో ప్రస్తావించిన అన్ని అంశాలను లోతుగా అర్థం చేసుకునే ప్రయత్నం చేయాలనే ఆకాంక్షతో... .. అనువాదకురాలు)*

# లూసున్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ వద్ద మావో ప్రసంగం

## ఏప్రిల్ 28, 1938

- ఇంగ్లిషు నుండి అనువాదం : షహీదా

మీరు నన్ను కొన్ని వ్యాఖ్యానాలు చేయమని అడిగారు. కానీ నాకు కళల గురించి ఎక్కువ తెలీదు కనుక, నేను మీరు పరిగణనలోకి తీసుకోవడానికి కొన్ని పై, పై ముడి భావనలు మాత్రమే ముందుంచగలను.

1. కళల పట్ల మన భావాలు ఎలా ఉండాలి? ఈ విషయంపై చైనాలో ఒకప్పుడు తీవ్రమైన వాదోపవాదాలు నడిచాయి. క్షు ఝిమాల్ ఒకప్పుడు ఏమన్నాడో మీకందరికీ తెలిసి ఉండచ్చు. 'నిశ్శబ్దమైన లోయలో వెండి సూదిలా మోగాలి కవిత్వం' అన్నాడు. నిశ్శబ్దమైన లోయలో వెండి సూది ఎలా మోగుతుందో నాకు తెలీదు. కానీ, క్షు గారు అన్నిటికంటే ఉన్నతమైన స్థానంలో ఉంచడంలో నమ్మకం కలిగి ఉండేవారని నాకు తెలుసు. ఆ రోజుల్లో చాలామందికి ఆయనకున్న లాంటి భావాలే ఉండేవి. ఆయన ఆ ఆలోచనాధారకు (స్కూల్ ఆఫ్ థాట్) ప్రతినిధి. మరో ఆలోచనాధారకు ప్రతినిధి లూసున్. ఇది మార్క్సిస్టు కళా సిద్ధాంతంలో విశ్వాసమున్నవారితో కూడుకున్నది. ఈ రెండు ఆలోచనాధారల మధ్య సైద్ధాంతిక విభేదాల చరిత్ర సుదీర్ఘమైనది. దాని గురించి నేనిక్కడ వివరంగా మాట్లాడలేను. కళల్ని అన్నిటికంటే ఉన్నతమైన స్థానంలో ఉంచాలనేది భావవాద సిద్ధాంతం. అది సరైనది కాదు. అయితే ప్రస్తుతం మనకు జపాన్ వారిని ప్రతిఘటించడానికి కళాకారుల సర్కిల్స్ మధ్య కూడా ఐక్య సంఘటన అవసరం. లూసున్ చెప్పినట్టే, వాస్తవవాదులు గానీ, రొమాంటి సిస్టులు గానీ, కమ్యూనిస్టులు గానీ, ఇంకెవరైనా గానీ, మనందరం జపాన్‌ను ప్రతిఘటించడానికి ఐక్యమవ్వాలి. మనకు సంబంధించినంత వరకూ కళల్లో రాజకీయ స్వతంత్రాన్ని నిలిపి ఉంచుకోవడం అవసరం అనేదాంట్లో సందేహం లేదు. మన కళారంగంలో మన రాజకీయ వైఖరి ఎట్టి పరిస్థితిలోనూ వదులుకోలేం. అందుకని మన ఈ కళా అకాడమీకి దాని స్వంత రాజకీయ వైఖరి దానికుండాలి. కళా సిద్ధాంతానికి సంబంధించిన విషయంలో మనం మార్క్సిస్టులం. మనం కళల్ని అన్నిటికంటే ఉన్నతస్థానంలో ఉంచాలనే కోవకు చెందం. మనం కళలోని వాస్తవికతను విశ్వసిస్తాం. దానర్థం కేవలం జమా ఖర్చులను రాసినట్టుగా ప్రకృతిని అనుకరించేలాంటి 'వాస్తవకత'ను మనం ప్రోత్సహిస్తామని కాదు. ఎందుకంటే కళ ప్రకృతిని నకలు చేయలేదు. కళలో రొమాంటిసిజం ఏ విధంగానూ మొత్తంగా తప్పు కాదు. అందులో అనేక రకాలవి ఉన్నాయి. అందులో క్రియాశీలమైన, విప్లవకర రొమాంటిసిజం ఉన్నది. అలాగే క్రియారహితమైన ప్రతీఘాతుక రొమాంటిసిజం ఉన్నది. కొంతమంది ఒక్కో వాక్యాన్నీ చదువుతూ వివరిస్తారు. వారు రొమాంటిసిజంను చిన్న చూపు చూస్తారు. అందులో గాలి, పువ్వులు, మంచు, చందమామా, అన్నలూ, అక్కలూ తప్ప ఏం లేవని వాళ్ళు నమ్ముతారు. క్రియాశీలమైన రొమాంటిసిజంలో ఉన్న ప్రాథమికమైన స్పిరిట్ ఆనాటి స్థితి పట్ల అసంతృప్తి అనే విషయం పట్ల వారికి లేశమాత్రమైన అవగాహన కూడా లేదు. అది భవిష్యత్తును విప్లవోత్సాహంతో ఊహించడం. ఈ ఆలోచనాధార చరిత్రలో ఒకప్పుడు ప్రగతిశీల శక్తిగా ఉండింది. ఒక కళా సృజన కేవలం ఆనాటి స్థితినే నమోదు చేసి భవిష్యత్తులో ఒకాదర్శాన్ని అన్వేషించాలనే కోరికను కలిగి ఉండకపోతే అది ప్రజల్ని ముందుకు పోయేలా ప్రోత్సహించలేదు. ఏకకాలంలో వర్తమానంలో లోపాల్ని వెతకడం, భవిష్యత్తులో ఆశనూ, మహత్తరమైనదాన్నీ అన్వేషించడం – ఇదీ విప్లవ స్పిరిట్. మార్క్సిస్టులకు అవసరమైన స్పిరిట్ ఇదే.

చైనాలోని కళా సర్కిల్స్ లో మూడవ రకంగా పిలవబడేవాళ్ళు కూడా ఉండేవారు. కానీ మనం ఇప్పుడు వారిని కూడా మినహాయించం. మనం మొట్టమొదటి ప్రాధాన్యత ఇచ్చేది జాతీయ జపాన్ వ్యతిరేక ఐక్య సంఘటనకు. కళారంగంలో మన స్వంత రాజకీయ వైఖరిది దాని తర్వాతి స్థానం మాత్రమే. ప్రతీ కళా పాఠశాలకూ దాని స్వంత వైఖరి ఉంటుంది. మనం కార్మికవర్గం వైపు, శ్రామిక ప్రజల వైపు నిలుస్తాం. కానీ ఐక్య సంఘటన మార్గదర్శక సూత్రం కింద మనం మార్క్సిజాన్ని ఇతరుల్ని మినహాయించడం కోసం వినియోగించం. మినహాయించడం అంటే తలుపులు మూసుకునే వైఖరి, ఐక్య సంఘటన అవ్వదు. అయినప్పటికీ ఈ ఐక్య సంఘటన లోపల మనం వైఖరిని వదులుకోకూడదు. ఇదీ లూసున్ వైఖరి. మీ లూసున్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ ఆయన వైఖరిని అవలంబించాలి.

2. ఒక కళా సృజనలో సారం ఉండాలి. అది కాలం చేసే డిమాండ్లను, ప్రజల డిమాండ్లను తీర్చగలగాలి. ఒక మంచి భోజనంలా, ఒక కళాసృజన కూడా పోషక విలువలతో కూడి ఉండాలి, రుచిగానూ ఉండాలి. వండడంలోనూ, తినడంలోనూ చైనా ప్రజల్ని మించినవాళ్లు లేరు. మనం వంట చేసినప్పుడు మనం వంటకంలో వేసే అన్ని

దినుసులనూ సరైన పాళ్ళలోనే వేస్తాం - నూనె, ఉప్పు, అన్ని రకాల మసాలాలూ. నైపుణ్యంగా వంట చేసాక ఒక ముక్కుపుటాల నెగరేసే వాసన పైకి ఎగుస్తుంది. అందులోని పోషక విలువలు కూడా ఎటూపోవు. సుదీర్ఘకాలం ప్రాక్టికల్ అనుభవం ద్వారా మంచిగా ఎలా వండాలో గొప్ప వంటవాళ్ళు నేర్చుకుంటారు. అంతేగానీ ఒక రోజు చదివేసి కాదు.వాళ్ళు ఇతరులు వాడే దినుసులనే వాడతారు. అయినప్పటికీ అద్భుతమైన రుచుల్ని సృష్టించగల్గుతారు. దీన్ని సాధించాలంటే మసాలాలను సమపాళ్ళలో వేయడం, వంట చేసే సమయం, ఎంత వేడి మీద వండాలి అనేవాటి మీద పట్టు నంపాదించాలి. కళల్ని అన్నిటికంటే ఉన్నతస్థానంలో ఉంచాలనుకునేవారు కేవలం రుచికరంగా ఉండడం అనే అంశం పైనే శ్రద్ధ వహిస్తారు. అది పోషక విలువలు కలిగి ఉందా లేదా అనేది వారికనవసరం. ఫలితంగా, వారి సృజనల్లోని సారం తరచూ డొల్లగా, హానికరంగా ఉంటుంది. కళ పోషకాహార విలువల్ని నొక్కి వక్కాణించాలి. అంటే దానిలో మంచి సారం ఉండాలి. అది కాలమూ, ప్రజలూ చేసే డిమాండ్లను నెరవేర్చేదిగా ఉండాలి. ఉదాహరణకు, బీజింగ్ ఒపెరానే తీసుకుందాం. నేడు 'ఒక ప్రశాంతమైన కల' వంటి ఒపెరాలకు సంబంధించిన ప్రకటనలు మనకు కనిపించవు. ఎందుకంటే అలాంటి ఒపెరాల టిక్కెట్లు అమ్ముడుపోవు. నేడు పాత ఒపెరాలను ప్రదర్శించేటప్పుడు మనం జాతీయ నాయకులను చిత్రీకరించే లేదా శత్రువును ప్రతిఘటించే ప్రదర్శనలను పెంచాలి. కాలం వీటినే డిమాండ్ చేస్తున్నది. కళా సృజనలు కదిలించే చిత్రాలనూ, విషయాల్నీ కూడా కలిగి ఉండాలి. అవి వాస్తవ జీవితానికి దగ్గరగా ఉండాలి. లేకుంటే ఎవరూ వాటిని చూడాలనుకోరు. ఒక కళా సృజనలో అడ్డదిడ్డంగా అమూర్త భావనలను నింపేయడం ప్రజల్ని ఎన్నడూ ఆకట్టుకోలేదు.

3. లూసున్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ గొప్ప ఆదర్శాలు, గొప్ప జీవితానుభవాలు, అద్భుతమైన కళానైపుణ్యాలూ గల ఒక కళాకారుల బృందానికి శిక్షణ నివ్వాలి. సామాజిక జీవితాన్ని నమోదు చేయడం మాత్రమే తెలిసిన కళాకారులుగా మీరు తయారు కాకూడదు. మీరు నూతన చైనా కోసం కఠోరశ్రమ చేయాలనే గొప్ప ఆదర్శాన్ని కూడా కలిగి ఉండాలి. అంటే, మీరు జపాన్‌ను ప్రతిఘటించడమే కాదు, ప్రతిఘటనా యుద్ధక్రమంలో ఒక నూతన ప్రజాస్వామిక రిపబ్లిక్‌ను నిర్మించడానికి కూడా పాటుపడాలి. మీరు ప్రజాస్వామిక రిపబ్లిక్ కోసం పని చేయడమే కాక, సోషలిస్టు ఆ తర్వాత కమ్యూనిస్టు ఆదర్శాలను సాకారం చేయడం కోసం కూడా పని చేయాలి. అటువంటి గొప్ప ఆదర్శాలు లేకుండా, గొప్ప కళాకారులుగా మారడం అసాధ్యం. కానీ ఆదర్శాలు మాత్రమే సరిపోవు, మీకు సుసంపన్నమైన జీవితానుభవమూ, అద్భుతమైన కళా నైపుణ్యమూ కూడా ఉండాలి. గత కొద్ది సంవత్సరాలుగా చైనాలో గొప్ప కళా సృజన ఏదీ జరగకపోవడం అనే వాస్తవం ఖచ్చితంగా వస్తుగత సామాజిక కారణాలవల్లే జరిగింది. కానీ కళాకారులకు సంబంధించినంత వరకూ, ఈ మూడు ప్రమాణాల్నీ నెరవేర్చగలవారు అతి తక్కువ సంఖ్యలో ఉండడం కూడా దీనికి దారి తీసింది. మన రచయితలు చాలా మంది గొప్ప ఆదర్శాలు కలిగి ఉన్నారు, కానీ వారికి సుసంపన్నమైన జీవితానుభవం లేదు. వారిలో శక్తివంతమైన కళా నైపుణ్యాలు గల వారి సంఖ్య కూడా ఎక్కువేం లేదు. ఈ మూడు ప్రమాణాల్లో ఏ ఒక్కటి లోపించినా మీరు గొప్ప కళాకారులు కాలేరు.

'విధ్వంసం చేయి' అనే రచనకు రాసిన వెనుకమాటలో లూసున్ అన్నట్లు దాని రచయిత (అలెక్సాండ్ర్ అలెక్సాండ్రొవిచ్) ఫదేవ్‌కి స్వయంగా గెరిల్లా యుద్ధ అనుభవం ఉంది. అందుకని గుర్రాలకు శిక్షణ నిచ్చే విషయంలో అతను చేసిన వర్ణన ఒక నిపుణుడిది. లూసున్ వలెనే, ఫెదేవ్ గుర్రం మీదకు ఎలా ఎగిరి దూకుతారు అనే విషయంలో చిన్న, చిన్న వివరాలను కూడా గమనించాడు. ఈ కథ మనకు గొప్ప రచయితలు ఇంట్లో కూచోరనీ, తమ ఊహలపై ఆధారపడి రచనలు చేయరనీ తెలుపుతోంది. అలా రాసిన రచనలు ఎందుకూ కొరగానివి. చాలా మంది నేడు 'ది డ్రీం ఆఫ్ ది రెడ్ చాంబర్' అనే నవలను చిన్న చూపు చూస్తున్నారు. నిజానికి వారు దాన్ని ప్రస్తావించడానికి కూడా ఇష్టపడ్డం లేదు. ప్రత్యేకించి అందులో అపారమైన సామాజిక, చారిత్రక అంశాలున్నాయి. ఉదాహరణకు అందులో క్సు పాన్ ను ఓడించేశాక లియు క్వియాంగ్‌లిన్ ఎలా 'గుర్రాన్ని విడిచి దాని మీదకు ఎగిరి దూకాడు' అనే దాన్ని (ఇంగ్లిషులో 'వాల్టెడ్ ఇంటూ ది సాడిల్' అని ఉంది - అను) రాసాడు. వాస్తవ అనుభవం లేకుండా 'వాల్టెడ్ ఇంటూ ది సాడిల్' అనే పదబంధాన్ని ఎవరూ రాయలేరు. స్వయంగా దేన్నైనా అనుభవించకుండా ఎవరూ ఏ విషయాన్ని మంచిగా తెలుసుకోలేరు. ప్రతీదీ, అది ఎంత అల్పమైనదైనప్పటికీ, సుసంపన్నమైన సారాన్ని కలిగి ఉంటుంది. దాన్ని వాస్తవ జీవితానుభవం ద్వారా మాత్రమే తెలుసుకోగలం. మీరు యువ కళా కార్యకర్తలు. మొత్తం ప్రపంచం మీదే. ఇది మీ కార్యక్షేత్రం. మీ కళలో సంపన్నమైన సారం ఉండాలని మీరు కోరుకుంటే, మీరు వాస్తవ జీవితం నుండి సుసంపన్నమైన పోషకాల్ని తీసుకోవాల్సి ఉంటుంది. మీరిక్కడే జీవితాంతం ఉండిపోయి అధ్యయనం చేయలేరు. అనతికాలంలోనే మీరు వేర్వేరు ప్రాంతాలకు వెళ్లిపోతారు. వాస్తవ పోరాటాల నడుమ ఉంటారు. మీరు పాడే 'గెరిల్లాల పాట' లోని పాదాల వలె - 'మనం ఎత్తైన కొండలకూ, లోతైన నదులకూ ఎలా వెరువగలం?' మీరు కేవలం ఈ మాటలను వల్లెవేయడం కాదు, ఆ విధంగా ఆచరించాలి కూడా. అపారమైన వాస్తవ జీవితానుభవం లేకుండా కళలో వాస్తవమైన సారం లేదు. ఒక అద్భుతమైన కళాఖండాన్ని సృష్టించడం కోసం మీరు ముందుగా వాస్తవమైన పోరాటాల ద్వారా మీ అనుభవాల్ని సుసంపన్నం చేసుకోవాలి. కళాకారులకు ఆదర్శాలు ఉండాలనేది నిజమే అయినప్పటికీ వాళ్ళు అనేక వివరాల్ని, గుర్రం మీదకు ఎగిరి దూకడం లాంటి వివరాల్ని, అధ్యయనం చేయాలి. గతంలో 'ది డ్రీం ఆఫ్ ది రెడ్ చాంబర్' చదివిన ఒకాయన తాను నిజంగా ప్రాస్పెక్ట్ తోటలో పర్యటించి సర్వే చేసానన్నాడు. మొత్తం చైనానే ఇప్పుడు మీ ప్రాస్పెక్ట్ తోట. ఇక్కడున్న యువ కళా కార్యకర్తలందరూ ఒక జియా బావోయు లేదా లిన్ దాయులే. మీరు మీ ప్రాస్పెక్ట్ తోటలో జీవించి, దాన్ని అధ్యయనం చేయాలి. మీ పనిలో, 'పెద్ద వృత్తం' మొత్తం చైనా. 'చిన్న వృత్తం' ఉటయ్‌షాన్ జిల్లా. చైనాను సర్వే చేసేటప్పుడు, కేవలం విలేకరి ఉపయోగించే శైలిని ఉపయోగిస్తే సరిపోదు. ఎందుకంటే విలేకరి రచన అటునుండి పోతూ రాసే రచనల గుణాన్ని కలిగి ఉంటుంది. ఒక పాత సామెత ఉంది. 'గుర్రం మీద స్వారీ చేస్తూ పువ్వుల కేసి చూడడాన్ని గుర్రాన్ని ఆపి పువ్వుల కేసి చూడడంతో పోల్చలేం. గుర్రాన్ని ఆపి పువ్వుల కేసి చూడడాన్ని గుర్రాన్ని దిగి పువ్వులను ఆస్వాదించడంతో పోల్చలేం' అని. మీరందరూ గుర్రాల నుంచి దిగి పువ్వుల్ని ఆస్వాదిస్తారని నేను ఆశిస్తాను.

ప్రజల్లోకి వెళ్ళడం మీ స్వంత జీవితానుభవాల్ని సుసంపన్నం చేయడమే కాక మీ కళా నైపుణ్యాల్ని కూడా మెరుగుపరుస్తుంది.

వేసవికాలం సాయంకాలాల్లో, రైతులు చల్లని ప్రదేశాల్ని చూసుకుని సేద తీరుతారు. వాళ్ళు పెద్ద ఆకుల విసనకర్రల్ని చేతుల్లో పట్టుకుని, బెంచీల మీద కూచుని కథలు చెప్పుకుంటారు. వారికా హు షిజీ 'ఎనిమిది కూడని పనుల' గురించి తెలుసు. వారు గొప్ప కావ్యాల గురించి పరోక్షంగా మాట్లాడరు కానీ వారి కథల్లోని సారం సంపన్నమైంది. వారి భాష ఎంతో మనోహరంగా ఉంటుంది. ఈ రైతులు వచన రచయితలే కాదు, కవులు కూడా. ఇక్కడేదో చాలా తప్పుగా అవుపడుతోంది. సుసంపన్నమైన జీవితానుభవం, మనోహరమైన పదాలు కల్గినవారు రాయలేకపోతున్నారు. రాయగల్గిన చాలామంది కేవలం పెద్ద నగరాల్లో మండపాల్లో కూచుని ఉంటున్నారు. వారికి సంపన్నమైన జీవితానుభవం లేదు. ప్రజల సజీవమైన భాషతో వారికి పరిచయం లేదు. గోర్కీ జీవితానుభవం అపార సుసంపన్నమైనదని మనకు తెలుసు. రష్యాఅట్టడుగు ప్రజల జీవితాలు, భాష ఆయనకు సన్నిహితంగా తెలుసు. అలాగే, ఇతర వర్గాల వాస్తవ స్థితిగతులు కూడా తెలుసు. అందుకే ఆయన అన్ని అద్భుతమైన కళాఖండాలను సృష్టించ గలిగాడు.

ప్రతి కళా కార్యకర్తా కళా నైపుణ్యాన్ని నేర్చుకోవాలి. శక్తి వంతమైన నైపుణ్యాలు లేకుండా మీరు సుసంపన్నమైన సారాన్ని వ్యక్తీకరించలేరు. ఇటువంటి నైపుణ్యానికి అనేక కోణాలుంటాయి. భాషపై పట్టు సంపాదించే సామర్థ్యం ఎంతో ముఖ్యమైనదే అయినప్పటికీ అది కేవలం భాషకు పరిమితమైనది కాదు. లూసున్ ప్రజల భాషను అధ్యయనం చేసి ఉంటాడని నాకనిపిస్తుంది. మీరు చాలా సమయం వెచ్చించి కళా నైపుణ్యాల్ని సంపాదించేందుకు కృషి చేయాలి.

గొప్ప కళాకారులు కావడానికి పైన చెప్పిన మూడు షరతుల్ని మీరు పరిపూర్తి చేయాలి. వాటిలో ఏ ఒక్కటి లేకున్నా నడవదు. ప్రస్తుతం మన యుద్ధరంగం నుండి రాస్తున్న కొందరి రచనల్లో సుసంపన్నమైన, వాస్తవమైన సారం ఉండట్లేదు. అవి వస్తుగత వాస్తవానికి తగినట్టు ఉండట్లేదు. వారి కళా నైపుణ్యాలు కొంత ముడిగా ఉంటున్నాయి. ఈ లోపాన్ని అధిగమించడానికి మనం తప్పనిసరిగా కృషి చేయాలి.

*దీనికి మూలం మావోజెడాంగ్ వెంజీ, సంపుటి 2, పేజీ 121-26, ఇందులో కేంద్ర ఆర్కైవ్స్ లో పదిలం చేయబడిన మావోఉపన్యాసం ముసాయిదా రికార్డు నుండి దీన్ని పునర్ముద్రించారు.*

1. *కు జెడ్‌జె: లిమో (1896-1931)* కొలంబియా, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయాల్లో చదువుకున్నాడు. ఆయన సోకాల్డ్ ఆధునిక కవిత్వ ఉద్యమం ఒకదాన్ని ఆరంభించాడు. దీని సభ్యులు సంప్రదాయ చైనా ప్రమాణాలతో కాక పాశ్చాత్య దేశాల ప్రమాణాలతో రాయాలని కోరుకునేవారు.
2. కావ్ క్సుకిన్, ది స్టోరీ ఎ/ది స్టోన్, అనువాదం, సంపాదకత్వం - *డేవిడ్ హాక్స్ (హార్మండ్స్‌వర్త్ పెంగ్విన్ బుక్స్, 1977) సంపుటి 2, పేజి.444. (ప్రొఫెసర్ హాక్స్ తన అనువాదానికి ఈ ప్రత్యామ్నాయాన్ని తీసుకున్నాడు. నవలకు ఈ శీర్షికే సరైనదని అంటారు)*
3. ది డ్రీం ఆఫ్ ఎ/ది రెడ్ చాంబర్‌లోని రెండు ప్రధాన పాత్రలు.
4. హు షి *( 1891-1962) గురించిన* ప్రస్తావన. పాత సాహిత్య భాష స్థానంలో వాడుక భాషను తీసుకురావాలనే తొలి ఉద్యమకారుల్లో ఒకడు, అత్యంత ప్రభావం వేయగల్గినవాడు. తొలినాళ్ళలో అతనితో మావో అనుబంధం గురించి తెలుసు కోవాలంటే 1, 2 సంపుటులను చూడాలి. ముఖ్యంగా సంపుటి 1, పేజి. 412. ఈ కాలంలో రాజకీయంగా వారిరువురూ భిన్న ధృవాల వద్ద నిలిచి ఉన్నప్పటికీ, చైనా సాహిత్య విప్లవంలో హు పోషించిన సానుకూల పాత్రను మావో ఇప్పటికీ గుర్తిస్తున్నాడు అనేది ఈ ప్రస్తావన స్పష్టం చేస్తోంది.

---

# లూసున్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్ స్థాపన గురించిన కథనం

ఫిబ్రవరి 1938 - మావో

మార్కోపోలో బ్రిడ్జి ఘటన తర్వాత నుండి చైనా ప్రజలు మన దేశ మనుగడ కోసం, దాని విముక్తి కోసం,జపాన్ సామ్రాజ్యవాద బందిపోట్ల దురాక్రమణను ఎదిరించడానికీ, వారిని చైనా నుండి తరిమికొట్టడానికీ, ప్రపంచ శాంతిని సంఘటితపరచడానికీ ఒక్క మనిషిలా లేచి పోరాడసాగారు. అంతిమ విజయం పొందేవరకూ పవిత్రమైన జాతీయ విప్లవకర జపాన్ వ్యతిరేక యుద్ధాన్ని కొనసాగించడానికై అన్ని పార్టీలూ, ఫ్యాక్షన్లూ, జపాన్ వ్యతిరేక ఐక్య సంఘటన కింద సమీకృతులయ్యారు.

ఈ ప్రతిఘటనా యుద్ధకాలంలో, ప్రస్తుతం ఉనికిలో ఉన్న మన శక్తుల్ని సమీకరించి ఉపయోగించడమే కాక, నూతన శక్తుల్ని వెదికి తయారు చేయాలి కూడా. అంటే మనం యుద్ధప్రయానకు అత్యవసరమైన కార్యకర్తలకు శిక్షణనివ్వడం అనే సమస్యపై మన దృష్టిని కేంద్రీకరించాలి. 'కార్యకర్తలే అన్నిటికీ నిర్ణాయకం'[1]. ఇది శాంతి సమయాల్లోనే కాదు, యుద్ధ సమయాల్లో కూడా చాలా తక్షణ సమస్యే. యుద్ధరంగంలో జపాన్ బందిపోట్లకు వ్యతిరేకంగా జరిగే రక్తసిక్తమైన యుద్ధంలోనూ, వెనుకతట్టు ప్రాంతంలో ప్రజల్ని సమీకరించే పనిలోనూ కూడా మనకు పదుల వేల సంఖ్యలో మిలిటరీ, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక కార్యకర్తలు అవసరమౌతారు. ఇందులో ఎటువంటి సందేహం లేదు.

కళలు - నాటకం, సంగీతం, లలితకళలు, సాహిత్యం - ప్రచార కృషిలో, ప్రజల్ని ఉత్తేజితుల్ని చేసి సంఘటితపరచడంలో అత్యంత ప్రభావవంతమైన ఆయుధాలు, సమకాలీన ప్రతిఘటనా యుద్ధంలో కళాకారులు అత్యవసరమైన శక్తి. అందుకని ప్రతిఘటనా యుద్ధం కోసం కళారంగంలో ప్రత్యేక కృషి సల్పగలిగిన కార్యకర్తలకు శిక్షణ గరిపే కర్తవ్యాన్ని మనం ఇకనెంత మాత్రం వాయిదా వేయలేం.

ప్రతిఘటనా యుద్ధం విషయంలో మన సరిహద్దు ప్రాంతం విద్యావంతం చేసే కృషిని క్రియాశీలంగా చేపట్టి ఎన్నో పాఠశాలల్ని నెలకొల్పింది. (ఉదా:కు చైనా దేశ జాపాన్-వ్యతిరేక రాజకీయ విశ్వవిద్యాలయం, ఉత్తర షాన్సీ పబ్లిక్ స్కూలు వంటివి). ఇవి యుద్ధానికి అవసరమైన సార్వత్రికమైన రాజకీయ, మిలటరీ కార్యకర్తలను తయారు చేయడానికి తగినవి. అయితే కళల్లో ప్రత్యేక కృషి సల్పే పాఠశాలలను నెలకొల్పడంలో గ్యాప్ ఉంది. అందుకని, మనం ఈ అకాడమీ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్‌ను నెలకొల్పాలనీ, అంతే కాకుండా దాన్ని చైనా అతి గొప్ప రచయిత అయిన అమరుడు లూసున్ పేరిట నెలకొల్పాలనీ

ఉత్తరం

# వీర బిడ్డలను కన్న తల్లులందరికీ వందనాలు

**- మల్లోజుల వేణుగోపాల్**

ప్రియమైన అమ్మకు,

వందనాలు.

ఈ రోజు 24 నవంబర్. నీ ప్రియమైన కొడుకు, మా ప్రియమైన పార్టీ నాయకుడు, నాకు అత్యంత ప్రేమాస్పదుడైన నా సోదరుడు కా. కోటన్న (మల్లోజుల కోటేశ్వర్లు) అమరుడై నేటికి మూడేళ్ళు నిండాయి. ఈ సందర్భంగా ముందుగా ఆయనకు వినమ్రంగా విప్లవ జోహార్లర్పిద్దాం.

ఇక పోతే, అమ్మా!

పత్రికా ముఖంగా నీకు నేను చాలా కాలం తర్వాత ఉత్తరం రాసే అవసరాన్ని మన జిల్లా (కరీంనగర్) ఎస్.పి.శివకుమార్, ఓ.ఎస్.డి. సుబ్బారాయుడు కల్పించారు. నీతో ఈ హంతకులు కౌన్సిలింగ్ జరపడాన్ని, నీకు వస్త్రాలు, పండ్లు స్వీట్లు కట్టబెట్టడాన్ని, నన్ను సోకాల్డ్ జనజీవన స్రవంతిలోకి రావాలని కోరడాన్ని నిర్ద్వంద్వంగా ఖండిస్తున్నాను.

ఆ రోజు అన్న అమరత్వ జ్ఞాపకాలతో ఉన్న నా చేతికి ఒక చిన్న పేపర్ క్లిప్పింగ్ అందింది. అది చదివాక నాలో రగిలిన భావాలను అక్షరాల్లోకి అనువదించలేనమ్మా! నీకు ఆ పోలీసు అధికారులు అందించిన గుడ్డలన్నీ, పండ్లన్నీ, స్వీట్లన్నీ నా ప్రియమైన వేలాది సోదరీ, సోదరుల నెత్తుటి మరకలు అద్దినవే! ఇలాంటి గుడ్డల పంపకం దండకారణ్యంలోనూ, దేశంలోని ఉద్యమ ప్రాంతాలంతటా జరుగుతోంది. కానీ ఎందరెందరో విప్లవ తల్లులు, అక్కాచెల్లెళ్ళు పోలీసుల కపట నాటకాలను అర్థం చేసుకొని, వారికి వెరవక వాటిని తమ కాలిగోటితో కాలదన్నుతున్నారు. తమ కడుపుల్లో చిచ్చు పెడుతోన్న ఖాకీలు తమను లోబరచుకోవడానికి ఆడుతున్న నాటకాన్ని ధృడంగా వ్యతిరేకిస్తున్నారు. ప్రాణాలకు తెగించి పోరాడుతోన్న మా బిడ్డలను కోట్ల రూపాయలతోనే కాదు, ఎంతటి కనకపు రాశులతోనూ ఎవరూ కొనలేరని ఘంటాపథంగా చెబుతున్నారమ్మా! పూర్తి స్వార్థంతో, ప్రాణభయంతో, తీవ్ర బలహీనతల నుంచి బయటపడలేని పిరికిపందలు, ద్రోహులు మా పార్టీపై బురద జల్లుతూ శత్రువు పాదాల ముందు చేరి చరిత్ర హీనులవుతున్నారమ్మా! కానీ మేం వేనవేల అమరుల వారసులం. అంతర్జాతీయ కమ్యూనిస్టు విప్లవ జెండాను తుదివరకూ ఎత్తి పడుతామనీ మా పార్టీ కార్యక్రమం ద్వారా ప్రజలకు హామీనిచ్చి పోరాడుతున్నవాళ్ళం. మేం ఈ మధ్యనే అత్యంత ఉత్సాహంగా విప్లవ ప్రజలతో పార్టీ పదేళ్ళ సంబరాలను జరుపుకున్నాం. ప్రపంచవ్యాప్తంగా అనేక దేశాల మావోయిస్టు పార్టీలు, విప్లవ కార్మికవర్గం భారత ప్రజాయుద్ధాన్ని బలపరిచారు. తమ పూర్తి సంఘీభావాన్ని ప్రకటించారు. వారందరికీ మా పార్టీ వినమ్రంగా అభినందనలు తెలుపుకొంది. ఇలాంటి పరిస్థితులన్నీ శత్రువుకు ఏనాటికానాడు మరింత కలవరాన్ని కలిగిస్తున్నాయి. వాటిలో భాగమే మోసకారి తీసి తూటాల ఖాకీ కౌన్సిలింగ్ అమ్మా!

అమ్మా!

2011 నవంబర్ 24 మా విప్లవోద్యమ చరిత్రలో ఎంతో తీవ్రమయిన దు:ఖదాయక దినంగా నిలిచపోయింది. ఆ రోజు నీ ప్రియపుత్రుడి అమరత్వ దినం. విగతజీవిగా నీ పుత్రుడు నీ చెంతకు చేరినపుడు పట్టరాని దు:ఖంతో నీవు వలవలా ఏడుస్తూనే, ఛిద్రమైన నీ కొడుకు పార్థివ శరీరాన్ని, క్షతవిక్షతమైన అంగాంగాన్ని కన్నతల్లి ప్రేమతో నిమురుతూనే మాకు నీవు పంపిన విప్లవ సందేశం ఆనాటి మా దండకారణ్య పార్టీ అధికార ప్రతినిధి కా. గుడ్సా ఉసెండి మాకందరికీ అందజేసాడు. ఆ ధైర్యం మాకెప్పటికీ ఆదర్శమేనమ్మా. నీ లాంటి వేనవేల విప్లవ మాతృమూర్తులు అందజేస్తోన్న ధైర్యసాహసాలు నిజమైన విప్లవకారులనెవరినీ తలలకు వెలలు ప్రకటిస్తోన్న ఖాకీల వేలం పాట పందేరానికి ఎన్నటికీ పరుగుపెట్టనీయవమ్మా! విప్లవం త్యాగాన్ని డిమాండ్ చేస్తుంది. దీర్ఘకాల ప్రజాయుద్ధం ధైర్యాన్ని పరీక్షిస్తుంది. మేం ఎత్తిపట్టిన ఆయుధం మార్క్సిజం-లెనినిజం-మావోయిజం. అది ఈ కుళ్ళు వ్యవస్థ విసురుతున్న సవాళ్ళన్నింటికీ జవాబునిస్తూ అంతిమంగా ఈ దోపిడీ వ్యవస్థ అంతానికి చరమగీతం పాడుతుంది. అందుకే విప్లవం జయిస్తుంది. ప్రజావీరులు మృత్యుంజయులని చరిత్ర చాటి చెపుతుంది. అమరుడు కోటన్న లాగే నీ చిన్న కొడుకు ప్రజలకు సేవ చేస్తాడనీ, విప్లవ విజయానికి తుది శ్వాస వరకు శత్రువుతో పోరాడుతాడనీ, ప్రజలకూ, విప్లవానికీ ద్రోహం తలపెట్టడనీ నీకు ఖచ్చితంగా తెలుసమ్మా!

---

నిర్ణయించాం. ఆ గొప్ప ఉపాధ్యాయునికి నివాళి అర్పించడం కోసమే కాక ఆయన తలుపులు తెరిచిన మార్గం గుండానే మనం పురోగమిస్తాం అని తెలియజేయడానికి కూడా మనం ఇలా నిర్ణయించాం.

లూసున్ అకాడమీ ఆఫ్ ఆర్ట్స్‌ను నెలకొల్పడం కష్టతరమైన కర్తవ్యం అని మనం లోతుగా గుర్తించాం. ఆ కర్తవ్యాన్ని మనం కొద్దిమందికున్న పరిమిత సామర్థ్యంతో ఏ మాత్రం నెరవేర్చలేం. అందుకని అకాడమీ సత్వరమే అభివృద్ధి చెందడం కోసం దేశంలోని అన్ని రంగాలలోని ప్రజలూ మనకు తక్షణం తమ సహానుభూతినీ, సహాయాన్నీ అందిస్తారని ఆశిస్తున్నాం. దేశ వీరోచితమైన ప్రతిఘటనా యుద్ధం విజయవంతంగా పురోగమించి చైనా నుండి జపాన్ బందిపోట్లను తరిమివేసి అంతిమ విజయం సాధించడంలో కూడా ఇది మనకు దోహదపడ్తుంది.

*(దీనికి మూలం మావో జెడాంగ్‌జీ, బుజువాన్, సంపుటి 5, పేజీ. 151-52. 1979లో చైనాలో ప్రచురితమైన డాక్యుమెంటరీ సంగ్రహంలో దీనిని పునర్ముద్రించారు)*

1. *ఆ కాలంలో సోవియట్ యూనియన్‌లో సోషలిజాన్ని అభివృద్ధి చేయడానికి అవసరమైన వాటిని దృష్టిలో ఉంచుకుని స్టాలిన్ ముందుకు తెచ్చిన కీలకమైన నినాదాల్లో ఇది ఒకటి.*



అయినప్పటికీ పత్రికాముఖంగా నన్ను ఇంటికి రావాలని నీవు కోరినట్లుగా వచ్చిన వార్తను పూర్తిగా నమ్మలేకపోతున్నాను. నీవిలా నిజంగా కోరేవుంటే, ఒత్తిళ్ళు కావాలి. తప్పుడు సమాచారం వృద్ధాప్యంలో ఉన్న నిన్ను ఇలా కోరేలా చేసినా నాకేమీ ఆశ్చర్యం అనిపించడం లేదు.

అమ్మా!

నీ జీవితంలో నీవు ఎన్నటికైనా ఖాకీల దాష్టీక చర్యలను మర్చిపోగలవా! అర్ధరాత్రి, చిమ్మ చీకట్లో మన ఇంటి తలుపులు టక... టక... టక బాదుతూ, బాపును బయటికి లాగి వీధి చివరిదాకా తీసుకువెళ్ళి స్వతంత్ర సమరయోధుడన్న కనీస గౌరవ మర్యాదలు పాటించకుండా అమానవీయంగా దుర్భాషలాడిన ఖాకీ దుర్మార్గాన్ని నీవెలా మర్చిపోగలవు? మన తాత-ముత్తాతల నాటి ఇల్లును మొదటిసారి ఖాకీలు కూలిస్తే తాటాకు గుడిసెలో గుట్టుగా మీరు సంసారం నెట్టుకు వస్తుంటే సహించని రాజ్యం, దాని పోలీసులు రెండవ విడత కూడా మన ఇల్లు కూల్చి గూడులేని పక్షుల్లా మిమ్మల్ని వీధిలోకి విసిరేసిన రోజులు మన ఇంట్లో ఏ ఒక్కరమైనా మర్చిపోగలమా? ఈ దుర్గతి మన ఒక్క కుటుంబానికే కాదమ్మా. 1980 వ దశకం నుండి మన జిల్లాలో ప్రతి విప్లవకారుడి కుటుంబం ఎదుర్కొన్నది. నా అత్యంత సన్నిహిత సహచరుడు, అమరుడు వడ్కాపురం చంద్రమౌళి తండ్రిని పోలీసులు చితకబాదితే ఆ వృద్ధాప్యంలో ఆయన చేయి విరిగి చివరి వరకూ పడిన బాధలు వర్ణనాతీతమమ్మా! ఈ పోలీసుల అరాచకాలు ఎంతని రాయగలమమ్మా! కానీ ఒక్క మాట మాత్రం స్పష్టంగా చెప్పగలను. వేలాది ప్రజల, విప్లవ యోధుల ప్రాణాలను బలిగొన్న, వందలాది మహిళలపై సామూహిక అత్యాచారాలు చేసి వారి జీవితాలను కడతేర్చిన, వేలాది కుటుంబాలను బుగ్గిపాలు చేసిన రాజ్యం, ఆ రాజ్యం సంరక్షణకు కంకణం కట్టుకున్న ఖాకీ ఉన్నతాధికారుల్లో ఒకనిగా ఎస్.పి.శివకుమార్ దసరా పండుగ రోజు నీకు అందజేసిన వస్త్రాలు, పండ్లు, 'తీపి' మాటలు చరిత్రలో రక్తాక్షరాలతో శాశ్వతంగా చోటు చేసుకున్న ఏ వీరమాత కడుపుకోత గాయాన్నీ మాన్పలేవనీ నిర్ద్వంద్వంగా చెప్పగలను. కొత్త బట్టలు నీ చేతికి అందజేసినా నీ జీవితాన్నీ, నీలాంటి ఎందరెందరో తల్లుల జీవితాలను మార్చే శక్తి వాళ్ళిచ్చిన వస్త్రాల్లో లేదమ్మా.ఆ శక్తి విప్లవానికే ఉందమ్మా. శ్రమజీవుల చెమట నెత్తుర్లను పిండుకు తాగే దోపిడీ పాలకవర్గాలూ, వారిని కాపాడే రాజ్యం, దాని బంట్లు అందజేసే ముష్టి వస్త్రాల కోసం, పండ్ల కోసం, స్వీట్ల కోసం నా తల్లులెవరూ అంగలార్చడం లేదు. ఏ తల్లీ ఖాకీల కపటనాటకానికి కడుపున పుట్టిన బిడ్డలను ఫణంగా పెట్టలేదని చెప్పమ్మా! నీ కొడుకు కోటన్నను హత్యచేసిన వారిని, వారిలాంటి శివకుమార్‌ను నిలదీయాలమ్మా! మీరంతా కాంక్షించేది విప్లవమేననీ మేమంతా ఘంటాపథంగా చెప్పగలం. నీవు గతంలో మీడియా మిత్రులతో పలుసార్లు 'నా కొడుకులు లంగతనం చేయడం లేదు, దొంగతనం చేయడం లేదు, కన్నవాళ్ళకు తలవంపులు తెచ్చే ఏ పనులూ చేయడం లేద'ని కుండబద్దలు కొట్టినట్టు చెప్పిన విశ్వాసం, మానసిక ధైర్యం నీది. బావుందమ్మా! అది మాకు తెలుసు. మీ పిల్లలుగా మేం వాటికెప్పుడూ ద్రోహం తలపెట్టమని అమరత్వంతో అన్న నిరూపించగా ఆయన ఆదర్శాలనూ, పార్టీ లక్ష్యాన్నీ, అంతర్జాతీయ శ్రామిక జెండాను తుది వరకు ఎత్తిపడుతాననీ నేను హామీనిస్తున్నాను.

అమ్మా!

నేను నీ దగ్గర పెరిగిన దానికన్నా రెట్టింపు కాలంగా నీలాంటి వేనవేల తల్లుల మధ్య జీవిస్తున్నాను. వారంతా మా పార్టీని తమ కంటికి రెప్పలా కాపాడుకుంటున్నారు. మా పార్టీని కాపాడుకోవాలనీ ఎనలేని త్యాగాలు చేస్తున్నారు. ఈ మధ్య జరిగిన ఒక వాస్తవ ఘటనను చెప్పనా అమ్మా! అమ్మలకే తెలుసు అమ్మతనం అనే నమ్మకంతో అర్థం చేసుకుంటావన్న విశ్వాసంతో రాస్తున్నాను. మా కామ్రేడ్స్ అడవిలో ఒకచోట డేరా వేసారు. ఆ వైపే ఖాకీలు పెద్ద సంఖ్యలోగాలింపు చర్యలకు బయలుదేరాయి.ఈ విషయం పసిగట్టిన ఒక చంటిపాప తల్లి పరుగు పరుగునా కామ్రేడ్స్ ఉన్న డేరా వైపు రాసాగింది. దట్టమైన అడవి, కొండల దారి, వర్షాకాలం, అయినా ఆ యువతి పరుగులాంటి నడకతో వస్తూ దారిలో పోలీసులకు దొరికిపోయింది. ఇంకేం అక్షరాల్లోకి తర్జుమా చేయలేని విధంగా ఆమెను ఆ ఖాకీలు వేధించారు. అందులో కోబ్రాలు మరీ పాశవికంగా వ్యవహరిస్తారన్నది జగమెరిగిందే.ఆమెను వాళ్ళెంతగా వేధించినా, ఆ యువతి మనసులోని ఏకైక లక్ష్యం - ఖాకీల కబురు కామ్రేడ్స్‌కు చేరవేసి కామ్రేడ్స్‌ను కాపాడుకోవడం. ఆమెను గట్టిగా అదిమిపట్టి ఆమె వక్షస్థలం పైకి వంగుతున్న పోలీసుల చెర నుండి తప్పుకోవడానికి చేసిన తీవ్ర పెనుగులాటలో తన శక్తినంతా కూడదీసుకొని ఆమె తన రెండు పాలిండ్లను బలంగా నొక్కడంతో చిమ్ముకొచ్చిన చనుబాల ధారలు సూదుల్లా వాళ్ళ కళ్ళల్లోకి దూసుకెళ్ళాయి. ఈ హఠాత్పరిణామంతో అవాక్కయిన పోలీసులు సదురుకొనేలోగా ఆ తల్లి వారి నుండి తప్పుకొని మా సహచరుల డేరాను చేరింది.ఖాకీలతో తాను ఎదుర్కొన్నదంతా పొల్లుపోకుండా చెప్పి ఊపిరి పీల్చుకుంది. ప్రజల ఈ అసమాన త్యాగాల ముందు మా ప్రాణత్యాగం ఏ లెక్కలోకీ రాదు. దారిలో ఆ మహిళకు జరిగిందంతా సున్నిత మనస్కులైన మా కామ్రేడ్స్ శ్రద్ధగా వినడంతో అందరి కళ్లూ చెమర్చాయి. పరమ నీచులు, ప్రజాద్రోహులు, నిలువెల్లా స్వార్థం నిండిన వంచకులు విప్లవానికి అపచారం చేసే ఖాకీల ముందు మోకరిల్లి, వారు విదిల్చే ఎంగిలి మెతుకులకు ఎగబడుతున్న వారెంతటి వారైనా ప్రజలు అసహ్యించుకుంటున్నారు. అలాంటి జీవితాలను మేం సనేమిరా కోరుకోవడం లేదమ్మా.

అమ్మా!

తెలంగాణ వచ్చిందని సంబరంగా ఉంది కదమ్మా. తెలంగాణ ప్రజల 60 సంవత్సరాల సంఘర్షణా ఫలం-ప్రత్యేక తెలంగాణ. వందలాది వీరకిశోరాల రక్తతర్పణం తెలంగాణ. అయితే అమ్మా మన ప్రజలు కోరుకొంది మాత్రం కేవలం నేటి ప్రత్యేక రాష్ట్రం లాంటిది మాత్రం కాదమ్మా. తెలంగాణ వస్తే భూమిలేని నిరుపేద రైతులు భూములు వస్తాయనీ ఆశించారు. కొలువులు లేకుండా దినమొక గండంగా జీవిస్తున్న నిరుద్యోగ యువత తమ జీవితాలలో ఉద్యోగాలు వస్తాయని సంబరపడ్డారు. ఆదివాసీ ప్రజలు తమకు స్వయం నిర్ణయ ప్రాంతాలు ఏర్పడుతాయనీ ఆకాంక్షించారు. ముస్లిం సోదరులు మతఘర్షణలకు తావులేని నిజమైన లౌకిక ప్రజాస్వామ్య రాజ్యాన్ని కోరుకుంటున్నారు. మహిళలు తెలంగాణలో తమకు సమాన అవకాశాలు లభిస్తాయనీ ఎన్నెన్ని కలలు కన్నారో! ఇక దళితుల విషయం చెప్పనక్కరనే లేదు. వారు దొరల అరాచకాలు, అగ్రకులాల దాడులు, అత్యాచారాలు ఇక ఉండవనుకున్నారు. ఇలా సమస్త పీడిత ప్రజలు తమ ఆశలను, ఆకాంక్షలను ప్రత్యేక తెలంగాణలో చూసుకుంటామనీ ఎంతగానో మురిసిపోయారు. నిజంగా చెప్పాలంటే, దాదాపు ఒక 20-25 సంవత్సరాలు దేశంలోనే తలమానికంగా కొనసాగిన విప్లవోద్యమ

అనుభవంలో నుంచి న్యాయంగానే ప్రజలు వాటిని ఆశించారు. తెలంగాణ పేరుతో వెలిసిన బూర్జువా-భూస్వామ్య రాజకీయ పార్టీతో పాటు ఇతర పాలకవర్గ రాజకీయ పార్టీలు వాటిని ఎంతగానో సొమ్ము చేసుకున్నాయి.తుదకు ప్రజల ఆశలకు, ఆకాంక్షలకు అన్యాయం జరిగింది. పాత-కొత్త భూస్వాముల, దొరల, బూర్జువాల తెలంగాణ ఏర్పడింది. తెలంగాణలో బూటకపు ఎన్‌కౌంటర్లు మొదలయ్యాయి. అంతే కాదు, ఆ మధ్యే ప్రముఖ మేధావులు, విప్లవ రచయితలు, పాత్రికేయులు భారత విప్లవోద్యమ ఐక్యపార్టీ పదేళ్ళ వేడుకలను జరుపుకోవడానికి ముందుకొస్తే అర్ధరాత్రి ఖాకీలు వాళ్ళ ఇండ్లపై దాడులు చేసి వారిని కటకటాల వెనకకు తోసారు. ఏం తెలంగాణమ్మా ఇది? ఇది ప్రజలు కోరుకున్న తెలంగాణ అని ఎలా నమ్ముతున్నావమ్మా? నిజమైన ప్రజాస్వామిక తెలంగాణ కోసం, నిజమైన ప్రజాస్వామిక భారతదేశం కోసం పోరాటాన్ని మున్నెన్నటికన్నా సమైక్యంగా, తీవ్రంగా, విస్తృతంగా కొనసాగించడానికి పీడితులంతా ఉద్యమించాల్సిన అవసరం ఉందమ్మా. పరిస్థితులు అందుకు చాలా అనుకూలంగా ఉన్నాయి. మనం కోరుకున్న తెలంగాణ వచ్చిందని భ్రమింపజేస్తున్న దొరలు, ఖాకీలు, మాజీలు, జిత్తులమారి రాజకీయ నాయకులు నయవంచకులు అమ్మా! చివరిగా పోరాట తల్లులందరినీ మేం కోరుకునేది మీరు పాలకవర్గాల, వారి అధికారుల మాటలకు మోసపోవద్దు.వారి కౌన్సిలింగులను కాలదన్నండి.ఖాకీ అధికారులు పచ్చి మోసకారులు, నయవంచకులు. తేనె పూసిన కత్తులు. వారి మాయదారి మాటలు నమ్మకండి. మీ బిడ్డలు తుదివరకూ పోరాటంలోనే, ప్రజల కోసమే నిలబడాలనీ మీరు మమ్ము ఆదేశించండి. విప్లవకారుల తల్లులుగా మీరు చేయాల్సిందిదే. గడ్డు పరిస్థితులను ఎదుర్కొంటున్న మా పార్టీకి మీ అండదండలు ఎంతో అవసరం. మా పార్టీనీ, భారత విప్లవోద్యమాన్నీ త్వరితగతిన మట్టుబెట్టాలని దోపిడీ పాలకవర్గాలు ఉవ్విళ్ళూరుతున్నాయి. మావోయిస్టు రహిత జిల్లాలుగా, రాష్ట్రాలుగా ప్రకటించుకోవడానికి పోటీ పడుతున్నాయి. మా విప్లవోద్యమ ప్రాంతాలలో దాదాపు ఐదు లక్షల భద్రతా బలగాలు మోహరించబడి ఉన్నాయి. అయినా ప్రజాయుద్ధం కొనసాగుతూనే ఉంది. కేంద్రంలో బ్రాహ్మణీయ హిందూ ఫాసిస్టు శక్తులు అధికారంలోకి వచ్చాక దేశ వ్యాప్తంగా విప్లవోద్యమం పైనే గాకుండా, దళితులు, మతమైనారిటీలు, ఆదివాసీలు, మహిళలపై కశ్మీర్, అస్సాం, మణిపూర్ లాంటి ఈశాన్య జాతుల ప్రజలపై రాజకీయ, సాంస్కృతిక, భౌతిక దాడులు విస్తృతంగా జరుగుతున్నాయి. దేశద్రోహకర విధానాలు బాహాటంగా అనుసరించ బడుతున్నాయి. వాటికి వ్యతిరేకంగా వారంతా సమైక్యమయ్యే నూతన పరిణామం ఆరంభమైంది. ఇవన్నీ అర్థమయ్యే పాలకవర్గాలూ, వారి ఖాకీ బంట్లూ 'కర్ర-కంద' నీతిని తీవ్రం చేసారు. కానీ అవి ఎంతో కాలం పనిచేయవమ్మా! మీరంతా మా విప్లవ లక్ష్యాన్ని మరింత లోతుగా అర్థం చేసుకుంటారనీ, గతంలోలా ఎప్పటికీ మా వెన్నుతట్టి మమ్ములను ప్రోత్సహిస్తారనే సంపూర్ణ విశ్వాసంతో... .

మీ అండదండలు మాకు ఏ రూపంలోనూ అందకూడదనే కుట్రలో భాగంగా జరుగుతోన్న కౌన్సిలింగ్‌లను నిర్ద్వంద్వంగా బహిష్కరించండి!

'మా సైన్యం లోబర్చుకోను వీలుకాని శక్తి, ధృఢ దీక్ష కలిగి శత్రువులందరినీ తుడిచివేయడానికి అది కృతకృత్యమై ఉంది. అవరోధాలు ఎన్నైనా రానీయండి, ఒక్క సైనికుడు మిగిలి ఉన్నా అతడు పోరాడి తీరుతాడ'నీ అన్నాడు మావో. ఈ సిద్ధాంత బలంతోనే మా పార్టీ నాయకత్వంలో పి.ఎల్.జి.ఏ., విప్లవ ప్రజలు తోంగ్‌పాల్‌లను, ముర్‌మురీలను, తాజాగా ఈనాటి ఎల్మగొండలను సృష్టిస్తున్నారమ్మా!

– విప్లవాభినందనాలతో, నీ కొడుకు మల్లోజుల వేణుగోపాల్,
పి.ఎల్.జి.ఎ. దినం, 2014



*లేఖ :*

## వాస్తవాలిలా ఉన్నాయి

విరసం కామ్రేడ్స్ ప్రచురించిన దండకారణ్య కథలు 2005-2012కు ముందుమాట కామ్రేడ్ అల్లం రాజయ్య గారు రాసినందుకు సంతోషిస్తున్నాం. ఆయనకు మా విప్లవాభివందనాలు తెలుసుకుంటున్నాం. ముందుమాట రాయడానికి ముందు ఆయన చేసిన కృషి అందులో తెలిపారు. దండకారణ్య సాహిత్యంతో రాజయ్య గారికి ఆ ఉద్యమ కాలమంతా అనుబంధం పెనవేసుకపోయి ఉంది. అంతే కాదు, తొలి దండకారణ్యం నుంచి (మన్యం, ఆదిలాబాద్, బస్తర్,గడ్చిరోలిలతో కూడిన దండకారణ్యం) వెలువడిన తొలి నవలా రచనల్లో (కొమురం భీం) ఆయన ఒకరు. ఆ రీత్యా కూడా ఆయన ముందుమాట రాయడం హర్షణీయం. అయితే ఆ ముందుమాటలో చోటు చేసుకున్న పొరపాట్లు సవరించడానికి వాస్తవాలిలా ఉన్నాయని పేర్కొంటున్నాం.

1. 'తెలంగాణ పల్లె' నవల రచయిత కౌముది దండకారణ్యం రాలేదు. 2. 1989లో సాధన రాసిన అడవిలో అన్నలు సమయానికి అమరులు ఐ.వి.సాంబశివరావు ఇంకా దండకారణ్యానికి చేరుకోలేదు. ఆ నవలా రచనలో తోడ్పడింది అప్పటి విరసం సభ్యుడు బేతి శ్రీరాములు గారు. ఆయన ఆ సమయంలో మయూరి కలం పేరుతో రచనలు చేసారు. అలాగే అడవి పుత్రిక నవల 1989 నాటికి వెలుగు చూడలేదు. సాధన రాసిన రెండో నవల రాగో తర్వాతనే అడవి పుత్రిక అచ్చయ్యింది. 3. 2006 మే-జూన్ మాసాల్లో సల్వాజుడుం దాడులను నిలిపివేస్తున్నట్లు అధికారికంగా ప్రకటించలేదు. దాని విస్తరణను నిలిపివేసారు. 4. 1903లో జరిగిన రెండవ మహాసభలో బోల్షివిజం-మెన్షివిజం ముందుకు వచ్చాయి. 5. 17-8-2010 నాడు అమరులైన కామ్రేడ్ చైతె వాస్తవంగా ఒక సీనియర్ కామ్రేడే కానీ రచయిత పేర్కొన్నట్టు మూడు దశాబ్దాల ఉద్యమ జీవితం ఆమెకు లేదు. విప్లవోద్యమంలో దశాబ్ద కాల అనుభవమున్న నవయవ్వన కామ్రేడ్ ఆమె.6. మాడ్‌గానే వ్యవహరించడం సబబుగా ఉంటుంది. అబూజ్ అనడం దయచేసి వదిలేస్తేనే మంచిది.

విప్లవాభివందనాలతో
మీ
సాధన, ఇతర దండకారణ్య రచయితలు

సాహిత్య వ్యక్తిత్వం



# తాడిగిరి పోతరాజు - కెటాలిస్టుగా 'కెటిల్'

- వరవరరావు

శ్రీశ్రీ ఒక ఇంటి పేరు గల పూర్తి పేరు. ఆరుద్ర, అజంతా, ఎల్లోరా - అందమైన మారు పేర్లు తెలుస్తూనే ఉన్నాయి. ఒక ఇంటి పేరు గల శంకరం. ఇంటిపేరు లేని టెంపోరావు కొడవటిగంటి కుటుంబరావు అని తెలియడానికి ఎక్కువ కాలం పట్టలేదు. కాని ఇంగ్లిషు రచయితల వలె జీవితమంతా ఎవరికీ తెలియని ఒక ఇంటి పేరుతో కూడిన పేరుతో రాసి ప్రసిద్ధుడైన రచయిత తాడిగిరి పోతరాజు తెలంగాణవాడు కాదని నోరు విప్పితే తప్ప తెలియనంతగా తెలంగాణ జీవితంతో మమేకమైన లేదా కోతుల నడుమ గ్రామంలో శాంతినగర్ ప్రభావంతో హుజూరాబాద్ ప్రాంతంలో ప్రచలిడతుడైన ఆ ఉపాధ్యాయుడు, మోతుబారి రైతు పుట్టిన గుంటూరు జిల్లా తాడికొండను తాడిగిరిగా మార్చి గేబ్రియల్ పేరును పూర్తిగా దేశీయం చేసి మనం పజిల్ విప్పలేనంతగా పోతరాజుగా నిలిచిపోయిన వాడాయన. కుదిమట్టంగా, నల్లగా, విశాలమైన భుజాలు, నుదురు, కళ్లు, ఆజాద్ చంద్రశేఖర్ మీది అభిమానంతో పెంచుకున్న మీసాలు. దొడ్డు పెదవుల నుంచి నాటకీయంగా వెలువడే రాజకీయ తాత్విక సాహిత్య వాక్యాలు– 'మన విప్లవానికి మన ప్రతీకలు ఉండాలండి. మనం భగత్‌సింగ్‌ను ఆవాహన చేసుకోవాలి. మనం గిరాయిపల్లి విద్యార్థి అమరుల బాటలో మన స్థానిక పోరాటాల నుంచి– అంటే వరంగల్ రీజినల్ ఇంజనీరింగు కాలేజి - చుట్టూ దర్గా, కాజీపేట, మెస్ వర్కర్లు, గేటు ముందు రిక్షావాళ్ళ నుంచి పైడిపల్లి మాల మాదిగల వాడలలో తిరిగి వచ్చే విద్యార్థులు - ముస్త్యాలపల్లి నుంచి ఎల్‌బి కాలేజి నుంచి సిద్దిపేట దాకా విస్తరించే విద్యార్థులు, నర్సంపేట ఖానాపూర్ నుంచి హనుమకొండ జూనియర్ కాలేజి నుంచి విప్లవంలోకి పయనించే విద్యార్థులు - రైతును దోచుకునే మార్కెట్లో నెత్తిమీద మిరపకాయల బస్తా నుంచి మిర్చీ యార్డులో తిరుగుబాటు చేసే తత్వం దాకా మన పోరాటాలు స్థానిక ప్రత్యేకతల నుంచి అంతర్జాతీయ స్థాయికి ఎదగాలనేవాడు. అందుకేనేమో ఎమర్జెన్సీ ఎత్తి వేసిన తర్వాత అమరుడు మురళీ మోహన్ తండ్రి ముస్త్యాలపల్లిలో గిరాయిపల్లి అమరులకు ఇటుకలతో ఎత్తైన స్థూపం కట్టినప్పుడు ఎట్లా తెలిసి వచ్చాడో మధ్యాహ్నానికే కుమార్‌పెల్లికి వచ్చి హనుమకొండ చౌరస్తా నుంచి ములుగు రోడ్డు మీదుగా ఆ ఊరి దాకా మైళ్ల కొద్దీ ఊరేగింపు ముందు నడిచాడు. అప్పుడాయన కరీంనగర్ జిల్లా పౌరహక్కుల సంఘం బాధ్యుల్లో ఒకడనుకుంటాను.

గేబ్రియల్ హుజూరాబాద్ బేసిక్ ట్రెయినింగ్ స్కూల్‌లో ఉపాధ్యాయుడుగా హుజూరాబాదు ప్రజా జీవితంలో ప్రవేశించే నాటికే ఆయన తాడిగిరి పోతరాజుగా కథా, నవలా రచయితగా ప్రసిద్ధుడు. అరవైల నాటికి 'గాజు కిటికీ' నవల ద్వారా నలుగురికి తెలిసినవాడు. అక్కడి నుంచి హుజూరాబాదు హై స్కూల్‌లో మరొక యువ ఉపాధ్యాయుడు వరంగల్ ఆర్ట్స్ కాలేజీలో 1960లో బిఎస్సీ చేసిన ఎ. లింగయ్యతో పాటు ఆ ప్రాంతపు విద్యార్థుల్లో అరవైల తొలిరోజుల్లోనే అభ్యుదయ భావాలు, శ్రీశ్రీ కవిత్వం ప్రచారం చేసిన పోతరాజు తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట స్ఫూర్తితో విశాలాంధ్ర భావన నుంచి తెలంగాణకు జరిగిన మలి అన్యాయాన్ని, ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో పసికట్టడానికి వెనుకాడలేదు. అప్పటికే ఎ. లింగయ్య అకాల మరణం చెందాడు. జమ్మికుంట ఆదర్శ కళాశాల ప్రారంభమైంది. ఎం.వి. తిరుపతయ్య అక్కడ తెలుగు లెక్చరర్‌గా 1965లో చేరాడు. 1964 మళ్లీ ప్రజల్లో వర్గ పోరాట ఆకాంక్షలు రేకెత్తించిన కాలం. హైదరాబాద్ నుంచి 'రాత్రి' కవితా సంకలనం, విశాఖపట్నం నుంచి 'యజ్ఞం' కథ వెలువడిన కాలం. అంటే శ్రీకాకుళంలో వెంపటాపు సత్యం, ఆదిభట్ల కైలాసం కొత్తగా ఏర్పడిన సిపిఐఎం సభ్యులుగా, ఉపాధ్యాయులుగా తాము సవర, జాతాపు ఆదివాసులను వర్గపోరాటానికి ఆయత్తం చేయడానికే పార్టీ చీలిందని ఆశించిన కాలం. లేదా తామట్లా ఆచరణలో ప్రవేశించిన కాలం. మోహభంగమై నిరాశపడకుండా గిరిజన సహకార సంఘాలను స్థాపించి సంఘర్షణ వైపు తీసుకుపోతన్న కాలం. ఆ కాలం కదలికలను పట్టుకున్నట్లు 1965లో దిగంబర కవుల మొదటి సంపుటం వెలువడింది. ఇక్కడి ఈ యాతనలన్నీ 1956 నుంచి మొదలైన ఒక మహత్తర చర్చలో భాగమేనని తెలియని అసంకల్పిత ప్రకంపనలు 1946 చైనా శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవం నాటికి ఒక ఆకృతి దాల్చడం ప్రారంభించినవి. ఆ నవంబర్‌లో సృజన ప్రారంభమైంది. 'మిత్రమండలి' నుంచే వరంగల్ ఆర్ట్స్ కాలేజి విద్యార్థిగా వరంగల్ సాహిత్య వాతావరణంలో పెరిగిన తిరుపతయ్య సృజనను జమ్మికుంటకు తీసుకపోయిన 'సాహితీ మిత్రులు'లో ఒకడే కాదు– పోతరాజును ఈ ప్రవాహంలో ఇచ్ఛాపూర్వకంగా తెచ్చినవాడు. స్థానికంగా ఉన్న ఆకునూరి సమ్మయ్య వంటి యువకులు ఇటు సాహిత్యంలో పెద్ద దిక్కుగా పోతరాజుగారిని పెట్టుకొని తమ ఎజెండా అయిన ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలోకి, నేపథ్యమయిన విప్లవోద్యమంలోకి తమతో పాటుగా తమకు సాహిత్య పరిచయం కలిగించిన పోతరాజును తెచ్చుకున్నారు.

1968-69 నాటికి అంతా వెల్లడైంది. అటు శ్రీకాకుళ రైతాంగ పోరాటం, ఇటు గోదావరి లోయగా ఇప్పుడు ఎక్కువగా చెప్పుకుంటున్న ఖమ్మం, వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్ అటవీ ప్రాంతం విప్లవోద్యమం - ప్రస్ఫుటమైన ప్రత్యేక తెలంగాణ ఉద్యమం విద్యాలయాలను భావాల సాముగారడీల శిక్షణా శిబిరాలుగా మార్చినవి. అది జమ్మికుంట ఆదర్శ కళాశాల కావచ్చు. హుజూరాబాద్ జూనియర్ కాలేజి కావచ్చు. అందరికి తెలిసిన పేర్లతో ఊహించుకోగల ఆ ఉద్యమం గురించి చెప్పుకోవాలంటే నల్లా ఆదిరెడ్డి, శనిగరం వెంకటేశ్వర్లు, నూనూగు మీసాల వయసులో హుజూరాబాద్‌లో తాడిగిరి పోతరాజు విద్యార్థులు, ఆ తర్వాత తిరుపతయ్య విద్యార్థులు.

సాహసి అయి, భావాలు దాచుకోలేని పోతరాజు సహజంగానే 1970లో విరసం ఏర్పడగానే అందులో చేరాడు. 1971 బంగ్లాదేశ్ యుద్ధంలో పెల్లుబికిన జాతీయ కాంక్షను ఇందిరాగాంధీ 'ముక్తి ఫౌజ్'ను పంపించి హైజాక్ చేసిందన్న నిష్ఠురమైన నేరానికి శిష్యుడు శనిగరం

వెంకటేశ్వర్లుతో పాటు డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్స్ కింద జైలు పాలయ్యాడు. అప్పటికే తిరుపతయ్య నేతృత్వంలో 'విద్యుల్లత' సాహిత్య పత్రిక సంపాదక వర్గం (విజయ్‌కుమార్, లింగారెడ్డి, ఉమ్మెంతల వెంకటరెడ్డి)లోని వెంకటరెడ్డిని కూడా అరెస్టు చేసి వీళ్లతో పాటు జైల్లో పెట్టారు. పోతరాజుగారు మళ్లీ కథలు రాయడానికి విజృంభించారు.

1972 ఎన్నికల్లో టీచర్‌గా ప్రిసైడింగ్ ఆఫీసర్‌గా వెళ్లిన అనుభవంతో 'ఎర్రబుట్ట' కథ, 'విద్యుల్లత'లో అచ్చై పెద్ద సంచలనం అయింది. ఎన్నికలు, ప్రజలు, ఓట్లు అని అనుకుంటాం గానీ ప్రజలు తమ చేతిలో పెట్టిన ఒక కాగితం ముక్కతో ప్రభుత్వాలను మార్చేస్తారని అనుకుంటాంగానీ, అనుకోవడం ఏమిటి, నిజమేకానీ, ఈ ప్రభుత్వాలు మారడం - ఎర్రబుట్ట చేతిలోని లాఠీ, తుపాకి అధికారాన్ని మార్చేస్తుందా? స్వతంత్రం వస్తే జట్కావానికి ప్రభుత్వంగా కనిపించే హెడ్‌కానిస్టేబుల్ ఇంగ్లిషువానిలాగానే బదిలీ అయిపోతాడా? టీచర్లు ఎన్నికల సిబ్బందిగా ఎన్నికల సామాను తీసుకపోవడం దగ్గర్నించి, నిర్వహించడం దగ్గర్నించి తిరిగి ఆ డబ్బాలు రిటర్నింగ్ ఆఫీసర్లకు అప్పజెప్పే దాకా వాళ్లకు లాఠీలతో (చూపి మాత్రమే) పాఠాలు చెప్పే ఎర్రబుట్ట కథ. వ్యవస్థకు కన్నెర్రయింది. భాగ్యనగర్ విజయ్‌కుమార్ 'ఉద్యమ సాహితి' సంస్థ ప్రచురించిన 'బద్‌లా' కథా సంకలంలో ఎం.వి. **తిరుపతయ్య** 'న్యాయం' కథతో పాటు చేరి సంకలనం నిషేధానికి కారణమైంది. 'న్యాయం' కథ గ్రామంలో భూస్వామ్యం, జీతగాళ్ల ఉత్పత్తి సంబంధాలను చిత్రించి వెట్టి నుంచి, దోపిడీ, పీడనల నుంచి విముక్తి కోసం వాళ్లు అడవి మార్గాన్ని ఎంచుకోవడంగా ముగుస్తుంది. ఆ కథను నాటకీకరించి హుజూరాబాద్ 'జనసాహితి' జిల్లా అంతటా ప్రదర్శనలిచ్చింది. కనుక ఈ ఇద్దరి రచనల ప్రభావం ప్రభుత్వాన్ని అభద్రతకు గురి చేసింది.

ఈలోగా గోదావరి నది మీద ఉన్న వంతెనల కింద చాలా నెత్తురు ప్రవహించింది. గతంలో వలె కేవలం దొరల పీడన, అణచివేత, హింసాకృత్యాల వల్ల మాత్రమే కాదు, ఎదురుతిరగడం వల్ల, ఇంకెంత మాత్రమూ బానిస బతుకులు బతకడానికి నిరాకరించడం వల్ల, దొరలకు అండగా వస్తే రాజ్యాన్ని అయినా లెక్క చేయమని ప్రకటించి బరి గీసి నిలవడం వల్ల కరీంనగర్ జిల్లాలో విప్లవోద్యమం పురివిప్పి - ప్రజల హక్కుల కోసం పౌరహక్కుల సంఘం, ప్రజల జీవితాలను, పోరాటాలను వాళ్ల భాషలో యాసలో మాటలో, ఆటలో వ్యక్తం చేయడానికి 'జన నాట్యమండలి' ఏర్పడినవి. శనిగరం వెంకటేశ్వర్లు తన స్వగ్రామం మాణిక్యాపురంలో నల్లా ఆదిరెడ్డి నాయకత్వంలో జననాట్యమండలి ఏర్పాటు చేసాడు.

భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్ష రద్దుకోసం హుజూరాబాద్‌లో ఏర్పాటు చేసిన ఎపిసిఎల్‌సి సభకు శ్రీశ్రీ వచ్చాడు. ఆ సభలోనే ఆ సభ కరపత్రం వెనుకనే ఆయన చారిత్రాత్మకమైన ప్రకటన రాసాడు. భూమయ్య కిష్టాగౌడ్‌లను ఉరి తీసి కమ్యూనిస్టు విప్లవకారుల ఉరిశిక్షల కాగితాలపై ఖురాన్ భయంతో సంతకం చేయని నవాబుకన్నా, దాస్తొవ్‌స్కీని ఆఖరు క్షణంలో మరణశిక్ష నుంచి తప్పించిన జార్ చక్రవర్తి కన్నా నియంతలని అనిపించుకోవద్దని ఇందిరాగాంధీకి విజ్ఞప్తి చేసాడు. అది 1975 మే. ఆ సభను ఏర్పాటు చేసినవాళ్లు పోతరాజు, ఆదిరెడ్డి, వెంకటేశ్వర్లు మొదలైన వాళ్లు. వీళ్ల నాయకులు మల్లోజుల కోటేశ్వరరావు, జాపా లక్ష్మారెడ్డి, భాగ్యనగరం విజయ్‌కుమార్.

ఇంతలో ఎమర్జెన్సీ వచ్చింది. జీవించే హక్కు తప్ప మిగిలిన ప్రాథమిక హక్కులన్నీ రద్దు అయ్యాయని చట్టబద్ధంగా ప్రకటించారు గానీ చట్ట విరుద్ధంగా ఎమర్జెన్సీలో డెబ్బై అయిదు మంది విప్లవకారులను, సానుభూతిపరులను ప్రభుత్వం 'ఎన్‌కౌంటర్' చేసింది. అందులో ఆంధ్రప్రదేశ్‌లో మొట్టమొదటి ఎన్‌కౌంటర్ గిరాయిపల్లి విద్యార్థులుగా ప్రసిద్ధులైన సూరపనేని జనార్దన్ సహచరుల హత్య - మెదక్ జిల్లా గిరాయిపల్లి అడవుల్లో తార్కుండే కమిటీ కృషి వల్ల భార్గవా కమిషన్ ముందుకు విచారణకు వచ్చి ఇంచుమించు హత్యకేసుగా నిర్ధారణ అయింది ఇదే.

1975 జూన్ 26 నుంచి 76 జూన్ 26 దాకా జైల్లో ఉన్న వందలాది మంది ఆ కటకటాల్లో ఏం కమ్యూన్‌లు నిర్వహించుకున్నారో, ఏ మాటలు చెప్పుకున్నారో, ఏ పాటలు పాడుకున్నారో గాని బయట కుంపటి కింది నిప్పువంటి నిశ్శబ్ద వాతావరణం. ఇంత నిశ్శబ్దంలోని శబ్దం మీద నిఘాపెట్టిన పోలీసులు 76లో అటు జమ్మికుంట నుంచి ఎం.వి. తిరుపతయ్యను, ఇటు శాంతినగర్ నుంచి తాడిగిరి పోతరాజును అరెస్టు చేసారు. అప్పటికే 75 ఫిబ్రవరి నుంచి ఒక నిర్మాణంగా నిశ్శబ్దంగా పని చేస్తున్నా రాడికల్ విద్యార్థులను కొందరిని అరెస్టు చేసారు. వేరు వేరు పోలీసు స్టేషన్లకు తిరుపతయ్యతో పాటు వాళ్లను తిప్పుతూ అక్కడికి పోతరాజును కూడా తెచ్చారు. ఈ వివరాలన్నీ వాస్తవం కన్నా గగుర్పాటు కలిపించే కల్పనగా అంపశయ్య నవీన్ తిరుపతయ్య డైరీ ఆధారంగా రాసిన నవల 'చీకటి రోజులు'లో కనిపిస్తాయి. ఆ నవలలోని రామరాజు పాత్ర పోతరాజుదే.

ఎమర్జెన్సీ ఎత్తి వేసే దాక పోతరాజు వరంగల్ జెయిల్లో డిటెన్యూగా ఉన్నాడు. అప్పటికే నన్ను చెంచల్‌గూడా జెయిలుకు మార్చారు గనుక ఆయనతో జైల్లో కలిసుండే అవకాశం రాలేదు. లోచన్, ఎస్.కె, డాక్టర్ రామనాథం, అట్లూరి రంగారావు మొదలైన వాళ్లు అప్పుడా జైల్లో ఉన్నారు.

ఎమర్జెన్సీ ఎత్తి వేసిన తర్వాత పోతరాజు విరసంలో కన్నా ఎపిసిఎల్‌సిలో ఎక్కువ క్రియాశీలంగా ఉన్నట్లున్నారు. మళ్లీ ఏడెనిమిది సంవత్సరాలుగా మా మధ్య సంబంధాలు పెరిగాయి. ముఖ్యంగా తెలంగాణ విద్యావంతుల వేదిక, హుజూరాబాద్ జనసాహితి-ఆకునూరి సమ్మయ్య కేంద్రంగా సాహిత్య కార్యకలాపాలు, తెలంగాణ మలి ఉద్యమానికి సంబంధించిన కార్యకలాపాలు చేపట్టి, పోతరాజుగారిని మళ్లీ రచనలు చేయడానికి, తన పాత రచనలన్నీ తిరిగి అచ్చు వేయడానికి ప్రోద్బలం చేయడంతో ఆయన సృజనలో వచ్చిన తన రచనల కోసం, ముఖ్యంగా కామ్రేడ్ రవూఫ్ కార్యకలాపాలు తెలుసుకోవడానికి ఫోను చేసేవాడు, ఉత్తరాలు రాసేవాడు. హైదరాబాదు వచ్చినపుడు కలిసేవాడు కూడా.

ఆరంభంలో చెప్పినట్లుగా భగత్‌సింగ్ తర్వాత ఆయనకు బాగా ఆరాధనీయులైన విప్లవకారులు చారుమజుందార్, ఎస్ఎ రవూఫ్‌లు. అందుకని ఎప్పుడూ ఆయన రవూఫ్ కార్యకలాపాల గురించి, ఆరోగ్యం గురించి ఎంతో ఆసక్తిగా అడుగుతుండేవాడు. రవూఫ్ అమరత్వం తర్వాత నేను జ్యోతిలో రాసిన వ్యాసం కోసమైతే పోతరాజు క్యాన్సర్‌తో బాధపడుతున్నప్పుడు కూడా ఫోన్‌లు చేసి, మనుషులను పంపించి సంపాదించుకునే దాకా వదులలేదు.

తన దగ్గర వున్నవి, సృజనలోంచి పంపినవీ, 'బదలా'లో, 'విద్యుల్లత'లో వచ్చినవి కూడా కలిపి ఆయన 2010లో 'కెటిల్' అనే కథా సంకలనం వెలువరించి హుజూరాబాద్‌లో జనసాహితి

నిర్వహించిన శ్రీశ్రీ శత జయంతి సభలో ఆవిష్కరించాడు. అవన్నీ 'ఎమర్జెన్సీ'కి సంబంధించిన కథలు. జైల్లో ఉన్న డిటెన్యూలు పంచుకున్న అనుభవాలు. తెలుగులో ఎమర్జెన్సీ జైలు కవితా సంకలనాలు చాలా వచ్చినవిగానీ స్వానుభవంతో కూడిన కథలలో మాత్రం పోతరాజు రాసిన కథా సంకలనం 'కెటిల్' మాత్రమే.

నవంబర్ 2009లో ప్రచురించిన ఎనిమిది కథల సంకలనానికి అందులోని 'కెటిల్' అనే కథనే ఆయన పేరుగా ఎంచుకున్నాడు. విప్లవ రచయితల సంఘం ఏర్పడి 70 అక్టోబర్‌లో ఖమ్మం సుబ్బారావు పాణిగ్రాహినగర్‌లో ప్రథమ మహాసభలు జరుపుకున్నపుడు అక్కడ 'నవయుగ బుక్‌స్టాల్' పేరుతో బి. వీరయ్య ఒక చాయ్ దుకాణం పెట్టుకున్నాడు. పేరుకు బుక్‌స్టాల్ గానీ అది తడికలతో ఏర్పాటు చేసిన ఒక చాయ్ దుకాణం. బొగ్గుల పొయ్యి. దాని మీద కెటిల్. ముందర వేళ్లాడే పత్రికలు. 'ప్రభంజనం', సృజన వంటి విప్లవ పత్రికలు. తెలుగు వెలుగు, జ్వాల – వంటివి ఆ రోజుల్లో శ్రీకాకుళ ఉద్యమానికి తగినంత స్థలమిచ్చిన పత్రికలు. తెలుగు నేల ఏ మూల నుంచి వచ్చేదైనా అక్కడ విప్లవ సాహిత్యం దొరుకుతుంది– దినపత్రికల నీడలో. అయితే ఆకర్షణ అయినా సెన్సేషన్ అయినా ఏమిటంటే చాయ్ తాగడానికి వచ్చే వాళ్ల కోసం ఆ రోజు పత్రికల్లో వచ్చిన ప్రముఖ వార్తలు ఒక తడిక బోర్డు మీద కాగితం మీద రాసి అంటించేవాడు. అవి విప్లవ వార్తలయి ఉంటాయని వేరే చెప్పనక్కర్లేదు. ఆయన కొడుకు మల్లయ్య అప్పటికింకా నూనూగు మీసాలవాడు. ఆ టీస్టాల్ విప్లవ రాజకీయాల కూడలి. ఆ టీస్టాల్ మీద పోలీసులు ఎన్నిసార్లు దాడి చేసారో, ఎన్నిసార్లు ఆ ఇద్దరినీ అక్కడా లాకప్‌లో పెట్టి చితకబాదారో చెప్పలేం. ఆ టీ స్టాల్ నుంచి వాళ్లు సేకరించిన సాహిత్యాన్నంతా పోలీసులు ఎత్తుకపోయినపుడు శ్రీశ్రీ పోలీసులు పుస్తకాల దొంగలు అని రాసాడు. నేను సృజనలో 'విప్లవ వీరయ్యలు' అని సంపాదకీయం రాసాను. ఆయన కొడుకు ఎల్లయ్యను సికిందరాబాదు కుట్ర కేసులో ముద్దాయిగా పెట్టారు. తండ్రీ కొడుకులిద్దరినీ ఎమర్జెన్సీలో అరెస్టు చేసిన ఉదంతమే 'కెటిల్' కథ. ఆ ఇద్దరికే కాదు ఆ కుటుంబానికి జీవనాధారం ఆ చాయ్ కెటిల్. ఆ కుటుంబంతో విప్లవాభిమానులకు అనుబంధం ఆ చాయ్ కెటిల్. ఆ చాయ్ కెటిల్ ఏడేళ్ల పాటు ఒక కెటాలిస్టు పాత్ర నిర్వహించింది. పోలీసులు ఆ కెటిల్‌ను ఎత్తుకుపోయారు. వీళ్లను తెచ్చి డిటెన్యూలను వరంగల్ జైల్లో పడేసారు. వాళ్లు వరంగల్ జైల్లో వందలాది మంది విప్లవ రాజకీయ ఖైదీల కమ్యూన్‌లో పంచుకున్న పనులు, బాధ్యతల్లో అందరికీ చాయ్ చేసి పోసే పనినే ఎంచుకున్నారు. వీరయ్య, మల్లయ్యలకు, విప్లవాభిమానులకు కెటిల్‌తో ఏర్పడిన విప్లవానుబంధాన్ని ఎమర్జెన్సీ కూడా ఛేదించలేకపోయింది.

'కెటిల్'లోని ఎనిమిది కథలు 70–75ల మధ్య కాలంలో తెలంగాణ జిల్లాల్లో జరిగిన సంఘటనల నుంచి ప్రేరణ పొందినవి. ఈ కథల్లోని రక్తమాంసాలన్నీ ఆ ఐదేళ్ల విప్లవోద్యమ ఆటుపోటుల నుంచి జీవసారాన్ని గ్రహించినవి. మొదటి కథ 'విలాపాగ్నులు' లోని విద్యార్థులు ఆయనకు అభిమానమే ఉండి పరిచయం లేని గిరాయిపల్లి విద్యార్థి అమరులైనా కావచ్చు లేదా తనతో, తిరుపతయ్యతో కరీంనగర్ పోలీసు స్టేషన్‌లలో ఉండి తమ కళ్లముందే చిత్రహింసలనుభవించి ఆ తర్వాత ఎన్‌కౌంటర్లయిన వాళ్లు, అదృశ్యమైన వాళ్లు కావచ్చు. 'రెప్పలు లేని కళ్లు' చదువుకున్నంత సేపూ రెప్పవాల్చకుండా కళ్లల్లో నుంచి నీళ్లు కారిపోతుంటే కష్టజీవుల అనుభవాలు చదివించే కథ. ఆశ్చర్యమేమంటే కథా వస్తువు ఎమర్జెన్సీ కన్నా ముందుది. ఆ తర్వాత ఆయన కథలేమీ రాసినట్లు లేదు. ఒకవేళ అవి ఎనభైలలో అచ్చయినా ఆ తర్వాత 30 ఏళ్లు గడిచిపోయింది.

1958 నుంచి 78 దాకా ముప్పయ్యేళ్ల పాటు రాసి, నలభై ఏళ్లకు పైగా సాహిత్య ప్రపంచంలో చర్చలకు రాకుండా ఉండిపోయిన తాడిగిరి పోతరాజు 2009 నుంచి 'కెటిల్' ద్వారానే మళ్లీ విప్లవ సాహిత్య ఉద్యమానుబంధంలోకి వచ్చి, హుజూరాబాద్ 'జనసాహితి' ద్వారా పునర్నిర్మించాలనుకున్న నాటికి కేన్సర్ వ్యాధి ఆయనను లోబరుచుకున్నది. ఒక ముప్పై ఏళ్లు ఏ కార్యకలాపాల్లో లేకపోవడం, నలభై ఏళ్లు రచన లేకపోవడం సాహిత్య జీవి జీవితంలో చాలా సంక్లిష్టమైన స్థితి. దానిని అధిగమించడానికి ఆయన డెబ్బై ఏళ్లు దాటినాక చేసిన ఒక తీవ్ర ప్రయత్నమే 'కెటిల్'. అంత దాకా ఆయన ఆ నిప్పును చల్లారకుండా కాపాడుకోవడానికి పడిన ఘర్షణ బుద్ధిజీవులకు ఒక అనుకూల సంకేతం.



తీర్మానం – 4

బొబ్బిలి సాహిత్య పాఠశాల

## భావప్రకటన పై దాడిని ఖండిస్తున్నాం
## పెరుమాళ్ మురుగన్‌కు సంఘీభావం ప్రకటిస్తున్నాం

సంఘ్‌పరివార్ శక్తులు చరిత్రను, శాస్త్రీయ భావజాలాన్ని, సాహిత్య సృజనను వేటాడుతున్నాయి. పెరుమాళ్ మురుగన్ మీద జరిగిన దాడి సంఘ్‌పరివార్‌కు రాజకీయాధికారం వచ్చాక పొంచి ఉన్న ఫాసిస్టు ప్రమాదానికి సూచిక. కలం మీద జులుం కొత్త కాదు. ఈ సారి మతోన్మాద శక్తులు తమిళ రచయిత పెరుమాళ్ మురుగన్ 'రచయితగా మరణించానని' ఆత్మహత్యా ప్రకటన చేసేదాకా వదిలి పెట్టలేదు. ఆయన నాలుగేళ్ళ క్రితం రాసిన నవల 'మధోరుభగన్' మీద నెల రోజులుగా రాజేసిన మంటల్లోకి నవలనూ, నవలా రచయితనూ కూడా తోసేసారు. పాతికేళ్ళ సృజన నెత్తురు కక్కుకుంటూ నేల రాలింది. భిన్న మతాల పట్ల, సంస్కృతుల పట్లనే గాక చరిత్ర పట్ల, శాస్త్రీయ భావాల పట్ల ఫాసిస్టు వైఖరి ఉన్న సంఘ్‌పరివార్ శక్తులు చుట్టుముట్టి రచయిత మీద దాడి చేస్తే అధికారులు, చట్టం కూడా వాటికే అండగా నిలిచాయి. చివరికి పెరుమాళ్ మురుగన్ తన రచనలను ఉపసంహరించుకోవడంతో పాటు రచయితగా తానిక మరణించానని ప్రకటించాడు. ప్రాణం నిలబెట్టుకోవడం కోసం ప్రాణప్రదమైన రచనను చంపుకోవడం నిజంగా ఏ రచయితకైనా వర్ణించలవి కాని బాధ. రచయితలుగా మేము పెరుమాళ్ మురుగన్ పై దాడిని తీవ్రంగా ఖండిస్తూ ఆయన తన రచనను కొనసాగించాలని కోరుకుంటున్నాం. సృజన మరణిస్తే సామాజిక చలనం అంతమవుతుంది. మానవ సమూహం స్పందనలు నశించి గడ్డకట్టిపోతుంది. ఇది పెరుమాళ్ మురుగన్ ఒంటరి దుఃఖం కాదు. భావ ప్రకటనపై దాడి రచయితలందరి పైనా దాడిగా మేం భావిస్తున్నాం. పెరుమాళ్ మురుగన్‌కు సాహితీలోకం అండగా నిలబడుతుందని ప్రకటిస్తున్నాం.



# భారతదేశంలో కుల సమస్య

- యోగి

మన దేశంలో కులం సున్నితమైన, అదే సమయంలో సంక్లిష్టమైన సమస్య. ఈ సమస్యను సామాజిక శాస్త్రవేత్తల నుండి రాజకీయ కార్యకర్తల వరకు పలు రకాలుగా విశ్లేషిస్తున్నారు. పరస్పర భిన్నమైనవే కాకుండా, పూర్తిగా ఒకదానికొకటి వ్యతిరేకమైన అభిప్రాయాలు కులం పుట్టుక, ఎదుగుదల, మార్పులు, నిర్మూలనా మార్గాల గురించి వెల్లడవుతున్నాయి. కొందరు కులం కేవలం ఒక భావజాలం మాత్రమేనని, భావజాలాలు సంపూర్ణంగా నిర్మూలించబడటం అసాధ్యమని అంటున్నారు. కొందరు కులం ఒక భౌతిక వాస్తవమని, దాని మూలాలు ఆర్థిక వ్యవస్థలో అంటే ఉత్పత్తి విధానంలో వేళ్ళూనుకొని ఉన్నాయని అంటున్నారు. ఉత్పత్తి విధానం మౌలికంగా మార్పుకు గురైతే కుల సమస్య దానంతట అదే పరిష్కరించబడుతుందని భావిస్తున్నారు. కొందరైతే ఆధునిక భారత సమాజంలో కులం ఒక సమస్యే కాదని కూడా అంటున్నారు. ఇన్ని పరస్పర విరుద్ధమైన భావాల మధ్య కుల సమస్యను గతితార్కిక దృక్పథంతో సక్రమంగా, సమగ్రంగా అర్థం చేసుకోవటానికి ఉపయోగపడే కొత్త పుస్తకం అనూరాధ గాంధీ రాసిన 'భారత దేశంలో కులసమస్య' అనే పుస్తకం.

అనూరాధ బ్రాహ్మణ కులంలో పుట్టి ఉన్నత చదువులు చదివి కమ్యూనిస్ట్ భావజాలం వైపు ఆకర్షించబడి 2008లో అజ్ఞాతంలో అనారోగ్యంతో మరణించేదాకా విప్లవోద్యమంలో భాగస్వామ్యమైన మేధావి. బొంబాయి నగరంలోని మురికివాడలలో, దళితవాడలలో నివసిస్తూ పనిచేసిన కారణంగా ఆమె కుల సమస్యను పుస్తకాల ద్వారా కాక ప్రత్యక్ష అనుభవం ద్వారా అర్థం చేసుకున్నారు.

ఈ పుస్తకంలో వివిధ సమయాలలో ఆమె రాసిన ఆరు వ్యాసాలున్నాయి. అవి 1. భారతదేశంలో కుల సమస్య, 2. మళ్ళీ తలెత్తిన కుల ప్రశ్న, 3. మహారాష్ట్రలో కుల వ్యతిరేక ఉద్యమాలు, 4. నాలుగు రోజుల పాటు మహారాష్ట్ర రగిలిన వేళ, 5. దళిత ఆగ్రహానికి రగులుతున్న మహారాష్ట్ర, 6. భూ యాజమానులుగా మహర్లు. ఇవి కాక ఆనంద్ తేల్‌తుంబ్డే ఈ పుస్తకానికి రాసిన సుదీర్ఘమైన ముందుమాట కూడా ఉన్నది.

తేల్‌తుంబ్డె చెప్పినట్లు 'నికృష్టమైన కులవ్యవస్థ నిర్మూలించ బడాలని బలంగా కోరుకునే వారిని ఆయా సమస్యలపై ఆలోచింప చేసేందుకు, విప్లవ పోరాట సిద్ధాంతాన్ని, ఆచరణను సుసంపన్నం చేసేందుకు ఈ రచన తగిన భావజాలాన్ని, వేదికను అందిస్తుంది. అనూరాధ పునాది, ఉపరితలం అనే మూస పద్ధతిని అధిగమించి కులవివక్షతను, కుల దోపిడీని, కుల నిర్మూలనకు చారిత్రక భౌతికవాద దృష్టితో వివరించిన కారణంగా ఈ దేశంలో వర్గపోరాటంతో పాటు కులనిర్మూలనా పోరాటాలు జమిలిగా కొనసాగాల్సిన అవసరాన్ని నిరూపించింది.

మొత్తం ఆరు వ్యాసాలలోనూ ప్రధానమైనది 67 పేజీల నిడివి గల 'భారతదేశంలో కులసమస్య' అనే వ్యాసం. ఇందులో ఆమె కుల వ్యవస్థ పుట్టుకతో ప్రారంభించి క్రీ.పూ. పదిహేను వందల నుండి ప్రస్తుత కాలం వరకు కుల సమస్య రూపాంతరం చెందిన వైనాన్ని వివరించారు. భారతదేశంలో తొలి రాజ్య వ్యవస్థ ఏర్పడినప్పటి నుండి అవి సమాజంలో పెరుగుతున్న అదనపు ఉత్పత్తిని స్వాధీనం చేసుకోవటానికి కుల వ్యవస్థను ఒక సాధనంగా రూపొందించుకున్న చరిత్ర, అందుకు బ్రాహ్మణ పురోహిత వర్గం పాలకులకు ఏ విధంగా తోడ్పడిందీ వివరించారు. ఈ క్రమంలో కుల విభజన ఎలా ఘనీభవించిందో, బ్రాహ్మణవాదం సమాజంపై ఎలా ఆధిపత్యం సంపాదించిందో ఆమె వివరించారు.

బ్రిటీష్ వలసపాలకులు వ్యాపారస్తుల రూపంలో భారతదేశంలోకి ప్రవేశించి, ఇక్కడి న్యాయ వ్యవస్థలోకి చాతుర్ వర్ణ వ్యవస్థను చేర్చడం ద్వారానూ, కుటుంబం, వివాహం, ఆస్తి, వారసత్వం వంటి తగాదాలలో శాస్త్రాలను వ్యాఖ్యానించి న్యాయ మూర్తులకు సలహాలివ్వటానికి బ్రాహ్మణ పండితులను నియమించడం ద్వారానూ బ్రాహ్మణవాదంతో రాజీపడిన వైనాన్ని ప్రస్తావించారు. బ్రిటీష్ పెట్టుబడి భారత భూస్వామ్యానికి అనుకూలంగా ఎలా ఎందుకు మారిందీ చారిత్రకంగా వివరించారు. అదే విధంగా 12వ శతాబ్దం నుండి 17వ శతాబ్దం వరకు కుల వ్యవస్థకు వ్యతిరేకంగా కమ్మరి, వడ్రంగి, నేత వంటి చేతి వృత్తుల కులాలకు, అంటరాని కులాలకు చెందిన నందన్, సంత్ రవిదాస్, బసవన్న, తుకారామ్, కబీర్ వంటి వాళ్ళు బ్రాహ్మణ గుత్తాధిపత్యానికి గండి కొట్టిన వైనాన్ని వివరించారు. ఫ్యూడలిజం సైద్ధాంతిక, భౌతిక పునాదులపై భక్తి ఉద్యమం దెబ్బ వేసింది. కాని కుల వ్యవస్థను బద్దలు కొట్టటంలో వైఫల్యం చెందింది అంటూ దీనికి ప్రధాన కారణం భక్తి ఉద్యమం కుల వ్యవస్థకు మూలమైన ఫ్యూడల్ ఉత్పత్తి విధానంపైన, దాంట్లో భాగమైన భూ సంబంధాలపైన దాడి చేయకపోవటమే అని ఆమె నిర్ధారించారు.

వలస పాలనా కాలంలో బ్రాహ్మణేతర కులాలలో కొత్త వర్గాలు ఏర్పడి వాళ్ళల్లో ప్రజాస్వామిక చైతన్యం పెరిగి దేశంలోని వివిధ ప్రాంతాలలో కొనసాగిన బ్రాహ్మణేతర, నడిమి వ్యవసాయ కులాల, అంటరానికులాల, బహుజన కులాల ఉద్యమాలను, పోరాటాలను ఆ వ్యాసంలో వివరంగా చర్చించారు. ఆ క్రమంలోనే పూలే, అంబేద్కర్, రామస్వామి నాయకర్ వంటి ఆలోచనాపరుల ఆందోళనలను వాటికున్న పరిమితులతో సహా వివరించారు.

వలస పాలన అనంతర కాలంలో జమీందారీ రద్దు చట్టాల అమలు, పెట్టుబడిదారీ సంబంధాలు విస్తృతం కావటం, ప్రజా పోరాటాలు... కొట్టిన దెబ్బల కారణంగా కుల సమీకరణలు గణనీయ మార్పులకు లోనయ్యాయి. వివిధ కులాలలో కొత్త వర్గాలు అభివృద్ధి చెందాయి. దేశంలోని పలు ప్రాంతాలలో కులానికి వర్గానికి ఒకవైపు ఉన్న సన్నిహిత సంబంధం ఇప్పుడు లేదు. మధ్య కులాల నుండి కొత్త భూస్వాములు ఏర్పడ్డారు అని వివరించారు. దళిత బహుజనులకు కొంత ఊరట కలిగించటం కోసం విద్యా ఉద్యోగ అవకాశాలతో

పుస్తక సమీక్ష



## జనం గొంతు తన గొంతుగా...

# సముద్రమంత చెమటచుక్క

- మహమూద్

మనిషిలో మనిషిలా కలిసిపోతే కవే! జనం బాధలను తనవిగా భావిస్తే కవే! ఇందుకు చురుకైన కంఠం కావాలి. ఖణేల్‌మని నలుగురికి వినిపించేలా చేయాలంటే భాష కావాలి. జనం కష్టాల్ని కవిత్వీకరించటం గొప్ప విషయం అని అనుకుంటే అలాంటి కవిత్వాన్నే రాస్తున్నాడు మొయిద శ్రీనివాసరావు. దానికోసం చక్కని భాష ఆలంబనమయింది, చక్కని ప్రతీకలు ఆలంబన అయ్యాయి. వినూత్నమైన పదచిత్రాలూ, వ్యక్తీకరణలు తోడుగా వచ్చాయి. కాలం సంక్షోభాల్ని గానం చేయడానికి అవసరమైన అవగాహన, ఆ అవగాహనను కవిత్వం చేయగల తెంపరితనం ఈ పుస్తకం నిండా కనిపిస్తుంది. ఉత్తరాంధ్ర నుంచి వినిపిస్తున్న ఈ స్వరానికి వస్తు వైవిధ్య లోపం లేకపోగా లోతైన అభివ్యక్తి అదనపు బలమయ్యింది. తనచుట్టూ ప్రపంచాన్ని అరమోడ్పు కనులతో చూసేవాడికి ప్రతి మలుపులోని ప్రతి చిన్న కదలికా కవిత్వం కాక మానుతుందా? పాఠకుడికి అందవలసిన భావం, చైతన్యం అందకుండా ఆగుతుందా? తొణుకు-బెణుకు లేని నిండుతనం అతడి కవిత్వం. తన ఊరు, తన పల్లె, తన భాషలో మాట్లాడే తన జనం, తన కార్మికులు, వాళ్ళ పోరుజెండాలు, తన రైతులు - వాళ్ళ కష్టాలు, తన చుట్టూ పుస్తకాల భారం మోసే విద్యార్థులూ, తన మనుషులు - ఉత్తరాంధ్ర రైతాంగ - కార్మిక ఉద్యమాలు వాళ్ళ పాట్లు - ఘర్షణలు అన్నీ తనవిగా భావించి చిత్రించే కన్ను శ్రీనివాసరావు కలం. అక్కడక్కడ కొన్ని పలుచని వ్యక్తీకరణలున్నా మొత్తం గట్టి కవిత్వమే! అతడి పదం పంటికింద గాక నాలుక మీద నాట్యమాడుతుంది. సుతారంగా హృదయానికి తాకుతుంది. కవి అందుకోవలసిన గమ్యం అదే కదా! మారుతున్న కాలమాన పరిస్థితులను బాగా పట్టించుకుంటున్నాడనే విషయం 'వైవిధ్యభరితమైన వస్తునిష్టత' స్పష్టపరుస్తుంది. చాలా కొత్త పదాలు దొరుకుతాయీ సంకలనంలో! (మట్టిబొదె, కరెంటు చీమల, పోరుపిట్ట, కత్తెర పిట్ట) అలాగే కొత్త వ్యక్తీకరణలు అనేకం ఉన్నా ప్రత్యేకత కోసం కాక వస్తువుకు అవసరమైనంతే మేరకే వాటిని ఉపయోగించడం వల్ల కవిత్వం కవిత్వంలా ఉంది. చిన్ని చేతులతో పుస్తకాలు పట్టుకోవలసిన వాడు స్పానర్లు, రాడ్లు పట్టుకొని మెకానిక్ అవతారమెత్తి స్కూటర్లను మహాజోరుగా బాగు చేసే ప్రతిభ డాక్టర్‌గానో, ఇంజనీరుగానో గాకుండా మెకానిక్ దగ్గర ఆగిపోయిన దయనీయ స్థితిని వివరించినా, ఆధునిక పరిజ్ఞాన ఫలితమైన సెల్‌ఫోను అభివృద్ధికి గాక అభివృద్ధి నిరోధక పాత్ర పోషిస్తున్న వైనాన్ని వివరించినా, యుద్ధానికి భయపడేవాళ్ళు (సామాన్యులు) యుద్ధానికి సన్నద్ధమయ్యే పాజిటివ్ యాంగిల్‌ను పొగుడుతూనే నిజమైన శత్రువెవరో గుర్తించగలిగినపుడు విజయం సులువుగా లభిస్తుందన్నా, కార్పొరేట్ చదువుల హింసకు బక్కచిక్కిపోతున్న బాల్యపు స్వేచ్ఛ గురించి వివరించినా, దయనీయమైన ఆర్థిక పరిస్థితిలో గర్భాన్ని కూడా అరువిస్తున్న తల్లుల గురించి చెప్పినా, వినోదం పేరుతో వికృత క్రీడను వెండితెర మీద ఆవిష్కరిస్తున్న దర్శక ప్రతిభ గురించి చెప్పినా, యానామంటే అందం ఒకటే కాదు పోరుగడ్డ అని ఉత్తరాంధ్ర యాసలో వివరించినా, పని తప్ప వేరే లోకం ఎరుగని కష్టజీవుల విగత జీవనం గురించి చెప్పినా.. తనదైన ప్రత్యేక శ్రద్ధతో చెక్కిన శిల్పం సముద్రమంత చెమటచుక్క. ఖచ్చితంగా చదవవలసిన మంచి కవిత్వం.



---

రిజర్వేషన్‌ల కారణంగా ఆ కులాలకు చెందిన విద్యావంతులతో పెరిగిన నూతన చైతన్యాన్ని వివరిస్తూనే రిజర్వేషన్‌లనేవి ఊరటనిస్తాయి గాని, విముక్తి కాదని అన్నారు. ఆ మాత్రపు రిజర్వేషన్లను కూడా సహించని అగ్రకులాల వైఖరి కారణంగాను, నూతన చైతన్యం ఫలితంగాను ప్రారంభమైన దళిత పాంథర్ తిరుగుబాట్లను ప్రస్తావించారు.

ఉమ్మడి కమ్యూనిస్టు ఉద్యమం కుల సమస్యను ఆచరణ స్థాయిలోగాని, సైద్ధాంతిక రాజకీయ స్థాయిలోగాని పరిష్కరించాల్సిన సమస్యగా చేపట్టలేదని విమర్శించారు. నక్సల్బరీ కాలం నుండి ప్రారంభమైన నూతన ప్రజాస్వామిక విప్లవం, దానికి ఇరుసుగా ఉన్న వ్యవసాయిక విప్లవం, వ్యవసాయిక విప్లవంలో భాగంగా కుల - వర్గ ఐక్యతను సాధిస్తున్న వైనాన్ని దేశంలోని వివిధ ప్రాంతాలలో జరుగుతున్న పోరాటాల నుండి సోదాహరణంగా వివరించారు.

ఈ పుస్తకంలో అనూరాధ కులాన్ని కేవలం సైద్ధాంతిక దృక్పథం నుండి మాత్రమే గాక, ఆచరణ నుండి కూడా పరిశీలించిన కారణంగా ఆమె విశ్లేషణలకు మాత్రమే పరిమితం కాకుండా, కుల నిర్మూలనకు స్పష్టమైన కొన్ని కార్యక్రమాలను కూడా సూచించారు. నూతన ప్రజాస్వామిక విప్లవాన్ని విజయవంతం చేసేందుకు జరుపుతున్న ఉద్యమ క్రమంలోనే కుల వ్యవస్థకు వ్యతిరేకంగా వర్గపోరాటాన్ని ఎక్కు పెట్టాలని, బ్రాహ్మణ కుల సిద్ధాంతాన్ని, వాటికి సంబంధించిన మనుస్మృతి, భగవద్గీత వాటిని ఎండకట్టాలని ఆమె అన్నారు. కుల గుర్తింపును తెలియజేసే సంకేతాలకు, భాషా సంస్కృతులకు వ్యతిరేకంగా పోరాడాలని, కుల ఘర్షణలు జరిగే అవకాశాలు ఉన్న ప్రాంతాలలో కింది కులాల రక్షణ కోసం ప్రత్యేక దళాలను ఏర్పాటు చేయాలని, ప్రజాస్వామిక వర్గాలతో ప్రత్యేక వేదికలను ఏర్పాటు చేయాలని ఆమె అన్నారు.

విప్లవం తర్వాత కుల అణచివేత దానంతట అది అంతరించి పోతుందన్న వాదన భ్రమ అని అన్నారు. విప్లవ పోరాట సమయంలోనే కాక, విప్లవానంతరం శ్రామిక వర్గ నాయకత్వంలో కార్మిక-రైతాంగ వర్గాల కూటమి అధికారాన్ని చేజిక్కుంచుకున్న తరువాత మాత్రమే ఉత్పత్తి సంబంధాల పరిధిలో కుల వ్యవస్థ రద్దు అవుతుందని ప్రసావిస్తూ అప్పుడు కూడా ఒక భావజాలంగా కులాన్ని క్రమంగా నిర్మూలించటానికి తీసుకోవాల్సిన చర్యలను వివరించారు. ఈ విధంగా అనూరాధ రాసిన ఈ వ్యాసాలు కుల సమస్యను మార్క్సిస్టు-లెనినిస్టు భావజాలంతో అర్థం చేసుకోవాలనే వారికి ఎంతగానైనా ఉపయోగపడతాయి.



# కల్లోలిత ప్రాంతాల్లోని భారత పుత్రికల మాటేమిటి?

**- దేవికా మిట్టల్**

స్వేచ్ఛానువాదం: మిసిమి

'ఇండియాస్ డాటర్' డాక్యుమెంటరీపై భారత ప్రభుత్వ నిషేధంతో నిర్భయ కేసు మళ్లీ జనంలో చర్చకొచ్చింది. ఈ బిబిసి డాక్యుమెంటరీ అంతర్జాతీయ మహిళా దినోత్సవం రోజున ప్రసారం చేయవలసి ఉండింది. డాక్యుమెంటరీలో మాట్లాడిన ఒక నేరస్తుడి మాటలు వివాదానికి కేంద్రమయ్యాయి. అతను ఇప్పటికీ బాధితురాలినే తప్పుపడుతున్నాడు. ఈ వ్యవహారంలో వివాదాస్పదమైన మరో విషయం ఏమిటంటే నేరస్తులను ఇంటర్వ్యూ చేయడానికి అనుమతి లేదని ప్రభుత్వం అనడం. ఈ వివాదాల నేపథ్యంలో ప్రభుత్వం దీనిపై నిషేధం విధించాలని నిర్ణయించింది. అయితే జనం ఈ నిషేధాన్ని ప్రతిఘటించారు. ఇంటర్నెట్‌లో విడుదలైనప్పటి నుండి దాదాపు పది లక్షల మంది దీన్ని చూశారని చెప్తున్నారు.

డాక్యుమెంటరీలోని వివాదాస్పద వ్యాఖ్యలపై చాలా చర్చలు జరుగుతున్నాయి. ఇలాంటి వ్యాఖ్యల వెనక ఉన్న ఆలోచనా తీరు అసహజమేమీ కాదని, అది ఈ పితృస్వామిక వ్యవస్థలో పాతుకుపోయి ఉందని చాలా మంది తమ అభిప్రాయాలను పంచుకుంటున్నారు. ప్రజాప్రతినిధుల్లోనూ ఇదే విధమైన ఆలోచనా ధోరణి ఉందని గుర్తించారు.

వ్యవస్థలో మార్పు రావాలని, సమాజం పరిణతి సాధించాలని, అప్పుడే ఇలాంటి ఘటనలు జరగకుండా నివారించగలమని అభిప్రాయాలు వ్యక్తం చేస్తున్నారు. నిజమే. వ్యవస్థ అసమర్థతను, అత్యాచారానికి సమర్థింపులిచ్చే ఆలోచనా ధోరణిని గుర్తించి ప్రశ్నించడం సరైందే. దీనితోపాటు ఇదే వ్యవస్థ భిన్నాభిప్రాయాన్ని, రాజ్యహింసను వ్యతిరేకించే గొంతుకలను అణచివేయడానికి అత్యాచారాన్ని ఎట్లా ఆయుధంగా వాడుతోందో కూడా గుర్తించగలగాలి.

ఈ ప్రస్తావన భారతదేశంలోని కల్లోలిత ప్రాంతాలు- ఈశాన్య రాష్ట్రాలు (సిక్కిం కాక), జమ్మూ కశ్మీర్, నక్సలైట్ ప్రభావిత ప్రాంతాల్లో జరుగుతున్న అత్యాచారాలు, లైంగిక హింస గురించే. ఆయా ప్రాంతాల్లో భారత రాజ్యానికి ఎదురవుతున్న సవాళ్లను ఎదుర్కోడానికి ప్రభుత్వం అమానుష చట్టాలు చేసింది. శాంతిభద్రతలను కాపాడే మిష మీద అది తీవ్రమైన మానహక్కుల ఉల్లంఘనకు దారి తీసింది. సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం (ఆఫ్స్పా) వాటిలో ఒకటి. సిక్కిం తప్ప మిగతా ఈశాన్య రాష్ట్రాలన్నిటా, జమ్ము కశ్మీర్‌లలో ఈ చట్టాన్ని తీసుకొచ్చారు. ఆఫ్స్పా సాయుధ దళాలకు కనిపిస్తే కాల్చివేసే అధికారాన్ని, చిత్రహింసలు, ఇళ్లపై దాడులు, వారెంటు లేకుండా అరెస్టులు చేసే అధికారాలనే కాదు, ఆర్మీవాళ్లు ఏ నేరం చేసినా శిక్షలు పడనివిధంగా రక్షణ ఇస్తుంది. సాయుధ దళాలకు ఈ అసామాన్యమైన, అడ్డూ అదుపూ లేని అధికారం చట్టానికి వెలుపల హత్యలు, అపహరణలు, బూటకపు ఎన్‌కౌంటర్లు, చిత్రహింసలు, అత్యాచారాలకు దారి తీసింది.

దీనిని జాతీయ, అంతర్జాతీయ మానవ హక్కుల కమిషన్లు, సంఘాలు, ప్రభుత్వమే ఏర్పాటు చేసిన కమిటీలు, న్యాయవిచారణలు నిర్ధారించాయి. మహిళలపై జరుగుతున్న నేరాలకు సంబంధించిన చట్టాల్లో అవసరమైన సవరణలు సూచించడానికి నియమించబడిన జె.ఎస్.వర్మ కమిటీ సాయుధ దళాల ప్రత్యేక అధికారాల చట్టం కొనసాగింపును పున:పరిశీలించాలని కోరింది. కల్లోలిత ప్రాంతాల మహిళలకు చట్టపరమైన రక్షణ కల్పించడం గురించిన ప్రస్తావనలో ఈ విషయం చెప్పింది. అత్యాచారం, లైంగిక హింస కేసుల్లో భద్రతా దళాలు ఆఫ్స్పాను కవచంగా వాడుకునే వీలు ఉండకూడదని, మహిళల మీద లైంగిక హింస కేసుల్లో సాయుధ దళాలను, యూనిఫాంలో ఉన్న సిబ్బందిని కూడా సాధారణ నేరవిచారణ కిందికి తేవాలని కూడా కమిటీ సూచించింది.

నక్సలైట్లను అణచివేయడానికి ఉపయోగిస్తున్న చట్టాలు కూడా అదే విధమైన మానవహక్కుల ఉల్లంఘనకు దారి తీస్తున్నాయి. అమాయక ఆదివాసులను అక్రమంగా కేసుల్లో ఇరికిస్తున్నారు. చిత్రహింసలు, అత్యాచారాలు, హత్యలు చేస్తున్నారు. బైటికి తెలిసినవి, తెలియనివి, రిపోర్టు అయినవి, కానివి వేల కొద్దీ లైంగిక హింసకు సంబంధించిన కేసులు ఉన్నాయి. బహిరంగంగా బైటికొచ్చి, న్యాయం కోసం చాలా కాలంగా ఎదురు చూస్తున్న కొన్ని కేసులు ఇవి.

**తంగజం మనోరమ:** ఆఫ్స్పా నీడన ఉన్న మణిపూర్‌కు చెందిన మహిళ. 2004 జులై 10న తంగజం మనోరమను ఒక మిలిటెంట్ గ్రూపుతో సంబంధాల్లో ఉందన్న అరోపణతో భారత పారామిలిటరీ యూనిట్‌లోని 17వ అస్సాం రైఫిల్స్ ఎత్తుకుపోయారు. మరుసటి ఉదయం తూటాల గాయలతో ఉన్న ఆమె మృతదేహం పొలాల్లో కనపడింది. తూటాల గుర్తులు ఆమె మర్మాయవాల మీద కూడా ఉన్నాయి. పోస్ట్‌మార్టం ఆమెపై జరిగిన అత్యాచారాన్ని, హత్యను నిర్ధారించింది. ఇది జరిగి పదేళ్లయింది. కానీ ఇంకా న్యాయం జరగవలసే ఉంది.

**ఆసియా, నీలోఫర్ జాన్:** 2009, మే 29న షోపియాన్(జమ్మూ కశ్మీర్) లో 17 సంవత్సరాల ఆసియా, 22 సంవత్సరాల నీలోఫర్ అదృశ్యమయ్యారు. మరుసటి ఉదయం వారి మృతదేహాలు కనిపించాయి. ఇది దగ్గరిలో క్యాంపు వేసిన భద్రతా దళాలు చేసిన పనే అని, వారే అత్యాచారం చేసి హత్య చేశారని ప్రజలు ఆరోపించారు. మొదట ఎఫ్.ఐ.ఆర్ నమోదు కాలేదు. పోస్టుమార్టం రిపోర్టు అత్యాచారం జరిగిందని నిర్ధారించే గాయాలు లేవని తేల్చిందని పోలీసులన్నారు. పోస్టుమార్టం గురించి పోలీసులు చెప్పిన రిపోర్టు అబద్ధమని ప్రజలు నమ్మారు. అందువల్ల వాళ్లు తమ నిరసన ప్రదర్శనలను కొనసాగిస్తూ, జమ్మూకశ్మీర్ ప్రభుత్వం న్యాయవిచారణ కమిటీ ఏర్పాటు చేసేలా ఒత్తిడి చేశారు. న్యాయవిచారణలో ఫోరెన్సిక్ ల్యాబ్ రిపోర్టు తేల్చిందేమిటంటే వాళ్ల మీద సామూహిక అత్యాచారం జరిగిందని. పోలీసు శాఖల్లో ఏవో కొన్ని సస్పెన్షన్లు, బదిలీలు తప్ప ఈ కేసు మాత్రం ఏమీ కాలేదు.

వ్యాసం

# మావోయిస్టు ఫోబియా

-క్రాంతి

పాలకులు మారినంత మాత్రాన.. పాలక విధానాలు మారవనడానికి ప్రస్తుత సందర్భం ఓ ప్రత్యక్ష ఉదాహరణ. కవులు, కళాకారులు, హక్కుల కార్యకర్తలపై దేశవ్యాప్తంగా అమలవుతున్న నిర్బంధమే అందుకు సాక్ష్యం. అది తెలంగాణ అయినా.. ఆంధ్ర అయినా, చత్తీస్‌ఘడ్ అయినా, కేరళ అయినా, కాశ్మీర్ అయినా ప్రజల పక్షాన నిలబడం, నలుగురు కలవడం, రాజ్యాన్ని ప్రశ్నించడం నేరంగా మారుతోంది. అందుకే సమావేశాలపై నిషేధాజ్ఞలు అమలవుతున్నాయి. నినాదాల గొంతులకు ఉక్కు తాళాలు బిగుస్తున్నాయి.

జనవరి 29వ తేది నల్లగొండలో జరగాల్సిన తెలంగాణ విద్యార్థి వేదిక నాలుగవ రాష్ట్ర మహాసభలకు అనుమతి లేదంటూ పోలీసులు అడ్డుకునేందుకు యత్నించారు. ముందురోజు సాయంత్రమే హాలుకు తాళం వేసి సభ నిర్వహణకు అవకాశం ఇవ్వద్దంటూ హాల్ యాజమాన్యాన్ని బెదిరించారు. ప్రొఫెసర్ హరగోపాల్ తదితరుల చొరవ తరువాత అనుమతి ఇచ్చినా.. రెండు రోజుల సభలు పోలీసు నిఘా నీడలో జరుపుకోవాల్సి వచ్చింది. సమైక్య రాష్ట్రంలో మాదిరి ప్రత్యేక రాష్ట్రంలో సైతం ప్రజా సంఘాలు ఆంక్షల్ని ఎదుర్కోవలసి రావడం ఇక్కడ గమనార్హం. గత సెప్టెంబర్ 21న హైదరాబాద్ నగరంలో ప్రత్యామ్నాయ రాజకీయాల గొంతునొక్కేందుకు యత్నించిన పోలీసులు మళ్లీ అలాంటి వాతావరణాన్నే సృష్టించారు. భావ ప్రకటనా స్వేచ్ఛను కట్టడి చేయాలనుకున్నారు. తెలంగాణలోనే కాదు.. ఆంధ్ర రాష్ట్రంలోనూ ఇలాంటి సంఘటనలు ఈ ఎనిమిది నెలల కాలంలో అనేకం జరిగాయి. తిరుపతి, విశాఖల్లో ప్రజా సంఘాలు తలపెట్టిన ఆపరేషన్ గ్రీన్‌హంట్ వ్యతిరేక సభను అడ్డుకున్న పోలీసులు, విశాఖలో సభ నిర్వాహకులను విలేఖరుల సమావేశంలోంచే అరెస్టు చేసి తీసుకెళ్లారు. ఇప్పుడు కేరళా పోలీసులు సైతం ప్రజా సంఘాల పట్ల ఇలాంటి వైఖరినే అవలంబిస్తున్నారు. జనవరి 29, 30తేదీలలో కేరళలో ఇరవై మందికిపైగా ప్రజా సంఘాల, హక్కుల కార్యకర్తలను అరెస్టు చేసి దేశవ్యాప్తంగా ప్రజాచైతన్యంపై అమలవుతున్న అణచివేత స్వభావాన్ని మరోమారు చాటారు. ప్రజాస్వామ్యం ముసుగులో నియంతృత్వం రాజ్యమేలుతోందనడానికి ఇవి తాజా ఉదాహరణలు.

కాశ్మీర్ నుంచి ఈశాన్య రాష్ట్రాలు, తూర్పు మధ్య భారతాల మీదుగా దక్షిణాది వరకు అంతటా ప్రజల ప్రాథమిక హక్కుల హననం జరుగుతోంది. కె.సి.ఆర్, చంద్రబాబు, నరేంద్రమోడీ పాలకులెవరైనా... పార్టీ ఏదైనా... ఇప్పుడు దేశమంతటా ఒకే పాలసీ. బహుళజాతి సంస్థల ప్రయోజనాలు కాపాడడం. ప్రజా ఉద్యమాలపై ఉక్కుపాదం మోపడం. ప్రజల పక్షాన నిలబడినందుకు మొన్న బినాయక్‌సేన్ మావోయిస్టు అయ్యాడు. నిన్న సాయిబాబా, ఇవాళ జైసన్, తుషార్‌లు. పరీక్ష గది నుంచి ఒక ప్రొఫెసర్‌ని, పాత్రికేయ సమావేశం నుంచి ఒక హక్కుల కార్యకర్తని, హాస్పిటల్ నుంచి ఒక వైద్యున్ని, వేదిక మీది నుంచి ఒక కళాకారుడిని మాయం చేయగల ప్రజాస్వామ్యమిది. మోడీ అధికారం చేపట్టడానికి ఒక రోజు ముందే మహారాష్ట్ర పోలీసులు దేశ రాజధానిలోంచి ప్రొఫెసర్ సాయిబాబాను అరెస్టు చేసి తీసుకెళ్లారు. సాయిబాబాకు మావోయిస్టులతో సంబంధాలున్నాయంటూ అన్ లాఫుల్ యాక్టివిటీస్ ప్రివెంటీవ్ యాక్ట్ (ఉపా) కింద అక్రమ కేసులు బనాయించారు. తొంభై శాతం వికలాంగుడైన సాయిబాబాను జైలులో నిర్బంధించి తొమ్మిది నెలలు గడుస్తున్నా ఇప్పటికీ బెయిల్ మంజూరు కాకుండా అడ్డుపడుతున్నారు. రాజకీయ విశ్వాసాలు కలిగి ఉన్న కారణంగా పోలీసు నిర్బంధాల్ని ఎదుర్కొన్న, ఎదుర్కొంటున్న వారిలో సాయిబాబా మొదటి వ్యక్తీ కాదు.. చివరి వ్యక్తీ కాదు. ఎందుకంటే.. సాయిబాబాకు ముందే అరెస్టయిన జేఎన్‌యూ విద్యార్థి హేమ్ మిశ్రా

---

**కునన్ పోష్పోరా గ్రామంలోని అత్యాచార బాధితులు:** 1991 ఫిబ్రవరి 23, 24 మధ్య రాత్రి ఉత్తర కశ్మీరులోని కుప్వారా జిల్లాకు చెందిన జంట గ్రామాలు కునన్, పోష్పోరా. ఆర్మీకి చెందిన 68 బ్రిగేడ్, 4వ రాజ్‌పుతానా రైఫిల్స్ 40 మంది స్త్రీల మీద మూకుమ్మడిగా సాముహిక అత్యాచారానికి పాల్పడిన ఘటనకు ఆ గ్రామాలు సాక్షీభూతంగా నిలిచాయి. బాధితుల్లో చిన్న పిల్లలు, గర్భిణీ స్త్రీలు, ముసలి ఆడవాళ్లు కూడా ఉన్నారు. మునుపటి కేంద్ర విదేశీ వ్యవహారాల మంత్రి సల్మాన్ ఖుర్షీద్ ఈ సంఘటన జరిగినట్లు ఒప్పుకున్నారు. 'నా దేశంలో ఇలాంటిది జరగినందుకు నేను సిగ్గుపడుతున్నాను. ఇది నా దేశంలో జరిగినందుకు నేను దిగ్భ్రాంతి చెందుతూ క్షమాపణలు కోరుతున్నాను.' అన్నాడాయన. అయినా న్యాయం వాళ్లను తప్పించుకుని తిరుగుతోంది.

**సోనీసోరీ -ఆదివాసీ పౌరహక్కుల కార్యకర్త:** చత్తీస్‌ఘడ్‌కు చెందిన 35 సంవత్సరాల ఆదివాసీ స్కూలు టీచరు నక్సలైటుగా ఆరోపించబడింది. అయితే ఆమె వాళ్లకు వ్యతిరేకమని ఆధారాలు చెబుతున్నాయి. అయినా చత్తీస్‌ఘడ్ పోలీసులు ఆమెను ఇరికించారు. పోలీసులు ఆమెను లైంగిక హింసకు గురిచేసి కరెంటు షాకులిచ్చారు. వైద్య పరీక్షల్లో ఆమె యోనిలో, మలద్వారంలో రాళ్లు ఉన్నట్లు గుర్తించారు. చిత్రహింసలకు నేతృత్వం వహించింది ఎస్‌పి అంకిత్ గార్గ్. అయితే రాజ్యం అతన్నేం చేసింది? రిపబ్లిక్‌డే రోజు అతనికి రాష్ట్రపతి అవార్డు ఇచ్చి సత్కరించింది.

పైన చెప్పినట్లు ఘర్షణాత్మక ప్రాంతాల్లో లైంగిక హింస అనేది అసాధారణ విషయమేమీ కాదు. అది విస్తరించి ఉంది. అయినా నిర్భయ వంటి సంఘటన రాజేసిన ఆగ్రహావేశాలను ఇవి రాజేయలేదు. ప్రభుత్వం, న్యాయవ్యవస్థతో పాటు, ఈ వాస్తవాలను తెలిసిన వాళ్లు కూడా మౌనంగా ఉన్నారు. వాళ్లు భారత పుత్రికలు కారా? కనీసం వాళ్లు స్త్రీలు కూడా కారా? ఈ హిపోక్రసీని ప్రశ్నించవలసి ఉంది.

(రచయిత ఢిల్లీ స్కూల్ ఆఫ్ ఎకనామిక్స్, సోషియాలజీ విభాగంలో ఎం.ఫిల్. విద్యార్థిని. countercurrents.org నుండి సేకరణ.)



మొదలు ఎందరో ప్రజా కార్యకర్తలు ఇప్పటికీ జైళ్లలో మగ్గుతూనే ఉన్నారు. తాజాగా కేరళ పోలీసులు ఉద్యమకారుడు, బ్లాగర్ జైసన్ కూపర్, రాజకీయ ఖైదీల విడుదల కమిటీ రాష్ట్ర కార్యదర్శి, న్యాయవాది తుషార్ నిర్మల్ సారథిని అరెస్టు చేశారు. వీరిరువురే కాదు.. వరుసగా కొచ్చి, కోజికోడ్, వయనాడ్ పరిసర ప్రాంతాల్లోని పలు కాలేజీ హాస్టళ్లు, ప్రజా సంఘాల కార్యకర్తల ఇళ్లపై దాడి చేసి మరో 17 మందిని అరెస్టు చేశారు. వీరందరికీ మావోయిస్టులతో సంబంధాలున్నాయంటూ ఊపా కింద అక్రమ కేసులు బనాయించారు.

జైసన్ కూపర్ స్టేట్ ఇన్సురెన్స్ డిపార్ట్‌మెంట్‌లో ఉద్యోగి. సోషల్ మీడియాలో ప్రజానుకూల రచనలతో బ్లాగర్‌గా సుపరిచితుడు. మానవ హక్కులపై రచనలు చేస్తుంటాడు. ప్రజా వ్యతిరేక పాలక విధానాలను విమర్శనాత్మకంగా విశ్లేషిస్తుంటాడు. జనవరి 29వ తేదిన జైసన్ కూపర్‌ని ఎర్నాకులం నుంచి అరెస్టు చేసి తీసుకెళ్లిన పోలీసులు అతని సహచరులతో రెండు గంటల్లో పంపిస్తామని చెప్పారు. పోలీసులు స్టేషన్‌కి వెళ్లాక రొటీన్‌గా మాటమార్చారు. అదే రోజు మానవ హక్కుల కార్యకర్త తుషార్ సారథిని కోజికోడ్‌లో విలేఖరుల సమావేశంలోంచి అరెస్టు చేసి తీసుకెళ్లారు. ఎలాంటి వారెంట్ లేకుండా దాడులకు పాల్పడిన పోలీసులు సారథి ఇంట్లోంచి ఫైళ్లు, పుస్తకాలు స్వాధీనం చేసుకొని విప్లవ సాహిత్యమంటూ ప్రచారం చేశారు. నిజానికి అరెస్టుకు పదిరోజుల ముందే సారథి తన ఫోన్ ట్యాప్ అవుతోందని ప్రభుత్వానికి ఫిర్యాదు చేశారు. అరెస్టు పరిణామాలను పరిశీలిస్తే ఫోన్ ట్యాప్ చేసింది పోలీసులేనని అర్థం చేసుకోవచ్చు.

నిర్వాసిత ఆదివాసీలు, దళితులు, శ్రామిక జనం పక్షాన నిలబడమే వీళ్లు చేసిన నేరం. దేశ సంపదను కార్పొరేట్లకు దోచిపెట్టడాన్ని వ్యతిరేకిస్తున్న ప్రజా ఉద్యమాన్ని సమర్థించినందుకు తుషార్ సారథి, జైసన్‌లు మావోయిస్టులయ్యారు. గత జూలై 28న కేరళలోని వలప్పాడ్‌లో జరిగిన మావోయిస్టు నేత సినోజ్ సంస్మరణ సభలో పాల్గొన్నందుకు జోనథాన్ బౌద్ అనే స్విట్జర్లాండ్ వాసి మావోయిస్టయ్యాడు. టూరిస్ట్ వీసాపై దేశంలో పర్యటిస్తున్న జోనథాన్‌ని అరెస్టు చేసిన పోలీసులు అతనిపై మావోయిస్టు ముద్రవేశారు. మన దేశీయులు, పరదేశీయులు.. ప్రజా సంఘాల కార్యకర్తలే కాదు.. పాత్రికేయులు సైతం మావోయిస్టులుగా మారిపోతున్నారు. కొచ్చి ఆకాశవాణి ఎఫ్‌ఎంలో ప్రోగ్రాం ప్రొడ్యూసర్ / ప్రసెంటర్‌గా వ్యవహరించే ఆరాధనపై సైతం నేషనల్ ఇన్వెస్టిగేషన్ ఏజెన్సీ అధికారులు మావోయిస్టు ముద్రవేశారు. కొచ్చి ఆల్ ఇండియా రేడియోలో కరెంట్ అఫైర్స్‌పై ఆరాధన నిర్వహించే ఎనిమిది నిమిషాల 'సమకాలికం' కార్యక్రమం మావోయిస్టులకు అనుకూలంగా ఉందంటూ ఆమెను అరెస్టు చేసి, ప్రోగ్రాం టేప్స్‌ని సీజ్ చేశారు. ఇటీవల తమిళ రచయిత పెరుమాళ్ మురుగన్ సంఘీభావ సభలో పాల్గొని వస్తున్న షాహీద్ షమీద్, ఉదయ బాలకృష్ణన్‌లను కన్నూర్‌లో మావోయిస్టులుగా అనుమానిస్తూ అదుపులోకి తీసుకున్నారు పోలీసులు. ఈ క్రమంలోనే జైసన్, తుషార్ తదితరుల అరెస్టు.

మావోయిస్టు సానుభూతి పరుల పేరిట హక్కుల కార్యర్తల్ని అరెస్టు చేయడాన్ని మార్చి 3న జాతీయ మానవ హక్కుల కమిషన్ సుమోటోగా స్వీకరించింది. రెండు వారాల్లోగా కేసుపై వివరణ ఇవ్వాలంటూ కేరళ డి.జి.పి.ని ఆదేశించింది. ఆమ్నెస్టీ ఇంటర్నేషనల్ ఇండియా సైతం కూపర్, తుషార్‌ల అరెస్టుపై స్పందించింది. అధికారులు భావ ప్రకటనా స్వేచ్ఛను గౌరవించాలంటూ వ్యాఖ్యానించింది. జైసన్, తుషార్‌లను విడుదల చేయాలంటూ అరుంధతీ రాయ్, సంజయ్ కక్, కె. సచ్చిదానందన్, సుజాతో భద్ర, బెర్నాడ్ డి మెల్లో, ఆనంద్ తేల్‌తుమ్డే, కె.పి. శశి, జయన్ చెరియన్, మీనా కందసామితో సహా పలువురు అంతర్జాతీయ రచయితలు కేరళ రాష్ట్ర ముఖ్యమంత్రిని డిమాండ్ చేశారు.

మావోయిస్టులను దేశ అంతర్గత భద్రతకు ముప్పుగా భావిస్తున్న ప్రభుత్వం విప్లవోద్యమ అణచివేత లక్ష్యంగా ఆదివాసీలు, దళితులు, అట్టడుగు శ్రామిక ప్రజలు, ఉద్యమకారులపై దాడులకు తెగబడుతోంది. అందులో భాగంగానే సామాజిక, హక్కుల కార్యకర్తలపై మావోయిస్టు ముద్రవేస్తోంది. గత డిసెంబర్‌లో కేంద్ర హోం మంత్రిత్వ శాఖ విడుదల చేసిన నివేదికలో 'పీపుల్స్ లిబరేషన్ గెరిల్లా ఆర్మీ కంటే నగరాల్లో పనిచేసే కార్యకర్తలే అత్యంత ప్రమాదం' అని పేర్కొనడమే అందుకు నిదర్శనం. మావోయిస్టు పార్టీకి 21 రాష్ట్రాల్లో 128 అనుబంధ సంస్థలున్నాయని, అవి విద్యావంతులైన యువతను రిక్రూట్ చేసేందుకు సహకరిస్తున్నాయని నివేదికలో పేర్కొంది. పౌర వేదికలు, హక్కుల సంఘాలు, స్వచ్ఛంద సంస్థల పేరిట మావోయిస్టు శ్రేణులు పనిచేస్తున్నాయంటూ దుష్ప్రచారానికి తెరలేపింది.

పాలక వర్గాలు సామాజిక, రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక రంగాల్లో ఆధిపత్యం కోసం మెజార్టీ ప్రజల ప్రయోజనాలను ఫణంగా పెడుతున్నాయి. దేశ సహజ వనరులను విదేశీ బహుళజాతి సంస్థలకు దోచిపెడుతూ పెట్టుబడిదారుల ప్రయోజనాలను కాపాడుతున్నాయి. ఈ దోపిడీని ప్రశ్నించే శక్తులను అణచివేయమడమే ఇప్పుడు పాలక వర్గాల లక్ష్యంగా మారింది. దాని ఫలితమే మధ్య భారతంలో వేగిరమవుతున్న ఆపరేషన్ గ్రీన్‌హంట్. ఒకవైపు దోపిడీ శక్తులు... మరోవైపు శ్రామిక శక్తుల మధ్య వర్గ పోరాటం తీవ్రమవుతున్న నేపథ్యంలో పాలకులు తమ ఆధిపత్యాన్ని కాపాడుకునేందుకు నేరుగా ప్రజలపై యుద్ధానికి తెగబడుతున్నారు. అందుకు మావోయిస్టు బూచిని సాకుగా చూపించి దేశ వ్యాప్తంగా ప్రజా ఉద్యమకారులపై దాడికి పాల్పడుతున్నారు. టాటాలు, పోస్కోలు, వేదాంతలు నిర్దేశించే పాలక విధానాలు అణచివేతను ప్రోత్సహించేవిగానే ఉంటాయనడానికి ప్రస్తుత సందర్భం ఓ ఉదాహరణ మాత్రమే.

దేశ వ్యాప్తంగా అమలవుతున్న పాలక విధానాల్ని చూస్తే ఇది ప్రజాస్వామ్యమా? లేక నియంతృత్వమా? అనే సందేహం కలగక మానదు. మావోయిస్టు ఫోబియాతో విపరీతంగా ప్రవర్తిస్తున్న పాలకులు పోలీసులకు సర్వాధికారాలు ఇచ్చి ప్రజల ప్రాథమిక హక్కుల్ని కాలరాస్తున్నారు. అసలు రాజకీయ విశ్వాసాలు కలిగి ఉండడాన్నే దేశ ద్రోహంగా పరిగణిస్తూ, ప్రజలనే శత్రువులుగా భావిస్తున్నారు. అక్రమ అరెస్టులు, చిత్రహింసలు, ప్రత్యేక అధికారాలు, సాయుధ బలగాలే 'ప్రజాస్వామ్య 'చిహ్నాలుగా మారి బహుళజాతి సంస్థల ప్రయోజనాలు కాపాడుతున్నాయి. ప్రశ్నించడాన్ని సహించలేని పాలకులు... ప్రజల పక్షం వహించే కవులు, కళాకారులు, సాహితీవేత్తలు, ఉద్యమకారులను నాయనో భయానో లొంగదీసుకునేందుకు యత్నిస్తున్నారు. ప్రజాస్వామ్యాన్ని ప్రశ్నార్థకంగా మార్చుతున్నారు. రాజకీయ, భావ ప్రకటనా స్వేచ్ఛను కాపాకునేందుకు ప్రతి ఒక్కరూ తప్పక మాట్లాడాల్సిన సందర్భం ఇది. మౌనం వీడాల్సిన సందర్భం. లేదంటే మార్టిన్ అన్నట్లు '...చివరకు వాళ్లు నీ కోసం కూడా వస్తారు/ అప్పుడు నీ కోసం మాట్లాడ్డానికి ఎవరూ మిగిలి ఉండరు'.



అనువాద వ్యాసం

# వాతావరణ సంక్షోభ మూలం పెట్టుబడిదారీ విధానం

రోబ్ యురీ

అనువాదం : పి. అరవింద

పర్యావరణ సంక్షోభాన్ని గురించిన పాశ్చాత్య విశ్లేషణ ప్రకారం, లోకం లోని అన్ని దేశాలు, ధనిక - పేద, ఉత్తర - దక్షిణ, పెట్టుబడిదారీ - కమ్యూనిస్టు అనే తేడా లేకుండా ప్రపంచ వాతావరణ వేడి పెరగడానికి దోహదం చేశాయి. ముఖ్యమైన విషయాలపై చర్చని కొనసాగించేందుకు అనవసర విరోధాలని పక్కన పెట్టే ముసుగులో ఈ విశ్లేషణ సాగుతుంది. మనమందరం ఈ సంక్షోభానికి కారణమైతే దాన్ని పరిష్కరించడం కూడా మనందరి బాధ్యత అనే ధోరణి దీనిది. కాని, వాస్తవాలు, చరిత్ర ఆధారంగా చూస్తే, ఈ సంక్షోభానికి కారణం ఒక నిర్దిష్ట రాజకీయార్థిక వ్యవస్థేమో? ఈ వ్యవస్థలోనే పర్యావరణాన్ని విధ్వంసం చేసే సామాజిక నిర్మాణం, సాంకేతిక నైపుణ్యం, ఉద్దేశ్యం, రెండు వందల ఏళ్ళ చరిత్ర ఉన్నాయేమో?

పెట్టుబడిదారీ విధానం వాతావరణ సంక్షోభానికి కారణమా కాదా అనేది సిద్ధాంత పరమైన చర్చ కాదు, అది వాస్తవాన్ని అర్థం చేసుకోవడానికి అవసరం. అసలు ఏ సమస్యకైనా పరిష్కారం కావాలంటే దాని మూల కారణం తెలుసుకోవాలి. పెట్టుబడిదారీ విధానం బ్రిటన్లో 18వ శతాబ్దంలో మొదలైంది. పుట్టింది మొదలు, 1850 నుండి పెరిగిన పారిశ్రామికీకరణ దశలు దాటి, ఇప్పటి చైనా లోని రాజ్య పెట్టుబడిదారీ వ్యవస్థ దాకా, పెట్టుబడిదారీ విధానం ఎక్కడ విస్తరిస్తే అక్కడ వాతావరణ వేడిని పెంచే కార్బన్ ప్రసరణలు పెరిగాయనడానికి తార్కాణం ఈ కింది గ్రాఫ్ (ఫిగర్ 1). గ్రాఫ్ ప్రకారం, పారిశ్రామికీకరణ 1850 నుండి పెరిగిన కొద్దీ వాతావరణంలో బొగ్గు పులుసు వాయువులు పెరుగుతూ వచ్చి, ఇరవయ్యో శతాబ్దపు మొదట్లో కారుల వాడకం పెరగడంతో అవి మరీ ఎక్కువగా పెరిగాయనేది అర్థం అవుతుంది. గ్రాఫ్ లో 1960 వరకే డేటా ఉంది కాని 1970 - 2011 మధ్య కార్బన్ ప్రసరణలు రెండింతలు పెరిగాయి.

పెట్టుబడిదారీ విధానం, ఇంకో రకంగా చెప్పాలంటే పాశ్చాత్య ఆర్థిక విధానం లోని లాభాపేక్ష, పెట్టుబడిదారులు పర్యావరణాన్ని విధ్వంసం చేసే దిశగా ప్రోత్సహిస్తుంది. ఈ విధ్వంసం అనేది ఉత్పత్తి కోసం లోకం చెల్లించుకోవాల్సిన మూల్యంగా, పెట్టుబడిదారులకి మాత్రం లాభంగా మిగులుతుంది. ఈ లాభాపేక్ష కారణంగానే ఖర్చులు



(ఫిగర్ 1)

తగ్గించడానికని యాంత్రికీకరణ పెరుగుతుంది. 1850 నుండి యాంత్రికీకరణ ఎక్కువగా ఫాసిల్ ఇంధనాల శక్తి మీద ఆధారపడుతూ వచ్చింది. ఫాసిల్ ఇంధనాలని శక్తి కోసం కాల్చడమే వాతావరణంలో బొగ్గుపులుసు వాయువు పెరగడానికి మూల కారణం. ఆ వివరాలు కింది గ్రాఫ్ (ఫిగర్ 2) లో చూడవచ్చు. 1850 - 1960 మధ్య 110 ఏళ్ళలో అమెరికా, ఇంగ్లండ్, జర్మని కలిసి రష్యా, చైనాల కన్న పది రెట్లు ఎక్కువ బొగ్గుపులుసు వాయువుని వాతావరణంలోకి వదిలారు.



(ఫిగర్ 2)

పాశ్చాత్య ఆర్థిక విధానమంతా పెట్టుబడిదారీ ఆర్థిక విధానమే, కాకపోతే దాన్ని అవలంబించే వాళ్ళకి అది కొట్టొచినట్టు కనపడక పోవచ్చు. ప్రభుత్వానికి పెట్టుబడిదారీ ఉత్పత్తికి, వినియోగదారుడికి పెట్టుబడిదారీ విధానానికి ఉన్న సంబంధాలు పైపైకి వేరుగా అనిపించవచ్చు. కానీ బ్రిటన్ లోని రాజ్య పెట్టుబడిదారీ దశ నుంచి, అమెరికాలోని మిలిటరీ - ఆర్థిక - పారిశ్రామిక పెట్టుబడిదారీ దశ దాక, ఇంకా ఇటీవలి చైనా వరకు, రాజ్యాన్ని ఆర్థిక చోదక శక్తులనుంచి వేరుగా చూడలేము. వినియోగదారుల అవసరాలే ఆర్థిక ఉత్పత్తిని నడుపుతాయనే పెట్టుబడిదారుల వాదన, అసలీ వినియోగదారులు పుట్టింది వినియోగాన్నే ఉత్పత్తిగా చూపెట్ట గల బాగ వృద్ధి చెందిన దేశాల్లో అనే విషయం పక్కన పెడుతుంది.

ఇట్లా ఆర్థికాన్ని రాజకీయ ఆర్థిక వ్యవస్థ నుండి విడదీసి చూడడం అనేది రాజకీయాలకి స్థానం ఇవ్వని ఆర్థిక సిద్ధాంతాల నుంచి వచ్చింది. వాల్ స్ట్రీట్ లోని ఆర్థిక సంస్థలకిస్తున్న గ్యారంటీలు, సబ్సిడీలు; మిలిటరీ, చమురు, గ్యాస్ ప్రయోజనాల కొరకు చేస్తున్న యుద్ధాలు; ప్రజలందరి మీద అమలవుతున్న నిఘా వ్యవస్థ - ఇవన్నీ తమ వర్గ ప్రయోజనాల కోసం కార్పొరేట్లు, రాజ్యం అవలంబిస్తున్న విధానాలే. ఈ విషయం చెప్తే పాశ్చాత్య ఆర్థికవేత్తలు విపరీతంగా ఆశ్చర్య పోతారు - ఎందుకంటే వాళ్ళు ఆర్థికాన్ని రాజకీయాల నుంచి, వర్గ ప్రయోజనాల నుంచి విడిగా చూస్తారు కాబట్టి. కింది గ్రాఫ్ (ఫిగర్ 3) ని చూస్తే అమెరికా యిరోపా కన్నా రెండు రెట్లు, ఆసియా కన్న నాలుగు రెట్లు ఎక్కువ తలసరి బొగ్గుపులుసు వాయువులని వాతావరణంలోకి వదులుతోందని అర్థమవుతుంది. దీన్ని బట్టి పెట్టుబడిదారీ ఉత్పత్తితో ఎవరు లాభ



(ఫిగర్ 3)

పడుతున్నారో, ఎవరు నష్ట పోతున్నారో స్పష్టంగా తెలుస్తోంది. పాశ్చాత్య ఆర్థికవేత్తలు వినియోగాన్ని ఉత్పత్తి నుంచి వేరు చేసి చూడడంతో, మనిషి జీవనానికి, పనికి కావాల్సిన కనీస అవసరాలైన తిండి, ఇల్లు, బట్ట, రవాణా సౌకర్యం కూడా వినియోగ వస్తువులుగా మారిపోతాయి. ఈ సందర్భంలో ఆర్థిక స్వేచ్ఛ అనేది ఆర్థిక నిర్మాణంగా కాకుండా, ఉత్పత్తుల మధ్య పోటీగా ఉంటుంది. పర్యావరణాన్ని దృష్టిలో పెట్టుకుని హైబ్రిడ్ కారు నడపడమా లేక పెట్రోల్ అధికంగా వాడే కారు నడపడమా అనే ఎంపిక మిగిలిపోతుంది కానీ, అసలు కారు నడపడాన్ని అవసరంగా మార్చిన సామాజిక నిర్మాణాన్ని ప్రశ్నించేది ఉండదు. దీని పర్యవసానంగా, పర్యావరణ సంక్షోభానికి పరిష్కారం వినియోగదారుల, వ్యక్తుల బాధ్యతగా మారిపోతుందే కాని సామాజిక పరిష్కారం వైపు వెళ్ళదు.

ఈ క్రమం చివరికి వినియోగతత్వాన్ని, పెట్టుబడిదారుల ప్రయోజనాల కోసం సాంకేతిక నిపుణులు సృష్టించిన సంస్కృతిగా కాకుండా, సర్వ సాధారణ విషయంగా చేస్తుంది. ఆధునిక వినిమయతత్వం ఒక శతాబ్దపు పెట్టుబడిదారీ ప్రచారం (ఇంకో రకంగా చెప్పాలంటే అడ్వర్టైసింగ్) తో ఏర్పడింది. 'పబ్లిక్ రిలేషన్స్' పేరుతో ప్రజలని ఒప్పించడం అనేది ప్రచారానికి సంబంధించినదే. ఒక పక్క అడ్వర్టైసింగ్ మన లోపల దాగి ఉన్న కోరికలని వెలికి తీయడానికి మానసిక సమ్మతిని తయారు చేస్తుంది. ఇంకో పక్క పాశ్చాత్య ఆర్థికవేత్తల 'వినియోగదారుడి ఎంపిక' అనేది స్వేచ్ఛగా ఎంపిక చేసుకోవడం మీద, మానసిక సమ్మతికి వ్యతిరేకంగా పని చేస్తుంది. ఎంత విచిత్రమైన పరిస్థితి!!

కింద గ్రాఫ్ (ఫిగర్ 4) లో నీలం రంగు గీత యు.ఎస్. లోని దిగువ 90% కుటుంబాల సంపద ని, ఎర్ర రంగు గీత 0.1% సంపన్న కుటుంబాల సంపదని సూచిస్తాయి. పర్యావరణ విధ్వంసం నుంచి వచ్చిన లాభాలు అతి కొద్ది మందికే అంది, నష్టాలు మాత్రం విస్తృతంగా



(ఫిగర్ 4)

పంచబడడం చూస్తే ఇది పై నుంచి ప్రకటించిన వర్గ పోరాటమనే నిశ్చయానికి రాక తప్పదు.

చారిత్రకంగా, భౌగోళికంగా, భౌతికంగా పెట్టుబడిదారీ ఉత్పత్తికి పర్యావరణ విధ్వంసానికి ఉన్న సంబంధాలని చూస్తే, పెట్టుబడిదారీ వ్యవస్థ ఎటువంటి నష్టాలు కలిగించకుండా ఇట్లాగే కొనసాగ గలదని ఎవరన్నా అంటే అది నమ్మశక్యం కాని విషయం. ఇక్కడ ప్రపంచ వ్యాప్తంగా వాతావరణం వేడెక్కడం ఒకటే సమస్య కాదు, మొత్తంగా పర్యావరణ విధ్వంసమే పెట్టుబడిదారీ విధాన ఫలితం. పెట్టుబడిదారీ పోటీని పారిశ్రామిక చేపల వేటతో పోలిస్తే, రెండు కూడా ఇంకేది మిగలనంత వరకు తీసేసుకుంటాయి, చివరికి సముద్రమే ఖాళీ ఐపోతుంది. పారిశ్రామిక చేపల వేటలో వధించిన సగం పైగా చేపలని చివరికి చెత్త కింద సముద్రం లోకే పారేస్తారు, అదీ పెట్టుబడిదారీ విధానమంటే.

ఐ.పి.సి.సి. ప్రపంచ వ్యాప్త వాతావరణ వేడి పెరగుదల గురించి చేసిన విశ్లేషణ ప్రకారం, వెంటనే గ్రీన్ హౌస్ వాయువులని పెద్ద ఎత్తున, ప్రస్తుతం ప్రతిపాదనలలో ఉన్నదాన్ని మించి తగ్గించకపోతే విపత్తు తప్పదు. తలసరి బొగ్గుపులుసు వాయువుల గ్రాఫ్ చూపెట్టినట్టుగా పశ్చిమ దేశాలు గత రెండు వందల ఏళ్ళుగా పర్యావరణాన్ని ఆర్థికంగా దోచుకుని తమ సంపన్నుల జేబులు నింపి, విధ్వంసాన్ని మాత్రం ప్రపంచానికి పంచి పెట్టాయి. ఒక పక్క అమెరికన్లు నాలుగు రెట్లు బొగ్గుపులుసు వాయువుని ఉత్పత్తి చేస్తూంటే, చైనీయులని పర్యావరణ రక్షణ కోసం తమ ఆర్థికాభివృద్ధి ని వదిలెయ్యమని ఒప్పించడం అసంభవం.

చమురు, గ్యాస్ కంపెనీల నుంచి పన్నులు వసూలు చేసి వాటితో పర్యావరణ రక్షణ కార్యక్రమాలు చేపట్ట వచ్చునే ఆలోచనలు ఉన్నాయి కాని అటువంటి కార్యక్రమాలు లేవు, ఉన్నా అవి ఇంకో రకంగా పర్యావరణ, సామాజిక విధ్వంసం సృష్టించవని చెప్పలేము. 2000లో, సోలార్ ప్యానల్‌లని, గాలి టర్బైన్‌లని ఉత్పత్తి చేసే పని చైనాకి ఇచ్చినప్పుడు, దాని పర్యావరణ వెల అదే పని పాశ్చాత్య దేశాల్లో చేసినదానికంటే నాలుగు రెట్లు ఎక్కువయ్యింది. అంతే కాక, అటువంటి కార్యక్రమాలు ఫలితాన్నివ్వాలంటే పాశ్చాత్య దేశాల ప్రభుత్వాలు వ్యాపార సంస్థల కబంధ హస్తాల నుంచి విడివడి, సమస్యలకి పరిష్కార మార్గాలు వెదకాలి, అది ఎంత మాత్రమూ జరగని పని.

యదాస్థితిలోని మార్పుల వలన పెద్ద ఎత్తున నష్ట పోయే పాశ్చాత్య దేశాల సంపన్నులు మార్పులని తీవ్రంగా ప్రతిఘటిస్తారు. వాళ్ళ తర్వాత అధిక తలసరి బొగ్గుపులుసు వాయువులున్న దేశాలు మార్పులని వ్యతిరేకిస్తాయి. సంపన్న దేశాల్లో మళ్ళీ వర్గ ప్రయోజనాలు ఇంకో విభజనకి దారి తీస్తాయి.

పెట్టుబడిదారీ విధానాన్ని సూటిగా ఎదుర్కోకపోయినా అది మంచి ఫలితాలనిస్తే అట్లాగే చెయ్యవచ్చు కాని అట్లా జరిగిందనడానికి ఆధారాలు లేవు. ఎవరికి ఏమి చెయ్యాలో తెలీదు అనే ప్రాతిపదిక మీద పాశ్చాత్య ఆర్థికవేత్తలు ఆలోచన మొదలు పెడతారు. ఐతే ఐ.పి.సి.సి. విశ్లేషణ నుంచే ప్రారంభించి ఒక హేతుబద్ధ కార్యక్రమాన్ని రూపొందించు కోవచ్చు. కాని ప్రజలు, ప్రభుత్వాలు కలిసి పని చేసే హేతుబద్ధ ప్రణాళిక పెట్టుబడిదారీ విధానంలో ఎప్పటికీ తలెత్తదు. మెల్లగా మార్పులు చేస్తూ సామాజిక విధ్వంసాలని తగ్గించుకోవచ్చనే వాదన రెండు వందల ఏళ్ళ పెట్టుబడిదారీ పర్యావరణ దోపిడీ ముందు నిలవదు.

*(కౌంటర్ పంచ్‌లో వచ్చిన వ్యాసానికి అనువాదం)*



## నూతన ప్రజాస్వామిక విప్లవ వెలుగులో సామాజిక ఉద్యమాల అధ్యయనం

# విరసం 19వ సాహిత్య పాఠశాల విశేషాలు

- విరసం

'సామాజిక ఉద్యమాల గురించి విరసం తొలి నుండి తన అవగాహనను విస్తరించుకుంటూ వస్తున్నది. కొత్త మేధో వాతావరణం నేపథ్యంలో వీటిని మరోసారి, మరింత సిద్ధాంత రాజకీయ స్పష్టతతో మాట్లాడుతోంద'ని కీనోట్ ప్రసంగంలో పాణి అన్నట్లుగానే సామాజిక ఉద్యమాలు-ప్రజాస్వామిక విప్లవం అనే అంశం కేంద్రంగా ఫిబ్రవరి 7,8 తేదీల్లో బొబ్బిలిలో విప్లవ రచయితల సంఘం 19వ సాహిత్య పాఠశాల జరిగింది. 7వ తేదీ ఉదయం 11 గంటలకు కామ్రేడ్ గోరు మాధవరావు ప్రాంగణంలో పతాకావిష్కరణతో పాఠశాల ప్రారంభమైంది. అమరుడు గంటి ప్రసాదం సజీవ జ్ఞాపకాల మధ్య ఆయన పుట్టి, పెరిగి విప్లవాచరణ సాగించిన బొబ్బిలిలో ఆయన సహచరి కామేశ్వరి, అన్న సుబ్బన్నలు కలిసి అమరుల స్థూపం ఆవిష్కరించారు. ఆంధ్ర ఒరిస్సా సరిహద్దులోని గొట్ట ఎన్‌కౌంటర్ (1998)లో అమరురాలైన కామ్రేడ్ పోతనపల్లి సారక్క (చిట్టెక్క) సహచరుడు జోగి కోదండం ఎర్రజెండాను, కామ్రేడ్ చలసాని ప్రసాద్ విరసం జండాను ఆవిష్కరించారు. ప్రజాకళామండలి, విరసం సాంస్కృతిక బృందాలు విప్లవ గీతాలు ఆలపించారు.

బొబ్బిలికి చరిత్రలో రాజుల యుద్ధాల చరిత్ర ఉంది. శ్రీకాకుళ పోరాట వెల్లువలో బొబ్బిలికి ప్రజాయుద్ధ చరిత్ర, వారసత్వమూ ఉన్నాయి. రాజుల యుద్ధాల్లో మరణించిన ప్రజలకు, ప్రజాయుద్ధాల్లో అమరులైన విప్లవకారులకు జోహార్లు చెప్తూ కామ్రేడ్ యం.టి.ఖాన్ హాలులో, కామ్రేడ్ గంటి ప్రసాదం వేదికపై విజయనగరం జిల్లా విరసం కన్వీనర్ కెక్యూబ్ వర్మ ప్రారంభ సమావేశానికి ఆహ్వానం పలికారు. శ్రీకాకుళ ఉద్యమ సాంస్కృతిక సేనాని సుబ్బారావు పాణిగ్రాహిని, కళింగసీమ నుండి విప్లవోద్యమానికి, విప్లవ సాహిత్యోద్యమానికి ఎనలేని కృషి చేసిన ఐవి మాస్టారును, భూషణం మాస్టారును సభ ప్రత్యేకంగా గుర్తుచేసుకుంది. కాళీపట్నం రామారావు ప్రారంభోపన్యాసంతో మొదటి సెషన్ ప్రారంభమైంది. వయోభారం, తీవ్ర అనారోగ్యంలోనూ విరసం ఆహ్వానాన్ని మన్నించి ఆయన సాహిత్య పాఠశాలకు వచ్చి విరసం సభ్యులతో, విప్లవ సాహిత్యాభిమానులతో కాసేపు గడిపారు. విరసంలోనూ, విరసంతోనూ తన అనుబంధాన్ని గురించి చెప్తూ నేను మీవాడినే, వ్యక్తిగత కారణాల వల్ల సభ్యుడిగా ఉండలేకపోవచ్చేమోగాని విరసం ఆదేశిస్తే పనిచేయడానికి సిద్ధంగా ఉంటానని అప్పుడూ అన్నాను, ఇప్పుడూ అంటున్నానని అన్నారాయన.

కారా మాస్టారి ప్రసంగానంతరం సామాజిక ఉద్యమాలు-ప్రజాస్వామిక విప్లవం అనే అంశంపై పాణి కీనోట్ ఇచ్చారు. ఆయన సామాజిక ఉద్యమాలను, వాటి పరిణామ క్రమాన్ని స్థూలంగా నాలుగు దశల్లో పరిచయం చేశారు. అవి భక్తి ఉద్యమం, ఫూలే నాటి వలస కాలం, అంబేద్కర్ కాలంనాటి జాతీయోద్యమ దశ, వలసానంతర కాలం. భగవంతుని సేవించాలంటే బ్రాహ్మణుల కర్మకాండలు, యజ్ఞయాగాదులు అక్కర్లేదని, భగవంతునికి భక్తులకు నేరుగా సంబంధం ఉండాలని చెప్పిన భక్తి ఉద్యమం సాంఘిక విముక్తి ఆకాంక్షను మతరూపంలో వ్యక్తం చేసిందన్నారు. వలసకాలంలో సాంఘిక సంస్కరణలు రెండు స్రవంతుల నుండి వచ్చాయని, ఒకటి రాజారామ్మోహన్ రాయ్ వంటి ఆధిపత్య కులాల నుండి వచ్చిన సంస్కర్తలవైతే, రెండు అణచివేతకు గురవుతున్న కులాల నుండి వచ్చిన ఫూలే వంటి సాంఘిక ఉద్యమాలని, రెండిటి మధ్య ఉన్న మౌలికమైన తేడాను విశ్లేషించారు. పునరుజ్జీవన ఉద్యమం తిరిగి వేదాల్లోకి పోవాలని చెప్పిందికాని చార్వాక, బౌద్ధ ధర్మాల పునరుజ్జీవనం కోసం మాట్లాడలేదు. ఒకరకంగా ఇదే హిందుత్వ భావనకు పునాది. మరోవైపు ఫూలే ప్రాచీన అవైదిక సాంప్రదాయాలను ఎత్తిపట్టాడు. పురాణాల్ని తిరగేసి చెప్పి దళిత బహుజన కోణాన్ని ఆవిష్కరించాడు. భక్తి ఉద్యమాలు, సామాజిక ఉద్యమాలు నేరుగా సాంఘిక కోణంలో భూస్వామ్యానికి వ్యతిరేకంగా పోరాడాయి. అంబేద్కర్ లిబరల్ డెమాక్రటిక్ సిస్టంలో సామాజిక విముక్తిని ఆకాంక్షించారు. ఆనాటి కమ్యూనిస్టు ఉద్యమాలకు ఆయన దూరంగా ఉన్నారు. బూర్జువా వర్గం ప్రజాస్వామిక విప్లవానికి ద్రోహం చేసింది. సాంఘిక సమానత్వం, ఆర్థిక సమానత్వం నక్సల్బరీ వచ్చాక నూతన ప్రజాస్వామిక విప్లవ ఎజెండా మీదికొచ్చాయి. దున్నేవారికే భూమి నినాదంతో జరిగిన ఉద్యమాల్లో అంతర్లీనంగా సాంఘిక విముక్తి అంశం ఉంది. ఈ క్రమాన్ని చెప్తూ 80ల తర్వాత చాలా మార్పులు వచ్చాయి.. సాంఘిక ఉద్యమాలు, విప్లవోద్యమాలు వేర్వేరుగా సాగే పరిస్థితి వచ్చింది. దీన్ని విమర్శనాత్మకంగా చూడాలి. ఈ మార్పుల క్రమంలో దళిత ఉద్యమాలు బూర్జువా వ్యవస్థలో విలీనం కావడం గురించి పాణి చెప్పారు. దండకారణ్య విప్లవోద్యమంలో తెగల తరతరాల సంప్రదాయాల నుండి ఆదివాసులు, పితృస్వామిక పీడన నుండి మహిళలు సాంఘిక విముక్తిని సాధిస్తున్నారని బూర్జువా మార్గంలో సాంఘిక విముక్తి సాధ్యం కాదు, విప్లవ మార్గంలోనే సాధ్యమవుతుందంటూ ముగించారు.

మధ్యాహ్న సమావేశానికి చంద్రయ్య అధ్యక్షత వహించారు. కొత్త పుస్తకాల అవిష్కరణ అనంతరం 'వలసకాలంలో బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాలు-సాహిత్యం'పై రివేరా ప్రసంగించారు. భారతదేశంలో దాదాపు వందేళ్లకుపైగా సాగిన సామాజిక ఉద్యమాలను వర్గపోరాట చరిత్రలో భాగంగా అర్థం చేసుకోవాల్సి ఉంటుందని ఆయన చెప్పారు. ఒక సమాజ స్థాయిని, చైతన్యాన్ని అక్కడి ఉత్పత్తి సంబంధాల స్థితి నిర్ణయిస్తుందని, ఈ మేరకే ఆ సమాజంలోని ప్రజలు పోరాటాలకు సిద్ధం అవుతారని, అలాంటి సామాజిక, సాంస్కృతిక వ్యక్త వర్గ పోరాట రూపమే సామాజిక ఉద్యమాలని వివరించారు. స్వేచ్ఛా వాణిజ్య దశ అంతంతో మొదలై, సామ్రాజ్యవాద దశ ప్రారంభం వరకూ భారతదేశంలో సామాజిక ఉద్యమాలు కొనసాగినట్టు చెప్పారు. ఆధునిక పోరాటాల చరిత్రలో 1857 ఒక మైలురాయి అయినట్టే..సామాజిక ఉద్యమాల ఉధృతికీ అది గీటురాయిగా నిలిచిందన్నారు. ఈ గీటురాయి దగ్గరే సామాజిక మార్పునకు సంబంధించిన ప్రయత్నం.. సంఘ సంస్కరణల కుబుసాన్ని విడిచేసి, ఉద్యమాల బాటను చేపట్టిందని, ఈ క్రమానికి జ్యోతిరావు ఫూలే ఆద్యులుగా నిలిచారని తెలిపారు. ఈ పోరాటాలకు వలస పెట్టుబడి భూమికను ఏర్పాటుచేసిందని తెలిపారు. తన మార్కెట్ అవసరాల కోసం స్థానిక సామాజిక సంబంధాల్లో వలస పెట్టుబడి జోక్యం చేసుకొన్నదని, రెవెన్యూ వ్యవస్థను క్రమబద్ధం చేయడం కోసం రైత్వారీ పద్ధతి వంటి భూ

(మిగతా 50వ పేజీలో...)

సంస్కరణలను తీసుకొచ్చిందని చెప్పారు. అవన్నీ స్వల్ప సర్దుబాటు చర్యలే అయినా, బ్రాహ్మణుల అధికారాన్ని కుదుపునకు గురి చేశాయని, అదే సమయంలో శూద్ర, అతి శూద్రులను ఉత్సాహపరిచాయన్నారు. మహారాష్ట్రలో పూలే, కేరళలో నారాయణ గురు, అయ్యంకాళి, తమిళనాడులో రామస్వామి పెరియార్‌లను ఈ నేపథ్యమే సామాజిక ఉద్యమాలకు ప్రేరేపించిందని తెలిపారు. కులం బలాన్ని సంబంధాల్లో కాకుండా, కొందరు వ్యక్తులు లేక కొన్ని వర్గాల్లోనే చూడటం, కుల వ్యవస్థకు సాంస్కృతిక, సామాజిక సాధికారికతను అందిస్తున్న హిందూ వ్యవస్థ పరిధిని దాటి ఆలోచించలేకపోవడం ఈ ఉద్యమాల పరిమితి అన్నారు. దానివల్లనే రైత్వారీ పద్ధతి తదితర సంస్కరణల వల్ల లభించిన భూ యాజమాన్యంతో గ్రామ అధికారాన్ని సాధించుకొన్న మహారాష్ట్రలోని కున్బీలు, కేరళలోని నాయర్లు..సామాజిక ఆధిపత్యం కోసం ఒక దశ వరకూ సామాజిక ఉద్యమాలకు సహకరించి..ఆ తరువాత క్రమంగా బ్రాహ్మణులతోపాటు పాలక వర్గాల్లో భాగమయ్యారని తెలిపారు. అనంతరకాలంలో శూద్రుల్లోని ప్రధాన వర్గం సామాజిక ఉద్యమాలకు పరమ శత్రువుగా మారిందని..దానివల్ల పూలే 'శూద్ర- అతి శూద్ర' ఐక్యతా నినాదం ఆయన కాలంలోనే వట్టిపోయిందని చెప్పారు. దాన్నిప్పుడు పూలే ఆలోచన విధానంగా ప్రచారం చేసుకుంటూ, బహుజన సిద్ధాంతాన్ని ప్రవచిస్తున్నవారంతా వాస్తవంలో పూలేకు ద్రోహం చేస్తున్నారని, హిందూత్వ శక్తులతో అంటకాగడానికీ వెనుదీయడం లేదని విమర్శించారు. మరోవైపు.. సామాజిక ఉద్యమాలను వర్గపోరాట క్రమంగా అర్థం చేసుకొని..ఆ ఉద్యమాల పరిధిని విస్తరిస్తూ ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ ముందుకొస్తే.. ఆ ఆచరణను దండకారణ్య విప్లవోద్యమం విప్లవీకరించిందని వివరించారు.

ఈ సెషన్‌లో స్థానిక కళాకారుడు, దేశభక్త ప్రజాతంత్ర ఉద్యమం (పి.డి.యం) సభ్యుడు రామకృష్ణ ఏకపాత్రాభినయం అందర్నీ కదిలించింది. జముకు మీద పాటలు పాడుతూ విప్లవాన్ని, అమరత్వాన్ని తానే రాసి, తయారుచేసుకున్న ప్రజాకళారూపంలో ఆవిష్కరించాడు.

సాయంకాలం అరసవెల్లి కృష్ణ, కెక్యూబ్ వర్మ నిర్వహణలో కవిగాయక సభ జరిగింది. విరసం సభ్యులు, సాహితీ మిత్రులు కవిత్వం చదవగా, విరసం, ప్రజాకళామండలి, ఇతర గాయక మిత్రులు పాటలు పాడారు. పాతిక మంది కవులు, ఆరుగురు గాయకులు పాల్గొన్న ఈ కవిగాయక సభ ఆసక్తికరంగా సాగింది. అనంతరం విరసం సాంస్కృతిక బృందం 'ప్రజావైద్యులు' నాటికను ప్రదర్శించింది. షహీదా రాసిన 'ఇద్దరు శస్త్రకారులు' కథ ఆధారంగా ఉదయమిత్ర ఈ నాటికను రూపొందించారు. ఉదయభాను దర్శకత్వం వహించిన ఈ నాటికలో ఉదయ్, మల్లీశ్వరి, చంద్రయ్య, అలివేలు, సుదర్శన్, ఇక్బాల్, మేఘరాజు, రాజేష్, కృష్ణ, వెంకటేష్, ఉదయమిత్ర నటించారు. స్మిత సహాయ దర్శకురాలిగా ఉన్నారు.

రెండో రోజు ఉదయం 10 గంటలకు ఉజ్వల్ అధ్యక్షతన మొదటి సెషన్ ప్రారంభమైంది. అంబేద్కర్ 'సామాజిక సిద్ధాంతం-సాహిత్య ప్రతిఫలనం' అంశంపై కాశీం మాట్లాడారు. సామాజిక ఉద్యమకారుడిగా, సిద్ధాంతకర్తగా అంబేద్కర్ ఆవిర్భవించిన కాలంనాటి సామాజిక స్థితిగతులు, ఆయన జీవిత నేపథ్యం వివరించారు. అంబేద్కర్ రచనల నుండి ఆయన సిద్ధాంతాన్ని విశ్లేషించారు. చరిత్రకారులు చెప్పినట్లు ఆర్యులు విదేశాల నుండి వచ్చిన వారు కాదని, వేదాల్ని సృష్టించింది ఆర్యులు అనడం అబద్ధమని అంబేద్కర్ బలంగా వాదించాడని అన్నాడు. ఆయన శ్రమ విభజన గురించి కాదు, శ్రామిక విభజన గురించి చెప్పారని, 'దడి కట్టుకున్న వర్గమే కులం' అనే సుప్రసిద్ధ వ్యాఖ్యను గుర్తుచేశారు. దళితుల కోసం, మహిళా హక్కుల కోసం కూడా అంబేద్కర్ పోరాడారని ఆయన ఉద్యమ పంథాను వివరించారు. కులం పోవాలంటే కులాంతర వివాహాలు జరగాలన్నాడు అంబేద్కర్. కులం పోవాలంటే ఉత్పత్తి సంబంధాలు మారాలని అంబేద్కర్ అనుకోలేదని, మనుధర్మాన్ని, వేదాలను కాల్చివేస్తే కులం పోతుందని అనుకున్నాడని ఆయన సిద్ధాంతానికున్న పరిమితిని కూడా చెప్పారు.

తర్వాత కులం, మతం- కమ్యూనిస్టు విప్లవ పోరాటాలపై సియస్ఆర్ ప్రసాద్ మాట్లాడారు. ఈ సెషన్‌కు బాసిత్ అధ్యక్షత వహించారు. ప్రత్యేకించి కుల సమస్య మీద, మతతత్వం మీద కమ్యూనిస్టు పార్టీలు ప్రజల్ని సమీకరించి ఆయా నినాదాలపై ర్యాలీ చేయలేదని అంటూ కులాంతర, మతాంతర వివాహాలు, ఇతర సందర్భాలలో మతఛాందసవాద శక్తుల్ని కమ్యూనిస్టులు మిలిటెంటుగా ఎదుర్కొన్నారని సియస్ఆర్ అన్నారు. దళితులపై దాడులు జరిగినప్పుడు వారి పక్షాన నిలబడి బలమైన ఆందోళనలు నిర్వహించాయని గుర్తు చేశారు. ఆధిపత్య కుల, మతతత్వాన్ని వర్గ ప్రాతిపదికపై ఎట్లా అర్థం చేసుకోవచ్చో చెబుతూ రజినీ కొఠారి రాసిన 'క్లాస్ అండ్ కమ్యూనలిజం ఇన్ ఇండియా' వ్యాసంలోని అంశాలను ప్రస్తావించారు. ప్రపంచీకరణ మార్కెట్ సృష్టించే సంపన్న వర్గాల దృష్టిలో ఆదివాసులు, దళితులు, మైనార్టీలు అభివృద్ధికి ఆటంకమని, సామ్రాజ్యవాదానిదీ, మతానిదీ ఈ విషయంలో ఒకే తరహా వాదమని అన్నారు. మోడీ వచ్చాక బ్రాహ్మణ మత పునరుద్ధరణ జరుగుతోందని, మత దురహంకారానికి వ్యతిరేకంగా పనిచేసే సంస్థలు లేవని ఆయన అన్నారు. ప్రగతిశీల శక్తులు మతోన్మాదుల చేతిలో దెబ్బలు కాచుకునే స్థితిలో ఉండకూడదని, ఫాసిస్టు మూకలను మిలిటెంటుగా ఎదుర్కొనే స్వచ్ఛంద దళాలు రూపొందాలని అన్నారు.

భోజన విరామం తర్వాత కొత్త పుస్తకాల ఆవిష్కరణ జరిగింది. అనంతరం రాంకీ అధ్యక్షతన హిందుత్వ, సామ్రాజ్యవాదం- ప్రజాప్రత్యామ్నాయంపై జరిగిన చివరి సెషన్‌లో వరలక్ష్మి మాట్లాడారు. సమాజం ప్రజాస్వామికీకరణ చెందాలని 19, 20 శతాబ్దాల్లో అనేక సామాజిక ఉద్యమాలు జరిగాయని, బ్రిటీష్ పాలనానంతరం స్వదేశీ ప్రభుత్వం పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ద్వారా సాంఘిక విముక్తి, సోషలిజం వంటి వాగ్దానాలు చేసిందని, అయితే ఆచరణలో బూర్జువా ప్రజాస్వామ్యం విఫలం అయిందని ఆమె అన్నారు. అందుకనే నూతన ప్రజాస్వామిక విప్లవం గురించి మాట్లాడుతున్నామని, ప్రజాప్రత్యామ్నాయం అదేనని చెప్పారు. బూర్జువా ఆదర్శాలు అంతరించి ఫ్యూడల్ మతమౌఢ్యం వైపు వ్యవస్థ ప్రయాణం చేస్తున్నదని, సామ్రాజ్యవాద గుత్త పెట్టుబడికి, మతోన్మాద ఫాసిజానికి సంబంధం ఉందని అన్నారు. పైకి కనిపించే సాంస్కృతిక అంశాలకు, రాజకీయార్థిక అంశాలకు ఉన్న సంబంధం ఎటువంటిదో అర్థం చేసుకుంటేనే హిందుత్వ మనకు అర్థమవుతుందని, మోడీ ఒక చేత్తో భగవద్గీతను, మరో చేత్తో అణుబాంబును పట్టుకుని అమెరికా దన్నుతో పాలన సాగిస్తున్నాడని అన్నారు. పెరుమాళ్ మురుగన్‌పై దాడి చేసిన సంఘపరివార్ శక్తులు ఒక పరిణామ క్రమంలో ఆ ప్రాంతంలో రూపొందిన వ్యాపార వర్గానికి ప్రతినిధులని, ఒకప్పుడు పెరియార్ హేతువాద ఉద్యమంతో ప్రభావితమైన సమాజం ఆ తర్వాత ఎన్ని మార్పులకు లోనైందో ఆ సంఘటన నేపథ్యంలోని రాజకీయార్థిక, సామాజిక పరిణామాలు తెలియజేస్తాయని ఈ ఉదాహరణ హిందుత్వను అర్థం చేసుకోడానికి ఉపయోగపడుతుందని విశ్లేషించారు. అనంతరం పి.డి.యం. రామకృష్ణ ఒక వృద్ధ మహిళ ఏకపాత్రాభినయం రూపంలో కళింగసీమలో థర్మల్ విద్యుత్ ప్లాంట్ల కింద విస్థాపనకు గురవుతున్న ప్రజల పోరాటాన్ని, ప్రభుత్వ దమనకాండను కళ్లకు కట్టాడు. రెండు రోజులూ పుస్తకావిష్కరణ సెషన్‌లను కామ్రేడ్ జగన్, కామ్రేడ్ ఉదయభానులు నిర్వహించారు.

సాయంకాలం 5 గంటలకు విద్యుల్లత విజయ్‌కుమార్ వేదిక మీద బహిరంగ సభ జరిగింది. విరసం కార్యవర్గ సభ్యురాలు నల్లూరి రుక్మిణి

| సాహిత్య పాఠశాలలో ఆవిష్కరించిన పుస్తకాలు | | |
|---|---|---|
| పుస్తకం | ప్రచురణ | ఆవిష్కర్త |
| 1. కథల పంట-3 | విరసం | జి. కళ్యాణరావు |
| 2. జాజిపూల పరిమళం (షహీదా కథలు) | విరసం | పాణి |
| 3. ఒక మాట, ఒక సంభాషణ (షహీదా కవిత్వం) | విరసం | కెక్యూబ్ వర్మ |
| 4. సామాన్యుల సాహసం (నిత్య, మైనా, సుజాత కథలు) | విరసం | జి.ఎస్.చలం |
| 5. తీత్వాల్ కుక్క మరికొన్ని కథలు (సాదత్ హసన్ మంటో కథల అనువాదం) | విరసం | పరిమళ్ |
| 6. భారతదేశంలో ఉత్పత్తి విధానం- ఉత్పత్తి సంబంధాలు | విరసం | వై. రామచంద్రం |
| 7. స్టోలిపిన్ అభివృద్ధి నిరోధక కాలంలో | విరసం | ఎం. శ్రీనివాస్ |
| 8. కార్మికవర్గ పుత్రిక గజ్జల సరోజ | విరసం | హుస్సేన్ |
| 9. తూర్పు మధ్య భారతంలో విస్థాపన- ప్రజాప్రతిఘటన | విరసం | ఎ. అన్నపూర్ణ |
| 10. తెలుగు భాష-కొన్ని సంగతులు (వి.చెంచయ్య) | విరసం | చంద్రయ్య |
| 11. బీజభూమి (వివి కవిత్వం) | విరసం | విశాఖ వర్మ |
| 12. ఏప్రిల్ పండు (రివేరా కవిత్వం) | విరసం | బాలసుధాకర మౌళి |
| 13. తెహెల్కా అద్దంలో సర్కారు బింబం మరికొంత కవిత్వం (బాసిత్) | విరసం | సి. కాశీం |
| 14. ఆఖరి బిడ్డ (బాసిత్ నాటిక) | విరసం | ఉదయమిత్ర |
| 15. వేక్ అఫ్ తెలంగాణ (బాసిత్ ఇంగ్లీషు నాటిక) | విరసం | ఉదయమిత్ర |
| 16. దండకారణ్యం, ఒక ఆకుపచ్చని కల (కెనరీ దీర్ఘ కవిత) | విరసం | వరవరరావు |
| 17. పాదముద్రలు (శాఖమూరి రవి కవిత్వం) | విరసం | పాయల మురళీకృష్ణ |
| 18. ఫాల్గుణ (పద్మకుమారి నవలిక) | విరసం | కె.వి. కూర్మనాథ్ |
| 19. నల్లమల (పి.చంద్ నవల) | విరసం | ఎం. రాఘవాచారి |
| 20. లాల్‌బనో గులామీ ఛోడో (ఎన్కె దీర్ఘ కవిత) | విరసం | అరసవెల్లి కృష్ణ |
| 21. కాలిబాట (ఉదయమిత్ర కవిత్వం) | పాలమూరు అధ్యయన వేదిక | సిరికి స్వామినాయుడు |
| 22. ఆకాస ఉద్యమంలో అమరులు | దిక్సూచి | పచ్చల కిరణ్ కుమార్ |
| 23. అంతర్జాతీయ విప్లవోద్యమాల్లో ఆటుపోట్లు | దిక్సూచి | ఎన్.వేణుగోపాల్ |
| 24. అడవి పుత్రుడు మంగన్న | దిక్సూచి | రాజారాం |
| 25. ఈలం (కవిత్వం -వేముల ఎల్లయ్య, ఉదయభాను సంపాదకత్వం) | గుంపు సాహితీ సంస్థ | వరవరరావు |
| 26. విధ్వంసక అభివృద్ధి | మలుపు | రాంకి |
| 27. భారతదేశంలో కులసమస్య (అనురాధా గాంధీ) | మలుపు | సి.ఎస్.ఆర్. ప్రసాద్ |
| 28. అరుణతార కథలు 1 | చరిత | అట్టాడ అప్పల్నాయుడు |
| 29. అరుణతార కథలు 2 | చరిత | అట్టాడ అప్పల్నాయుడు |
| 30. కళింగాంధ్ర సమస్యలు-పోరాటాలు: బులెటిన్ 5 | వంశధార | ఎస్. రవికుమార్ |

అధ్యక్షత వహించి వర్తమాన రాజకీయ వాతావరణాన్ని వివరించారు. ఈ దేశంలో విధ్వంసకర అభివృద్ధి నమూనా విషయంలో మోదీకి కూడా చంద్రబాబే మోడల్ అని అన్నారు. విరసం సీనియర్ సభ్యులు చలసాని ప్రసాద్ మాట్లాడుతూ తెలుగు ప్రజలు రెండు రాష్ట్రాల కిందికి వచ్చినా.. విరసం రెండు రాష్ట్రాల ప్రజల తరపున మాట్లాడుతుందని అన్నారు. సాహిత్యం హృదయాలను కదిలిస్తుందని, సాహిత్యం సమాజ హృదయమని గోర్కీ అన్నారని గుర్తు చేస్తూ తెలుగు ప్రజల విప్లవ, ప్రజాస్వామిక పోరాటాల తరపున విరసం దృఢంగా నిలబడుతుందని అన్నారు. ప్రైవేటీకరణ వ్యతిరేక వేదిక నాయకులు పి.వి.రమణ మాట్లాడుతూ విశాఖతో సహా ఉత్తరాంధ్ర అంతటా సాగుతున్న విధ్వంసకర అభివృద్ధి గురించి విశ్లేషించారు. కోస్టల్ కారిడార్ విధ్వంస ప్రభావం కింద జనం నలిగిపోతున్నారని అన్నారు. గ్రామాలకు గ్రామాలే పాలకవర్గ అభివృద్ధి కింద మాయమైపోతున్నాయని, అయితే ఉత్తరాంధ్రలో దీనికి వ్యతిరేకంగా అనేక రూపాల్లో ప్రతిఘటన సాగుతున్నదని అన్నారు. తర్వాత కళ్యాణరావు మాట్లాడుతూ ఆంధ్రప్రదేశ్ నూతన రాజధాని నిర్మాణం పేరుతో జరుగుతున్న అక్రమాలను వివరించారు. రైతుల పంట పొలాల్లోనే రాజధాని కడతామని పాలకులు నిస్సిగ్గుగా సమర్థించుకుంటున్నారని అన్నారు. చివరగా వరవరరావు మాట్లాడుతూ పాలకుల విధ్వంసకర అభివృద్ధి నమూనాకు ప్రత్యామ్నాయం విప్లవోద్యమం దగ్గరే ఉందని, దండకారణ్యంలో ఇవాళ అది అమలువుతున్నదని అన్నారు. మోదీ ఈ దేశాన్ని హైందవీకరించాలని ప్రయత్నిస్తోంటే విప్లవోద్యమం ప్రజాస్వామికీకరించాలని, నూతన ప్రజాస్వామ్యంలోకి తీసికెళ్లాలని త్యాగపూరిత మార్గంలో కృషి చేస్తున్నదని అన్నారు. ఈ రెండు రోజులు ప్రజాకళామండలి కళాకారులు కోటి, జాన్, రాజనర్సింహ, రాణి, నాగేశ్వరరావు, నీలకంఠ, సంహాచలం, శ్రీకాంత్, శంకర్, చిరంజీవి, సుబ్బారావు, కాంటం, బంగారి పాటలు పాడారు. సామాజిక ఉద్యమాల అధ్యయనం, విప్లవోత్సాహం, స్ఫూర్తి కలగలసి సాహిత్య పాఠశాల ఆలోచనాత్మకంగా, విశ్లేషణాత్మకంగా, ఉద్వేగభరితంగా ముగిశాయి.



# -: స్వీకారం :-

**భారతదేశంలో ఉత్పత్తి విధానం ఉత్పత్తి సంబంధాలు**
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 20/-
పేజీలు : 47

**కార్మికవర్గ పుత్రిక గజ్జల సరోజ అమర షహీదకు జోహార్లు**
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 15/-
పేజీలు : 11

**Wake of Telangana? A docu... drama**
Basith
Published : Virasam
Rs. 10/-
Pages : 16

**అంతర్జాతీయ విప్లోద్యమాల్లోని ఆటు, పోట్లపై అధ్యయనం**
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 60/-
పేజీలు : 117

**స్టోలిపిన్ అభివృద్ధి నిరోధక కాలంలో...**
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 15/-
పేజీలు : 31

**తెలుగు భాష - కొన్ని సంగతులు**
వి. చెంచయ్య
ప్రచురణ : విప్లవ రచయితల సంఘం
వెల : రు. 15/-
పేజీలు : 40

**ఆకాస ఉద్యమ అమరులు**
ప్రచురణ : దిక్సూచి ప్రచురణలు
వెల : రు. 10/-
పేజీలు : 30

**కాలాన్ని వెనకేసిన మనిషి మానవ జీవన పరిణామ పదచిత్రం**
డా॥ దేవరాజు మహారాజు
ప్రచురణ : జీవన ప్రచురణలు
వెల : రు. 80/-
పేజీలు : 92

**చిగురించే మనుషులు కథలు (2009-2014)**
పలమనేరు బాలాజి
ప్రచురణ : పవిత్ర & ప్రణీత ప్రచురణలు
వెల : రు. 100/-
పేజీలు : 167

**భారతదేశంలో కులసమస్య**
అనూరాధ గాంధీ
అనువాదం : కె. సురేష్
ప్రచురణ : మలుపు
వెల : రు. 120/-
పేజీలు : 156

**విధ్వంసక అభివృద్ధి ఆరు దశాబ్దాల పాలన విధానాలు**
ప్రచురణ : మలుపు
వెల : రు. 170/-
పేజీలు : 264

**ప్రజా కళాతపస్వి డా॥ గరికపాటి రాజారావు**
కె. శాంతారావు
ప్రచురణ : వనమాలి
వెల : రు. 20/-
పేజీలు : 64

**ఆమె కవిత్వం**
చైతన్య ప్రకాశ్
ప్రచురణ : మట్టి ముద్రణలు
వెల : రు. 75/-
పేజీలు : 79

**రేణ మరికొన్ని కథలు**
చైతన్య ప్రకాశ్
ప్రచురణ : మట్టి ముద్రణలు
వెల : రు. 100/-
పేజీలు : 137

**కాలాన్ని అధిగమించి ("పశ్చిమాకాశాన" కవితలతో సహా)**
నిఖిలేశ్వర్
వెల : రు. 100/-
పేజీలు : 134

**ARUNATARA** A Literary and Cultural Telugu Monthly Journal of Revolutionary Writers' Association (VIRASAM)
• RNI Regn.No.21152/72 • Published on 23/03/2015 312 - March, 2015

సామాజిక ఉద్యమాలు - ప్రజాస్వామిక విప్లవం
బొబ్బిలి విరసం సాహిత్య పాఠశాల దృశ్యమాలిక



అమరుల స్థూపావిష్కరణ ,
పతాకావిష్కరణ
బహిరంగసభ
ప్రారంభోపన్యాసం చేస్తున్న కాళీపట్నం రామారావు
ప్రజాకళా మండలి,
విరసం సాంస్కృతిక బృందం కార్యక్రమాలు

Edited, printed, published and owned by Chalasani Prasad, H.No. 33-13-3, Seetharampuram, Vijayawada - 520 002
Printed at Nagendra Printing Press, Vijayawada - 520 002.
Editor : Chalasani Prasad



మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M176 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 57 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Bhanu |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |